# కృష్ణమూర్తి అధ్యయనం

## (చర్చితాంశాలు)

జె.యస్. రఘుపతిరావు

B.E., F.I.E., M.A.(Engl.), M.A.(socl)

ప్రకాశకులు

జనశ్రుతి పబ్లికేషన్స్, తిరుపతి.

Janasruti Publication - 6

KRISHNA MURTI ADHYANAM (CHARCHITAMSALU)
(Study of Krishnamurti - subjects discussed)
By J.S. Raghupathi Rao
15-79, Padmavati Nagar
Tirupati-517 502 (0877-2240827)

ప్రచురణ - 2004 సం॥

ప్రతులు : 1000

వెల : రూ. 35/-

ప్రతులకు :-

యస్.కె. గార్గి, ఆత్మారామాశ్రమం, గౌతమీనగర్,
కొవ్వూరు - 534 350, పశ్చిమగోదావరి జిల్లా.
(08813-231746)

విశాలాంధ్ర పబ్లిషింగ్ హైస్
బ్యాంక్ స్ట్రీట్, అబిడ్స్, హైదరాబాద్ -1,
040 -2595671

డి.టి.పి. : వినాయక గ్రాఫిక్స్, తిరుపతి.

ముద్రణ :-

శ్రీ పారాశర్య ముద్రాక్షరశాల, శ్రీవ్యాసాశ్రమము (వయా) ఏర్పేడు, చిత్తూరు జిల్లా.

# పరిచయ పత్రం

**కృష్ణమూర్తి పుస్తక పరిచయం:**

నెల్లూరు సెంటరులో రాఘవ విహార్ లాడ్జివుంది. దాని సొంతదారు మన్నెం శ్రీనివాసులు రెడ్డి, వారి తల్లి సీతారామమ్మ; మహర్షి శ్రీ మలయాళస్వామి శిష్యులు. తద్వారా నాకు మంచి సన్నిహితులు. నేనచట ఎగ్జిక్యూటివ్ ఇంజనీరుగా పనిచేస్తున్న రోజుల్లో (1981) ఒక సత్సంగం నడుపుతున్న శ్రీనివాసులు రెడ్డి "The first and last freedom" అనే కృష్ణమూర్తి పుస్తకం ఇచ్చారు. ఒక్క పట్టున చదివాను. నెల్లూరుకు 12 కి.మీ. దూరంలో నర్సింహకొండ వుంది. అక్కడ ఒక ఆశ్రమం వుంది. ఆశ్రమం నిర్వహిస్తున్న శ్రీ మహేశానందస్వామి కృష్ణమూర్తి పుస్తకాలు(12) ఇంగ్లండు నుంచి తెప్పించుకున్నారు. వాటన్నిటిని తీసుకొని వెళ్ళి చదివాను శ్రద్ధగా. ఇంకా కొన్ని పుస్తకాలు మద్రాసులోను, హైదరాబాద్‌లోను లభించాయి. చదివిన ప్రతి పుస్తకం నుంచీ ఆయా ముఖ్య విషయాలపై కృష్ణజీ బోధలు యథాతథంగా టైప్ చేయించుకొని, మూడు సంపుటాలలో భద్రపరచు కొన్నాను. వాటిని తర్జుమా చేసుకొని ఏవిషయానికి ఆ విషయంగా విడివిడిగా సంగ్రహించుకున్నాను.

**కృష్ణమూర్తి అధ్యయన కేంద్రాలు :**

1981 నుంచి వరుసగా 3 సంవత్సరాలు మద్రాసులో కృష్ణజీ ప్రసంగాలు ప్రత్యక్షంగా విన్నాను. కృష్ణజీపై ఆసక్తి మరీ మరీ పెరిగింది. మనసంతా నిండిపోయారు. "జీవన దర్శనం" వ్రాయడం మొదలుపెట్టాను. వ్యాసాలు వ్రాశాను. పత్రికల్లో సీరియల్స్ వ్రాశాను. కడప, తిరుపతి రేడియో కేంద్రాలలో ప్రసంగించాను. బాక్‌పబ్లికేషన్స్ ద్వారా, జనశ్రుతి ప్రచురణల ద్వారా పుస్తకాలు ప్రచురించడం ఆరంభించాను. ఇప్పటికీ కృష్ణజీ బోధలు రేడియో "సూక్తిముక్తావళి"లో చెప్తున్నాను. 1987కి జిడ్డుకృష్ణమూర్తి జీవన దర్శనం పూర్తిచేశాను. తర్వాత కృష్ణమూర్తి ఫౌండేషన్ వారి సహాయంతో దాన్ని ప్రకాశం చేశాను. 1988 ఫిబ్రవరి 17న శ్రీకాళహస్తిలో అధ్యయన కేంద్రం నెలకొల్పాను. 1990లో తిరుపతిలో విశ్వవిద్యాలయ ఆవరణలో మరో కేంద్రం పెట్టాము. కృష్ణమూర్తి పుస్తకాల తెలుగు తర్జుమాకు గ్లాసరీ నిమిత్తం వసంత విహార్‌లో తెలుగు ప్రముఖులతో సమావేశం పెట్టడానికీ, దానిమీదట ఋషివ్యాలీలో తెలుగువారి సమావేశం పెట్టడానికీ

నా ప్రేరణ తోడ్పడింది. ఋషివ్యాలీకి గాని, హైదరాబాద్ సెంటరుకు రాష్ట్రంలోని కృష్ణమూర్తి ఆసక్తి పరుల చిరునామాల జాబితాలను అందించాను. సభలు సెమినార్లు, నిర్వహించడమే గాక, రాష్ట్రమంతటా అధ్యయన కేంద్రాలు పెట్టడానికి, సంవత్సరానికి రెండు సమావేశాలు పెట్టడానికి స్టేట్ గేదరింగ్ కమిటీని రాజమండ్రిలో ఏర్పాటు చేయడమైంది. శ్రీకాళహస్తిలో రెండు రాష్ట్రస్థాయి సమావేశాలు, తిరుపతిలో యస్.వి. యూనివర్సిటీలో రెండు సమావేశాలు, ఒక సెమినార్, రెండు ప్రాంతీయ సమావేశాలు, కొవ్వూరులోను రాజమండ్రిలోను రెండు రాష్ట్రస్థాయి సమావేశాలు జరపడ మైంది. కొవ్వూరు రాజమండ్రి సమావేశాలలో ఎ.టి.బాబాజి, కెయస్. రామచంద్రరావు కన్వీనర్లుగా వ్యవహరించారు.

**శ్రీకాళహస్తి తిరుపతి కేంద్రాలు :**

కృష్ణమూర్తి అత్యంతావశ్యకమని మనసుకు రూఢియైనది. మరింత లోతుగా అధ్యయనం చేయాలనిపించింది. అధ్యయనంతో వచ్చే అవగాహన చర్చల ద్వారా బలపడుతుంది, స్పష్టత చెందుతుంది. చర్చ ఉభయ ప్రయోజనకారి. చర్చలకు స్థలానుకూలత కావలెను. తెరచిన మనసుతో కలుపుగోలుతనంతో పరస్పరం కలుసుకోవడానికి ఏర్పడేది కేంద్రం. అక్కడ పుస్తకాలు, టేపులు అందుబాటులో వుండాలి. ప్రశాంతత, పవిత్రత, తీవ్రత, క్రమత స్థలశుద్ధిఉండాలి. ఆశక్తిగా చేరిన మనుషులవల్ల కేంద్రాలు నడుస్తాయి. శ్రీకాళహస్తిలో వారం వారం చర్చ ఏడాదిన్నర సాగింది. కొంతకాలం 15 రోజులకొకసారి జరిగింది. మరికొంత కాలం నెలలో ప్రతి 3వ ఆదివారం జరిగింది. తిరుపతిలో కూడ అధ్యయన కేంద్రం పదేళ్ళు అదే విధంగా నడిచింది. తరువాత కాలంలో, అపుడపుడూ కలవడం జరుగుతోంది. శ్రీకాళహస్తిలో 20 మందివరకు, తిరుపతిలో 10 మందిదాక పాల్గొనేవారు.

**చర్చితాంశాలు :**

ఈ అధ్యయన కేంద్రాలలో చర్చించిన అనేక విషయాలలో ముఖ్యాంశాలు గ్రహించి, విషయపరంగా అప్పటికప్పుడు వ్రాసుకోవడమైంది. చాలా వరకు అలా తయారైనవి ఈ చర్చితాంశాలు.

అందులోనుబహుకొద్ది విషయాలు మాత్రం తీసుకోవడమైంది. "జిడ్డు కృష్ణమూర్తి

జన్మదినం'' (చివరిది) అను పత్రంలో మరికొన్ని చర్చితాంశాలు పేర్కొనబడ్డాయి. ఇవి సంక్షిప్తంగా ఉన్నాయి. సూక్ష్మంగా, స్పష్టంగా ఉన్నాయి. ఒక్కొక్క విషయం సులభ గ్రాహ్యంగా ఉంది. కృష్ణమూర్తిని పరిచయం చేసుకోదలచిన వారికి ఈ అంశాలు బాగా ఉపయోగపడగలవు. అధ్యయన కేంద్రాలు నిర్వహించేవారు కూడ వినియోగించు కోవచ్చు.

## చర్చల్లో పాల్గొన్నవారు :

శ్రీకాళహస్తి కేంద్రంలో సర్వశ్రీ చిరంజీవులు, అక్బర్‌భాషా, కె.రామమూర్తి, టి. రామమూర్తి, డా॥ ప్రతాప సిన్హ, సుదర్శనం, ప్రిన్సిపాల్ భాషా, పి.సుబ్రహ్మణ్యం, యస్. పెంచలయ్య, ఓంప్రకాష్ (అచలానంద స్వామి). బోధచైతన్య, చంద్రశేఖర్, యం.యస్. కృష్ణమూర్తి, యం. గంగరాజు, షేబ్‌బాండ్ సాహెబ్, ఇంకా కొందరు ఎక్కువ సమావేశాలకు హాజరయ్యేవారు. తిరుపతిలో డా॥ వేదపారాయణ, డా॥భాస్కరరెడ్డి, డా॥ సాంబశివారెడ్డి, డా॥ చిన్నయ్య, డా॥ మధుమూర్తి, హనుమంతు, శంకర రెడ్డి, వి.జి.కె. రెడ్డి, శంకరన్, డా॥ రామకృష్ణ దొరైస్వామి, చంద్రశేఖర్, అపుడపుడు కాళహస్తి సభ్యులు, కొందరు విశ్వ విద్యాలయ విద్యార్థులు పాల్గొనేవారు. ఈ సంపుటిలోని విషయాలను చర్చలలో పాల్గొన్నవారిలో డా॥ చిన్నయ్య, కె. రామ్మూర్తి, డా॥యన్. భాస్కర రెడ్డి ప్రభృతులు చూశారు. ఈ పుస్తకాన్ని ఆమూలాగ్రంగా పరిశీలించి, పరిష్కరించిన శ్రీస్వామి అచలానందసరస్వతివారికి, డా॥జి. వేదపారాయణ గారికి, ఎ.టి. బాబాజీ గారికి కృతజ్ఞతలు.

పాఠకులు శ్రద్ధగా అధ్యయనం చేయగలరని ఆశిస్తున్నాను.

తిరుపతి.

15-8-03

ఇట్లు

**జె.యస్. రఘుపతిరావు**

# స్వాధ్యాయనానికి దారి తీసింది

-స్వామి అచలానంద సరస్వతి

శ్రీ రఘుపతిరావుగారు, శ్రీకాళహస్తిలో నిర్వహించిన జిడ్డుకృష్ణమూర్తి అధ్యయన చర్చల్లో, అప్పట్లో నేను కూడా పాల్గొన్నాను. ఈ చర్చలను కొనసాగించడంలో వారు ఎంతో శ్రద్ధ ఉత్సాహాలు చూపేవారు. ప్రతీవారం చర్చకు ఒక క్రొత్త విషయాన్ని ప్రతిపాదించేవారు. ఆ విషయం జిడ్డుకృష్ణమూర్తి తమ టాక్స్‌లో విపులీకరించి ఉండేవారు. అయితే ఇక్కడ కృష్ణమూర్తిని ప్రమాణంగా మాత్రం తీసుకునే వారు కాదు. ఆలోచన చేయటంలో స్వేచ్ఛను ఇచ్చేవారు. చివరికి కృష్ణమూర్తి వివరణలతో సమన్వయం చేసేవారు.

సమావేశంలో చర్చకు చాలా వరకు చదువుకున్నవారే పాల్గొనేవారు. అయితే ఒకరిద్దరు తప్ప, మిగతావారంతా జిడ్డుకృష్ణమూర్తి ఆలోచనా ధోరణికి క్రొత్తవారే. అయినా ఉత్సాహంగా చర్చించేవారు. రకరకాల అభిప్రాయాలను వ్యక్తం చేసేవారు. క్రమశిక్షణతో మాట్లాడుకునేవారు. వారి మధ్యలోని విభిన్న అభిప్రాయాలను దృష్టిలో పెట్టుకుని, సమాధానపరచటం చాలా కష్టమైన వ్యవహారం. శ్రీ రఘుపతిరావు గారు చాలా ఓరిమితో ప్రశాంతంగా ఆ వ్యవహారం నడిపేవారు. అందరికీ అంగీకార యోగ్యంగా చర్చను సమీక్షించేవారు. జిడ్డుకృష్ణమూర్తి ఆలోచనా రీతితో సమన్వయం చేసేవారు. ఎందుకంటే, అది జిడ్డుకృష్ణమూర్తి ఆలోచనకు సంబంధించిన అధ్యయన చర్చ కదా! అలా జిడ్డుకృష్ణమూర్తి ఆలోచన అందరికీ అందేలా చేసేవారు.

చర్చ దినమంతా కొనసాగేది. చివరికి శ్రీ రఘుపతిరావుగారు ఆనాటి విషయ చర్చను సారాంశంగా రాసుకునేవారు. అంతకుముందే వారు ఆనాటి విషయం గూర్చి కొంత సమాచారం - కొన్ని అంశాలు రాసుకుని ఉండేవారు. ఆ నోట్సు - చివరి సమీక్షా సారాంశం రెండూ కలసి, సంక్షిప్తంగా ఈ పుస్తకంలోని విషయాలుగా తయారయ్యాయి. వీటిల్లో చెప్పదలచిన విషయాన్ని వారు సూక్ష్మంగా సూటిగా అందించే ప్రయత్నం చేశారు.

ఈ పుస్తకంలోని విషయం ఒక నూతన ప్రక్రియకు ఒరవడి పెడుతుంది. ఈ ప్రక్రియ సంక్లిష్టమైనదే. పైగా ఎంతో బాధ్యతతో కూడుకున్నట్టిది. అయినా శ్రీ రఘుపతిరావుగారు ఎంతో సవ్యంగా అందించారని, నా అభిప్రాయం.

ఈ సంకలనాన్ని నేనెంతో శ్రద్ధగా, లోతుగా, సంపూర్ణంగా, నిష్పక్షపాతంగా పఠించాను. యథాశక్తిగా, భాషాపరంగా -భావవ్యక్తీకరణ పరంగా అవసరమైన సవరణలు చేశాను.

అదివరకే నాలో సంప్రదాయ వేదాంత సిద్ధాంతాలు బలంగా నాటుకొని ఉన్నాయి. వివేకానంద రామకృష్ణుల అభిప్రాయవెల్లువడలో కొట్టుకుపోయాను. కాని మానసిక అలజడి తగ్గలేదు. పరమాత్మను అందుకొనే సాధనే ఉన్నతమనుకొని అత్యంత అహంకారిగా మారి పోయాను. సర్వోత్తముడిని అనే భావన కలిగింది. దాంతో నా సంబంధాలన్నీ వికటించాయి. నా జీవితమే దుర్భరమైంది.

ఈ అధ్యయన చర్చలు నాకెంతో దోహదం చేశాయి. నన్ను మేల్కొల్పాయి. నాలోని బలహీనతలను చూపించాయి. నేను జాగృతమయ్యాను. వినమ్రుడనయ్యాను. స్వాధ్యాయనానికి - తక్షణ మార్పుకు, వినూత్న సత్యజీవనానికి చర్చలు దారి తీశాయి. నా సంప్రదాయ గతజీవితం ఒక్కసారిగా రూపాంతరం చెందింది. ప్రస్తుతం నేను పైకి మాత్రం సాంప్రదాయిక సాధువును, లోపల మాత్రం రూపాంతరం చెందిన మనిషిని. ఇప్పుడు మాత్రమే నాలో నిజమైన సంన్యాస జీవితం ప్రారంభమైందని చెప్పగలను.

ఈ గ్రంథస్థ విషయాలు పాఠకులందరినీ ఆసక్తిగా చదివిస్తాయి. మేలు కొలుపుతాయి. వారి జీవితాలను ఉత్సాహభరితం - ఆనందయుక్తం - సుఖప్రదం - శాంతిధామంగా మారుస్తాయి. అధ్యయనం చేసి చూడండి, చేయించి చూడండి, మీరు కోల్పోయిన నిధి మీకు దొరుకుతుంది.

పాలకొల్లు

**22-11-2003.**

# విషయసూచిక

## జిడ్డు కృష్ణమూర్తి అధ్యయనం
## (చర్చితాంశాలు)

## అనుబంధం -1 : ప్రవచనసప్తాహం



### సమానార్థాలు

| | |
|---|---|
| అనుభవం | : Experience (past) |
| అనుభూతము | : Experienced (past) |
| అనుభూతి | : Experiencing (present) |
| తెలివి లేక ప్రజ్ఞ | : Intelligence |
| బుద్ధి (మేధస్సు) | : Intellect |
| అవగాహన | : Understanding |
| అసాధారణమైన | : Extraordinary |
| పరిశీలిన, పరికించుట | : Observation |
| సంవేదన | : Sensation |
| మతపరమైన మనసు | : Religious mind |
| అన్యత్వం | : Otherness, blessed ness |
| పరివర్తన, ఉత్పరివర్తన | : Transformation, Mutation |
| సమూలమైన మార్పు | : Radical change |

# జిడ్డు కృష్ణమూర్తి అధ్యయన కేంద్రం
# మొదటి సమావేశం

ఈనాడు (ఫిబ్రవరి 17వ తేదీన) విశ్వ విఖ్యాత తాత్విక వేత్త అయిన శ్రీ జిడ్డు కృష్ణమూర్తి గారి రెండవ వర్ధంతి. ఈ సందర్భంగా శ్రీకాళహస్తిలో కృష్ణమూర్తి తత్వ చింతన గురించి సామూహిక చర్చా వేదికను నిర్వహించాం. కృష్ణమూర్తి తత్వపరిశోధనలో డాక్టరేట్ పట్టా పొందిన తిరుపతి విశ్వవిద్యాలయ స్కాలర్ శ్రీవేద పారాయణ సంధాతగా వ్యవహరించారు. కృష్ణమూర్తి జీవితాంశాల గూర్చిన గీతాన్ని శ్రీమతి యస్. అన్నపూర్ణ ఆలాపించిన పిదప, ఎన్నికలేని ఎరుక (Choiceless awareness) అను అంశముపై గోష్టి జరిగింది.

**ఎరుక**

బహిర్గత విషయాలన్నిటికి స్పందిస్తూ, జీవిస్తూ, అంతర్గత విషయాలపై గూడ సంపూర్ణ దృష్టి కల్గియుండుట సమమైన ఎరుక అని అవగాహన అయింది. వ్యక్తి, సమాజం ఒకటే. సమాజంలో నున్న సమస్య గూర్చి పట్టించుకొని, కారణం తెలిసికొని పరిష్కరించు కొనవలసినదేగాని, దానికి దూరంగా పారిపోవడంగాని, వ్యక్తిగత మోక్షమో, సుఖమో, లాభమో చూసుకోవటం గాని ఎరుక (జాగృతి) అనిపించుకోదని వేదపారాయణ చెప్పారు.

**పరిష్కారం**

ఒక దివ్యశక్తికి కట్టుబడి యుండుటం వలన, దైవ సంబంధమైన క్రమశిక్షణ, అభ్యాసం పాటించడం వలన సమస్యలు తొలగునని రామమూర్తి ప్రతిపాదించారు. అయితే ఉన్న విషయాలను ఉన్నట్లు అర్థం చేసుకోవటం వలన వ్యక్తిగా సమస్యను గుర్తించి, స్పందించి, పరిష్కరించుకొనవలెనే గాని, విషయాన్ని విడిచి ఏదో సాధన చేయటం వలన పరిష్కారం లభించదని చర్చలో తేలింది. బుద్ధుడు సమస్యా పరిష్కారాన్ని గురించి సాధన చేసాడు గదా అన్న అన్నపూర్ణ ప్రశ్నకు, విరక్తితో బుద్ధుడు సంఘాన్ని త్యజించి వెళ్లలేదు. దుఃఖపరిష్కార మార్గాన్ని అన్వేషించేందుకు తగు స్థలం, సమయం, అవకాశం ఏర్పరచుకొని పరిష్కారం కనుగొని, దాన్ని సమాజానికి ప్రబోధించేందుకు తిరిగి సమాజంలో ప్రవేశించారు - అని వేదపారాయణ అన్నారు.

**కంప్యూటరు - మనసు**

మానవుడు తన మేధస్సుతో కంప్యూటరును సృష్టించి దానిపై పూర్తిగా ఆధారపడుచున్నాడు. గురువులకు, నమ్మకాలకు, దేవుళ్లు మొదలగు వాటికి బానిస అయినట్లే కంప్యూటరుకు కూడ బానిస అవుతున్నాడు. కంప్యూటరు సృష్టించడం వల్ల ఏర్పడిన తీరికను ఏ ప్రలోభాలకు మానవుడు వాడుకొను చున్నాడో! మానవుని మనస్సును పదునుగా, స్వేచ్ఛగా, స్పందనా పూర్వకంగా, ఎరుకతో, నిజజ్ఞానంతో వుంచుకోవడం ఎంతైనా అవసరమని జిడ్డు కృష్ణమూర్తి అధ్యయనం ద్వారా అవ గాహన కుదిరింది. కంప్యూటరుకు విషయమందిస్తే పనిచేస్తున్నట్లు, మనసుకు ఎవర్నో, ఏ పుస్తకాన్నో, ఏ సంప్రదాయాన్నో ఏ విషయాన్నో అభ్యాసం చేయిస్తే ఆవిధంగానే తయారై స్వేచ్ఛ కోల్పోయి పనిచేస్తుంది. ఈ వాస్తవాల్ని గ్రహించమని జిడ్డుకృష్ణమూర్తి ప్రబోధం.

సత్యం, వాస్తవమైన మతం, సాంఘిక రుగ్మతల నివారణకు, అవగాహన మున్నగు అంశాలకు సమయం చాలకపోవడంతో వాటిని వచ్చే చర్చా వేదికకు వాయిదా వేయడమైంది.

నిర్వాహకులైన జె.శ్రీ రఘుపతిరావు వ్రాసిన 'జిడ్డుకృష్ణమూర్తి జీవిత సంగ్రహం' అనే చిన్న పుస్తకాన్ని శ్రీ వేదపారాయణ ఆవిష్కరించారు. తెలుగులో వ్రాసిన 'కృష్ణసూక్తము' అనే జిడ్డుకృష్ణమూర్తి సూక్తుల పుస్తకాన్ని కూడ పదుగురికి ఇచ్చారు.. 'జిడ్డు కృష్ణమూర్తి జీవిత దర్శనం' అనే ఉద్గ్రంథమును త్వరలో అచ్చు వేస్తామని చెప్పారు.

శ్రీయుతులు జె. దశరథరామయ్య, ఇ. సుబ్బారావు, పా.సుబ్రహ్మణ్యం, శంకరానందస్వామి, పి.పాపయ్యనాయుడు, డా॥కె. నారాయణస్వామి, యం.గంగరాజు మున్నగు వారితో పాతిక మందికి పైగా సభ్యులు పాల్గొన్నారు.

స్కూలు విద్యార్థులు, అధ్యాపకులతో సహా సుమారు 200 మంది వీడియో ప్రదర్శన తిలకించారు.



## మొదటి సమావేశంలో

ఈ క్రింది తీర్మానాలు చేశాం :

1. జిడ్డు కృష్ణమూర్తి అధ్యయన కేంద్రం యేర్పాటుచేసి, నడుపుట.
2. అధ్యయన కేంద్రం తరపున ప్రతినెల ఒకసారి, ఆసక్తి గల వారందరు శ్రీకాళహస్తిలో కలిసికొని చర్చించుట.
3. జిడ్డు కృష్ణమూర్తి అధ్యయన కేంద్రానికి జె.శ్రీరఘుపతిరావు కన్వీనరుగా నుండుట.
4. జిడ్డు కృష్ణమూర్తి తత్త్వం గూర్చి తెలుగులో చిన్న చిన్న పుస్తకాలు అచ్చువేయించుట.
5. ఈ అధ్యయన కేంద్రంలో చేరదలచినవారిని, తమ పేర్లు నమోదు చేసికోమని కోరడమైనది.
6. ఈ అధ్యయన కేంద్రం చర్చాగోష్ఠిలో ఆసక్తి పరులెవరైనను పాల్గొన వచ్చును. విధి నిషేధాలేవియులేవు.
7. వివరాలకు దిగువ చిరనామాను సంప్రదించ గలరు.

కన్వీనరు

17.2.88 జిడ్డుకృష్ణమూర్తి అధ్యయనకేంద్రం

శ్రీకాళహస్తి C/o శ్రీ సాధురామలింగస్వామి సంస్కృత పాఠశాల



# ధ్యానం - సత్యం - మతం

రెండవ సమావేశం 20.3.88న జరిగింది. ధ్యానం, సత్యం, మతం అను అంశాలగూర్చి చర్చించారు.

ఆలోచన లేకుండా పంచేంద్రియాలు ఒకేసారి పనిచేసి మనసు సంపూర్ణంగా స్పందించడం ధ్యానమవుతుందని శ్రీబోధచైతన్య బ్రహ్మచారి చెప్పారు. మానవుడు ఏదో ముద్రనో, చిహ్నాన్నో, వర్ణాన్నో, మతవిశ్వాసాన్నో, రాజకీయ ముసుగునో ధరించి వెదకడం మొదలు పెడితే సత్యం వుండదు. అదనంగా తెచ్చి పెట్టుకున్నాయన్నీ సత్యానికి విరుద్ధమైనదే, సత్యాన్వేషి అనుభవ నిబద్ధతకు లోను కాకూడదు. స్వేచ్ఛతో చేసే పరిశీలన సత్య స్ఫూరక మౌతుంది. సత్యం అనిర్వచ నీయం, జీవితం అసత్యంగా వుందని తెలిసికోవడమే మనకు కావలసిందని శ్రీవెంకటేశ్వర విశ్వవిధ్యాలయ అధ్యాపకుడు డా॥జి. వేదపారాయణ చెప్పారు.

ఏ విధంగాను మనుజులను విభజించని మానవతా జీవనమే నిజమైన మతం. మానవుడు, మానవుడుగా వుంటే, సక్రమ సంబంధం కల్గివుంటే, బాధ్యతతో జీవిస్తే, ప్రేమగా వ్యవహరిస్తే ఇంతకన్నా మించిన మతం ఏమి కావాలి? ఇప్పుడు వ్యాపకంలో వున్న మతం మానవాళిని చేల్చి, సంఘర్షణ సృష్టిస్తుందికదా! ప్రచారం లో వున్న దైవభావం ఆశలతో కూడివుంది కదా! ఏకత్వం మంటే అందరూ ఒకటే. (Alone - All are one) వ్యక్తిత్వ మంటే అవిభాజ్యం (Individual - indivisible) ~~ఈ~~భావనలున్న జీవితమే అసలు మతజీవితమని జె.శ్రీరఘుపతిరావు గోష్టిని సమన్వయించారు.

మూడవ సమావేశం 24-4-88న జరిగింది. ఆలోచన ఘర్షణలకు మూల కారణం అను విషయం చర్చనీయాంశమైంది. ఆలోచన - మాట - భావం అన్నీ వొకటే. ఆలోచన మరొక ఆలోచనను కలుగజేస్తుంది. అది ఒక వస్తువుమీదో, అనుభవంమీదో, జ్ఞానంమీదో, గతం మీదో ఆధారపడి వుంటుంది. దానికి స్వతంత్ర ప్రతిపత్తిలేదు. కనుక అది సత్యంకాదు. స్వాభావికమైన వునికి, లేనిదానిమీద కాలూనడానికి వీలులేదు. భావం సత్యమనుకుంటే అనేక భావాలు పడుతుంటాయి. గనుక ఘర్షణలురాక తప్పదు. వస్తువే వాస్తవమైంది. దాన్ని గూర్చి అభిప్రాయం వాస్తవం. వాస్తవానికి అవాస్తవానికి మధ్య ఘర్షణవుండి తీరుతుంది.

ప్రస్తుతంలో ఆలోచన వుండదు. గతంలో ఆలోచన ప్రస్తుతానికి గతానికి

జరిగే సంఘర్షణే ఆలోచన. గతం భవిష్యత్స్వభావంలో వొకటే. గతం జీవంలేనిది. ఆలోచనా జీవం లేనిదే. నిత్య జీవితంలో ఆలోచన ఎంతవరకు అవసరం. ఘర్షణగాని పరిష్కారముగాని ఆలోచనవలనే ఏర్పడుతుంది. ఆలోచన కేవలం సంకేతం మాత్రమే. పేరు, ఆలోచనన వొకటే. గుర్తింపు కూడ ఆలోచనే. గుర్తింపుకు కనీస ఆలోచన చాలు. అంతకుమించిన గుర్తింపులు, పదాలు, చిక్కులు తెచ్చి పెడ్తున్నాయి. కులం పేరుతో, మతం పేరుతో, సిద్ధాంతం పేరుతో, దేవుడి పేరుతో గుర్తింపులు పొందడం విభేదాలకు కారణమవుతుంది. ఆలోచన లేకపోతే విభేదాలు లేవు. పదాలు జ్ఞానంతో, గతంతో బరువెక్కిపోయాయి. మన కళ్లల్లో కూడ గతమే ప్రసరిస్తుంది. కళ్లకూడబరువెక్కినాయి. గతం వల్లేగాని ప్రస్తుతం వల్ల బరువెక్కవు. ఒక మనిషి తెలుసంటే అతనికి గతమే తెలుసు.

ఆలోచన పరస్పర విరుద్ధం. అస్తిలోనాస్తి, నాస్తిలో అస్తి కల్గడం ఆలోచనవల్లే. ఆలోచన పవిత్రం కాదు. జ్ఞానం పవిత్రం కాదు. ఆలోచన లేకుండా ప్రేమ వుండాలి. ఆలోచన ఎక్కడ ప్రమాద కరమైందో గ్రహించాలంటే ధ్యానం అవసరం. ఆలోచన అంతం చేయడమే ధ్యానం. అది నిత్యజీవితంలో వుండాలి. అంటే ధ్యానంలో జీవితం సాగాలి. అని డా॥ వేదపారాయణ సంక్షిప్తంగా ప్రసంగించారు.

భౌతిక సుఖానికి, భాష, విజ్ఞానాభివృద్ధికి మెదడును కండిషన్ చేయాలి. కాని మానసిక తృప్తికి మస్తిష్కాన్ని కండిషన్ చేయడం మనస్సవుతుంది. అలాంటి మనస్సు అనర్థదాయకం. ఎందుకంటే అవసరంగా కండిషన్ చేయడం వల్ల నేను హిందువును, అతడు ఆంగ్లేయుడు అని అంటుంది మనస్సు. మనిషిగా వుంటే ప్రేమించగలవు. హిందువుగా వుంటే వాస్తవానికి విరుద్ధంగా వుంటావు. అందుచే ప్రేమ వుండదు. కనీస అవసరాలకు కండిషన్ చేసి, మిగతా మెదడును స్వేచ్ఛగా వదిలితే మనసు వివేకవంతంగా వుంటుంది. మనసుకు మెదడు బాగవుపయోగ పడుంది. ప్రేమ వుంటుంది, తెలిసివుంటుంది - అని గోష్టిలో శ్రీమాధవురావు (రాయలసీమ రెసిడెన్షియల్ కాలేజి లెక్చరర్ చెప్పారు), శ్రీ రఘుపతిరావు (కన్వీనర్) సర్వ శ్రీ చంద్రశేఖర్, అక్బర్, గణేశం మాష్టారు మున్నగు వారు పాల్గొన్నారు.

నాల్గవ సమావేశం "నమ్మకం, భయం జీవితాన్ని హరించే కవలలు'' అను విషయంపై 22-5-88న వుంటుందని కన్వీనర్ ప్రకటించారు. 4-5-88

# మానసికంగా కాలం లేదు - మనసు నిండా ఖాళీవుండాలి

శ్రీకాహస్తిలో 19.6.88న జరిగిన జిడ్డుకృష్ణమూర్తి అధ్యయన సమావేశానికి శ్రీ చంద్రశేఖర్ సంధాతగా వ్యవహరించారు.

నిత్య జీవిత వ్యవహారాలకు, విజ్ఞాన శాస్త్ర అభివృద్ధికి చారిత్రకాంశాలకు కాలెండర్ టైమ్ అవసరం. అందుకని నిన్న నేడు రేపుగా విభజన చేసికున్నారు. కాని దాన్ని మానసికంగా వర్తింపజేసికోరాదు. మానసికమైన మార్పునకు కాలంతో పనిలేదు. చెడ్డవాడు మంచివాడు కావడానికి కాలమవసరంలేదు. కాని ధ్యేయం, ఆదర్శం పెట్టుకొని కాలాన్ని ఆలోచనగా, సాధనగా, శిక్షణకు వ్యవధిగా వాడు కొంటున్నారు. ఇది తప్పు. దీనివల్ల కపట వర్తన, ద్వంద్వ జీవితం, ఘర్షణ సంభవిస్తున్నాయి. రేవు అనేది మానసికంగా లేనివాడు ఈ రోజు అద్భుత పరిణామంతో జీవించగలడు. కనుక మానసికంగా కాలం లేదు.

విశాల వినీలాకాశాన్ని చూసినపుడు మనసు ఆహ్లాదం చెందుతుంది. స్థలం, నివాసవసతి ఎంత విశాలంగా వుంటే జీవనానికి అంతవిశాలతచేకూరుతుంది. అట్లే మనసులో ఎంత ఖాళీ వుంటే అంత ఔదార్యముంటుంది. ఆకాశంలో మేఘాలు వ్యాపించినట్లుగా మనసు నిండా అంత ఆలోచనలుండరాదు. ఉరుములు మెరుపుల్లాగ మనసులో ఘర్షణలు చెలరేగరాదు. వర్షాలతో నిండిపోయినట్లు మనస్సు సంకుచితం కారాదు. అంటే మనసులో అహం అనే కేంద్రం వుండరాదు. అప్పుడే మనసు విశాలంగా, ఖాళీగా వుంటుంది. అదే స్పేస్ అట్లుండాలంటే మనస్సులో నమ్మకాలు, భయాలు, సిద్ధాంతాలు, ప్రతిరూపాలు ఏమాత్రం చేరరాదు.

దేశకాలాల ప్రాధాన్యత సమగ్రంగా గ్రహించిన నాడు మానవుని జీవితం ముక్కలు ముక్కలు కానేరదని తెల్పారు

17-7-88



# నమ్మకం, భయం వినాశాత్మకాలు

భౌతిక సంఘటన జరిగినపుడు అసంకల్పితంగ ప్రతిచర్య జరుగుతుంది. అది సహజం. భయంకాదు. ఆ పిదప చేసే ఆలోచన వల్లనే భయం పుడుతుంది. భయంనుండి కాపాడడానికి నమ్మకం బయలు దేరుతుంది. నమ్మకం భవిష్యత్తుకు సంబంధించింది. వర్తమానాన్ని గూర్చి వాస్తవ అవగాహన వుంటేభయమూ నమ్మకము పుడతాయి. అవగాహనే సత్యావిష్కరణ. నమ్మకం మనుషుల్ని విడదీ స్తుంది. ఘర్షణ సృష్టిస్తుంది. దేవుడు, సత్యం అంటే ఏమిటో తెలిసికోడానికి అది అడ్డు తగుల్తుంది. జీవితానికి వేరైనది ఏదో వుందని భ్రమ కల్పిస్తుంది. అది అసత్యాన్ని మాత్రమే అంటిపెట్టుకొని వుంటుంది. కాబట్టి అనర్థాలకు, హింసాకాండకు దారి తీస్తుంది. 22-5-88 న శ్రీకాళహస్తిలో జరిగిన జిడ్డుకృష్ణమూర్తి అధ్యయన సమా వేశంలో యస్.వి. యూనివర్సిటీ స్కాలర్ శ్రీవేదపారాయణపై విధంగా వివరించారు.

నమ్మకం, భయం స్వార్థపూరితాలు. పరస్పరాధార భూతాలు. 'నేను' అనుదానితో బలిసి వుంటాయి. 'నేను' ఎంత ఎక్కువైతే నమ్మకం అంత ఘనీభవిస్తుంది. దాంతో పాటు తెలిసిందాన్ని గూర్చి తెలియందాన్ని గూర్చి కూడ కల్గే ఆశనిరాశలవల్ల భయం కల్గుతూ వుంటుంది. మరణంలో తనువు జారిపోవడానికన్న తనుమనములు సంచయంజేసికున్న విశ్వాసాలు సౌఖ్యాలు ముక్తి కాంక్షలు మున్నగునవి పోతాయనే భయం కల్గుతుంది. తెలియదాన్ని గూర్చి భయపడుట ఎందుకని శ్రీ రఘుపతిరావు ప్రశ్నించారు?

నమ్మకమేర్పడ్డతర్వాత దానికి సంబంధించిన వరస కార్యక్రమాలు వత్తిడి ఎక్కువగా వుంటుందని, నమ్మకం వల్ల స్వావలంబన గాని శక్తిగాని అమాయికత గాని వుండవని, నిజజీవితంనుండి భయంతో పారిపోయేవాడే నమ్మకాన్ని పట్టుకుంటాడని, అవి ప్రేమకు బద్ధ శత్రువులని చెప్పారు. ఆ పేక్షతో ఒకే పద్ధతిలో వుండాలను కొన్నపుడు, నమ్మకాన్ని ప్రోదిచేసికొన్నపుడు, భయం పుడుతుందని, నమ్మకస్తుడే దోచుకోబడతాడని, తన్నుతాను అర్థంచేసికోలేడని విషయాలు చర్చలో వచ్చినాయి. సంపూర్ణ స్వేచ్ఛలోనే ప్రేమతో, మంచితనంతో పువ్వులా వికసించే అవకాశ ముందని ముగించారు. ఏడవ సమావేశం 19.6.88న "దేశాకాలాలు" (Space & Time) అను అంశంపై వుంటుందని కన్వీనరు ప్రకటించారు. 12.6.88

# జిడ్డు కృష్ణమూర్తి తాత్విక సమావేశము

S.V. University, Tirupati, October-10-1993

**(డా॥ రాధిక హెడ్జ్‌బర్గ్ ప్రారంభోపన్యాసానికి తెలుగు)**

మనం అనేక సభల్లో పాల్గొంటూ ఉంటాము. సర్వ సామాన్య సభల్లో ఏదో ఒకటి మాట్లాడి సరిపుచ్చుకోవచ్చు. ఏ విషయం మాట్లాడినా సమర్థించు కోవడం జరుగుతూ ఉంటుంది. ఐతే ఈ సభలో అలాంటిది కుదిరేట్లులేదు. జిడ్డు కృష్ణమూర్తి పేరు వినటమే తప్ప, ఆయన చెప్పిన విషయాలు లోతుగా చాలా మందికి తెలియవు. మీలో ఎక్కువ మంది పరిస్థితి కూడా అదే అనుకుంటా. నేను ఒకసారి వాయిదా వేసినప్పటికి కూడా, మళ్లీ నన్ను గట్టిగా రమ్మని పట్టుపట్టారు రఘుపతి రావుగారు. అలాగే ఇంతమందిని ఈ సభలో సమావేశ పరచగలిగారు.

**తనకు తానే వెలుగు**

అందరూ చెప్పింది ఒక ఎత్తు, జిడ్డుకృష్ణమూర్తిగారు చెప్పింది మరో ఎత్తు అని అంటారు. నిజమే. ఆయన ఒక మహాతత్వవేత్త. జీవితాన్ని మధించి, తనకు తాను సత్యాన్ని కనుగొన్నారు. స్వతంత్రంగా నిలబడ్డారు. వెలుగుతో ప్రకాశించారు, ప్రేమగా వ్యవహరించారు. మానవాళి కొరకు పరితపించారు. సరైన మార్పు బాల్యంనుండీ రావాలని పాఠశాలలు నెలకొల్పారు. ఏ విధమైన వ్యత్యాసాలు చూపకుండా, మనిషి మనిషిగా వికాసం పొందటానికి తోడ్పడినారు, ఆయన మహావ్యక్తి అయినారు. అలాంటి వారు ఈ చిత్తూరు జిల్లాలో జన్మించటం ఒక ఘనత. ఆయన విశ్వవ్యాప్తి చెందటం ప్రపంచానికి ఒక గౌరవత.

జిడ్డు కృష్ణమూర్తి మదనపల్లెలో పుట్టారు. మద్రాసులో కొంతకాలం పెరిగారు. ఇంగ్లండులో ఎక్కువకాలం విద్యాభ్యాసం చేశారు. అమెరికాలో నివాసం ఏర్పరచుకొన్నారు. ప్రపంచమంతటా తిరిగి, మానవ జీవన సౌభాగ్యం గురించి ప్రబోధము సల్పారు.

**రెండు విషయాలు**

నేను రెండే రెండు విషయాలు చెప్పదలిచాను. ఒకటి, ఆయన తత్వంలో ఉన్నటువంటి కష్టమూ, సౌలభ్యమూ. రెండవది, ఆయన చేసిన విద్యాసేవ. ఆయన

కోరేది సంపూర్ణ స్వేచ్ఛ. మానసికంగానూ, భౌతికంగానూ ఎలాంటి బంధనాలూ, పరాధీనతలూ లేకుండా బతకటం. అదే విముక్తి. మాటవరుసకిది బాగానే వుంది. కాని దానర్థమేమిటి? మతం పేరా, దైవం పేరా, సిద్ధాంతం పేరా మనం చేస్తున్న ప్రతిదాన్నీ ముందు విసర్జించమంటారు. ఇది మనకు సాధ్యమా? అందుకే ఆయన చెప్పేది కష్టమనిపిస్తుంది. కానీ తెంపున్న మనిషికి అది అసాధ్యం కాకపోవచ్చు. ఆశపాశాలు వదలినవాడికి అది సులభమే.

**మతపరమైన మనసు**

మత సంప్రదాయాలూ, మతారాధనలూ, మత విశ్వాసాలూ వదలుకోమంటారు. కానీ మతపరమైన మనసుండాలంటారు. అంటే స్వేచ్ఛగా, స్వచ్ఛందంగా, సరళంగా, స్పష్టంగా, ప్రేమగా ప్రజ్ఞతో ఉండే మనసు కావాలంటారు. కులమూ, వర్గమూ, వర్ణమూ, జాతీయతా పనికిరావంటారు. మనిషికి మరో ముసుగు ఏదీ వద్దంటారు. అంటే మానవత్వమొక్కటే ప్రధానం.

**శాంతి**

రాజకీయనాయకులవల్లగానీ, శాస్త్రాలు వల్లించటం వల్లగానీ శాంతి లభించదని గంటాపథంగా చెప్పారు. అంతే గాక, ప్రచారమొక అబద్ధం అని తేల్చేశారు. అయితే ప్రభుత్వాలు ఎలా నిర్వహించాలో, పార్టీలు ప్రజలకు ఎలా ఉపయోగపడాలో దాన్ని గూర్చి ఆయన ఏమైనా చెప్పుంటే దాన్ని మీరు మీ చర్చల్లో తేల్చి, మాకు చెప్పాలి.

**వ్యక్తిలో మార్పు**

సమాజం మారందే శాంతి చేకూరదనేది నిజమైన మాట.ఇది అందరికీ నచ్చినమాట. సమాజంలో మార్పు రావాలంటే వ్యక్తిలో మార్పురావాలి.

వ్యక్తిలో రావసిన మార్పు చిత్త ప్రవృత్తిలోనూ జన్యుపరంగానూ తక్షణమే జరగాలి. మార్పు చెందిన మనిషి ప్రవర్తన సహేతుకంగా తార్కికంగా సమగ్రంగా ప్రేమపూర్వకంగా ఉంటుంది. అతడు చేసే ప్రతిపనీ సరైందిగా ధర్మసమ్మతంగా జరుగుతుంది. కాబట్టి మనిషిలో విప్లవాత్మకమైన తక్షణ పరివర్తన కలగాలని ఆయన జీవితాంతమూ సూచించారు. ఇది ఆయనలో విశేషం. ఈ సందర్భంగా ఆయన మానవ జీవితం గురించి చెప్పని విషయం లేదు. ఆ విషయాలన్నీ మీరు తరచి చూడబోతున్నారు.

విద్యావిషయం

విద్యార్థి యొక్క అంతరంగ ధోరణి కనిపెట్టి, అది క్రమంగా సహజంగా స్వేచ్ఛగా వికాసం చెందటానికి ఉపాధ్యాయుడు తోడ్పడాలని మాత్రమే చెప్పారు. హృదయపు రీతీ, సైన్సు ప్రగతి సమైక్యంగా జీవితంలో సాగాలని చెప్పారు. అదీ ఆయన సూచించే సమగ్రత. అంతేగానీ అది మతమూ సైన్సూ కలవాలని గానీ, అధ్యాత్మికమూ సైన్సూ కలవాలని కానీ, అన్ని మతాల్ని కలుపుకుపోవాలని కానీ, అలాంటి సమగ్రతను కోరరు.

విధ్యా విధానం

మనవిద్యారంగంలో పోటీలూ పరీక్షలూ పోలికలూ విద్వేషాలూ తప్పటం లేదు. కానీ ఆయన ప్రవేశ పెట్టిన విద్యావిధానంలో పరీక్షలు నామమాత్రమే కాకుండా పోటీకీ అసూయకూ అవకాశం లేదు. ఆలోచించే విధానం తెలుపుతారు కానీ ఫలానిది మాత్రమే ఆలోచించాలని చెప్పరు. విద్యార్థికి తల్లిదండ్రుల ఉపాధ్యాయుల సమాజపు రంగు పులమొద్దు అని చెప్తారు.

ఈ విషయాలను లోతుగా పరిశీలించాలంటే మనం రిషివ్యాలీ మొదలగు స్కూళ్లలో చాలా పరిశోధనలు చేయాలి. బహుశా ఈ విషయం కూడా మీరు చర్చిస్తారనుకుంటా. ఇదంతా మనకలవాటు లేని గొడవలాగా కనిపించవచ్చు. ఇది వినాలంటే మీ ఆలోచన ఎలా ఉందో నేనాలోచించవలసి ఉంటుంది. ఎందుకంటే ఇది సినిమాపాటకాదు, భక్తి మాటలు కాదు, రాజకీయం అంతకంటే కాదు. అయినా సీరియస్‌గా క్షుణ్ణంగా పరిశీలించాలని కూర్చున్నారు కాబట్టి, నా మాటలు సావధానంగా వింటున్నారని భావిస్తున్నాను.

ఈ చర్చల సారాంశాన్ని నాక్కూడా అందించ గలిగితే నా అవగాహన మరికొంత పెంచు కోగలనని ఆశిస్తున్నాను.

జిడ్డు కృష్ణమూర్తి తత్వం ప్రతి మనిషికీ, మానవాళికే సద్భావనను పెంచగలదని ఆకాంక్షిస్తున్నా. ఇంతకన్నా మనం కోరేదేముంది? అందుకు మనం తగినంత శ్రద్ధ వహించటమే నిజమైన బాధ్యత. ఈ సభను జయప్రదంగా నిర్వహించమని నేను ఆకాంక్షిస్తున్నాను.

మీ అందరికీ నా అభినందనలు!

# డైలాగ్ ప్రాధాన్యత

మాట్లాడడంలో అనేక ప్రక్రియలున్నాయి. ముచ్చట్లు ఉపన్యాసం, ప్రబోధం, వాదం, తర్కం, చర్చ, సంభాషణ అనేవి ముఖ్యమైన రీతులు. అందులో వాదం (Argument), చర్చ (discussion), సంభాషణ (dialogue) లను తీసుకుందాం

**వాదన**

వాదనలో విషయాన్ని రెండు పక్షాలుగా చూస్తారు. పక్షాలు పెరగొచ్చుకూడ. నిర్ణయాలు ముందే ఏర్పడి వుంటాయి. ఆ నిర్ణయాన్ని నిలబెట్టుకోడానికి మేథస్సును ఉపయోగించి వాదిస్తారు. గెలుపు ఓటములుప్రధానమై పోతాయి. విషయం కన్నా వ్యక్తిత్వాలు, మాట్లాడే విధానం ప్రముఖ మవుతాయి. మాటలు మిగులుతాయి తప్ప, అవాస్తవం అవగాహనకు రాదు. ఎందుచేతనంటే ఒక అభిప్రాయం ముందే ఏర్పాటు చేసుకోవడం జరిగింది గనుక. పైగా ఇది బుద్ధితో జరిపే కుస్తీ. అనుభూతి (Experiencing) పరమైందికాదు. అందుచే వాదం వల్ల సత్యం ఆవిష్కరించడం అసంభవం. వాదన, తర్కమూ ఒకే రీతిలో వుంటాయి.

**చర్చ**

చర్చ వాదనంత తీవ్రంగా వుండదు. అదీ అభిప్రాయాలతోనే సాగుతుంది. విషయం కాస్త ప్రాధాన్యత వహించినా అది బుద్ధిస్థాయిలోనే సాగుతుంది. విషయ పరిజ్ఞానం ఏర్పడుతుంది. ఎవరి అభిప్రాయం వారికి మిగుల్తుంది. చర్చలో పరిశీలన భాగంకన్నా, విశ్లేషణభాగం ఎక్కువగా వుంటుంది. హైపోథెసిస్ అనగా ఊహాత్మక మైన నిశ్చయాభిప్రాయం చోటు చేసుకుంటుంది. తద్వారా సత్యావగాహన కలగదు.

ఉపన్యాస ప్రబోధాలు ఏక పక్షంగా వుండి, మాటలు మూట గట్టుకొని వుండుటచే సత్యావగాహన ఇవ్వలేకున్నవి. ఉపన్యాసం వినేవారికి నిజమైన బాధ్యత పెద్దగా ఉండదు.

**డైలాగు**

కృష్ణజీ డైలాగ్‌కు అత్యంత ప్రాముఖ్యత నిచ్చారు. ఇది ఒక పరిశీలన, ఒక పరిశోధన. ఇందులో నిజాయితీ వుంటుంది. అవగాహన లోతు తెలుస్తుంది. నేను భ్రమలో పడినదీ లేనిదీ నాకే అర్థమవుతుంది. అర్థమయినపుడు పంచుకోవడం (Shar-

ing) జరుగుతుంది. తద్వారా నేర్చుకోవడం, గ్రహించడం సహజంగా జరుగుతూ ఉంటాయి. అందుచే డైలాగ్ అవగాహన కల్గిస్తుంది. ఎప్పటి కప్పుడు ఎవరికి వారు చూడడముంటుంది. నిజం గోచరిస్తూ ఉంటుంది. అందుచే ప్రత్యక్షీకరణ (percetion) లో మాటలు జ్ఞానం మిగలక, మౌనం ప్రాప్తమౌతుంది. ప్రత్యక్షీ కరణకూ అంతర్దృష్టికీ డైలాగ్‌లోనే అవకాశం వుంది. డైలాగ్‌లో ప్రశ్నప్రాణం లాంటిది.

డైలాగ్‌లో హైపోథెసిస్‌కుగానీ, పూర్వ నిర్ణయానికి గానీ చోటు లేదు. సంభాషణమధ్యలో అవి ప్రవేశించినా, వాటి నిరుపయోగత నిరూపితమవుతుంది. ఇందులో ఇద్దరు పాల్గొన్నా, అంతకుమించి పాల్గొన్నా తెలియనిచోటు నుంచే మొదలవుతుంది, లేదా ఉన్నదాన్ని ఆశ్రయించిసాగాలి. ఇరువురూ ఒకే స్థాయిలో, ఒకే తీవ్రతలో కలిసి కొనసాగితేనే కమ్యూనికేషన్ (ఇచ్చిపుచ్చుకోవడం) వుంటుంది. దుఃఖంలోకి తీవ్ర పరిశోధన ప్రవేశపెడితే దాన్ని స్పృశించటం జరుగుతుంది. ఇరువురికీ ఒకే అవగాహన కలుగుతుంది. రెండు రకాల అభిప్రాయాలకు చోటు ఉండదు. ప్రార్థన, పూజ, దేవాలయదర్శనం -వాటిలో పరిశోధనకూ, డైలాగ్‌కూ తావులేదు గనుక అవి మాటలకూ, "గొప్ప" చేష్టలకూ పరిమితమై పోతున్నాయి. అవి కాలక్షేపానికి వినోదాలకు గురి అవుతున్నాయి. డైలాగ్ రూపంలో గాక, వేరే రకంగా వుండే తాత్విక చర్చ ఆకర్షణీయంగా వుండవచ్చుగాని ఆశ్రయించ తగిందికాదు, స్పందన కల్గించలేదు. డైలాగ్ మాత్రమే హృదయాన్ని స్పృశిస్తుంది, మనిషిని మారుస్తుంది. అయితే మార్పు గుణాన్ని కూడ పరిశీలించాలి.

ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇంజనీర్స్, తిరుపతి లో జరిగిన ఈ అధ్యయనంలో హనుమంతు, శంకర రెడ్డి, భాస్కర రెడ్డి, సాంబశివరెడ్డి, మాధవరావు, వేణుగోపాల్, దొరస్వామి, చిన్నయ్య, రఘుపతిరావు, వేదపారాయణ మున్నగువారు పాల్గొన్నారు.



# అవగాహనే ధ్యానం

### ధ్యాన నిర్వచనాలు

ధ్యానానికి చాలా మంది ఆరోగ్యప్రాప్తి, రోగనివారణ, ఏకాగ్రత, దివ్యజ్ఞానం, ఆత్మసిద్ధి, ముక్తి మున్నగు ప్రయోజనాలు చూపిస్తారు. ధ్యానంలో ప్రధానాంగాలు ప్రాణాయామం, చిత్తవృత్తి నిరోధం అని భావిస్తున్నారు. మంత్రోచ్చారణ, నామజపం, దైవచింతన లేక శూన్యస్థితిని సూచిస్తారు. ధ్యానంలో రకరకాల టెక్నిక్‌లు, మార్గాలు భోధిస్తున్నారు. శ్వాసమీద ధ్యాస అని కొందరు దానిపై జ్ఞాన బోధ చేస్తున్నారు. ధ్యానాన్ని యోగమని కూడా అంటున్నారు.

### ఆసనాల ప్రయోజనం

మానవుడు ఏం చేసినా సుఖంగా వుండాలను కుంటాడు. సుఖంగా వుండాలంటే ఆరోగ్యంగా వుండాలి, కనీస అవసరాలు తీరాలి, శాంతంగా బ్రతకాలి. ఇందులో శారీరక ఆరోగ్యం, మానసిక శాంతి ముఖ్యాంశాలు. ఆరోగ్యం నిమిత్తం దేహానికి ఆహారం, పరిశ్రమ, వ్యాయాయం, విశ్రాంతి కావాలి. ప్రాణాయామం వల్ల, ఆసనాలవల్ల, నియమపాలన వల్ల అనగా దేహానికి సంబంధించిన యోగం వల్ల ఆరోగ్య భాగ్యం చేకూరుతుందనుకోవడంలో సందేహం లేదు. అది అభ్యాసయుతంగా ఏకాగ్రతకు తోడ్పడుతుంది. బయటికి వెళ్లి పెద్దగా వ్యాయామం చేయలేని వారికి గృహావరణలోనే యోగాభ్యాసం లాంటి వ్యాయామాలు చేసుకోవడం సముచిత మైంది. వాటి ప్రయోజనము కేవలం ఆరోగ్యం ప్రాప్తి. అంతకు మించిన ప్రయోజ నాన్ని కోరడం అత్యాశ అవుతుంది. దానికి దివ్యత్వం అంటకట్టడానికి ఆస్కారం లేదు.

### చిత్తశాంతి - అభ్యాసం

ఇక చిత్తశాంతి, మానసిక సంఘర్షణలు లేనపుడు మాత్రమే సాధ్యపడుతుంది. సంకల్ప వికల్పాల వల్ల చంచలత్వం కలుగుతుందని ఒక అవగాహన వుంది. అభ్యాసంవల్ల చంచలత్వాన్ని పరిమితం చేయవచ్చునేగాని, పూర్తిగా తుడిచివేయ వీలుపడదు. ఎందుచేతనంటే అభ్యాసం యాంత్రికమైంది. అది తాత్కాలికంగా పని చేస్తుంది. సమస్యను పరిష్కరించలేదు. మార్పు చెందుతున్నా, దేహంకొంత వరకు స్థిరంగా కన్పిస్తుంది. స్థిరంగా మార్పు చెందుతుంది. మనసు అలాకాదు, నిత్యం

చంచలం. కనుక మనసును ఏక్షణానికి ఆ క్షణం చూసుకోవాలి. మానసిక క్షేత్రంలో అభ్యాసం నిబద్ధతకు దారి తీస్తుంది. మొద్దుబార జేస్తుంది. యాంత్రికమైన అభ్యాసం స్వయం జ్ఞాన ప్రబోధం కాదు. దానివల్ల ప్రకాశం గానీ, స్పష్టతగాని వుండదు. స్పష్టత కొరకు మూలాలు వెదకాలి.

**సమస్య - పరిష్కారం**

సమస్యకు మూలకారణం తొలగించుకోవాలి. విశ్వాసం, ఆశ, ద్వేషం, స్వార్థం, అహం, ఆగ్రహం, కామం, మోహం మొదలగు గుణాలవల్ల మానసిక సమస్య ఉత్పన్నమై ఉండవచ్చు. భయం వల్ల కావచ్చు. స్థిరత్వం, శాశ్వతత్వం చెందాలనే తృష్ణ వల్ల కావచ్చు. ఏదైనా మూలాన్ని వెతుక్కోవాలి. కారణం తెలిసి తొలగించు కోవాలి. ఇక్కడ చేయవలసిన పని మరెక్కడో చేయడం వృధా. మూలంలో చూపాల్సిన ఆసక్తికి బదులు, ఎక్కడో సాధనలో కృషి చేస్తే సమస్య తీరదు. సమస్య ఎక్కడ పుట్టిందో అక్కడ పరిష్కరించు కోవాలి.

**ధ్యాన దోషాలు**

సామాన్యంగా ధ్యానం విషయంలో సమస్య ఒక చోట వుంటే, పరిష్కారం మరోచోట గా వుంటుంది. వెదకడం వల్ల రెండు దోషాలు వున్నాయి. మొదటి దోషం సమస్య నుండి దూరంపోవడంలేక తప్పుకు పోవడం జరుగుతుంది. రెండో దోషం లేనిదానికై, తెలియని దానికై, ఊహించిన దానికై అత్యాశ చెందడం అవుతుంది. మొదటి దోషంలో వృధాసాధన, శక్తిహీనత, అంధవిశ్వాసం మున్నగు కొత్త సమస్యలు తలెత్తుతాయి. రెండో దోషం వల్ల అతిచంచలత, అతితృష్ణ, అతి నిబద్ధత సమస్యలు అంకురిస్తాయి. తలను వదిలి తోకను పట్టుకోవడమవుతుంది.

**టెక్నికులు అనవసరం**

మానసిక క్షేత్రంలో టెక్నిక్‌లకు తావులేదు. టెక్నిక్ నిలకడకు, అభ్యాసానికి సంబంధించింది. కాని మనసు అతివేగమైంది, అతి సున్నితమైంది, అతి సూక్ష్మమైంది, అతి గోప్యమైంది. టెక్నిక్ (విధానం) అన్న తర్వాత ఏ టెక్నిక్ అయినా ఒకటే. ఏ మార్గమైనా ఒకటే. ఇక్కడ ధ్యేయం,మార్గం, ఫలం అని నిర్దేశించడానికి కాదు. ఎందుకంటే ఇలా నిర్దేశించేది కూడ అదే మనస్సు, అదే చంచల చిత్తం. శాంతించిన

ఇతర చిత్తాలను ఉదహరించినా అవి ఆదర్శప్రాయం అవుతాయి. నీకు వాస్తవాలు కావు. నీకు వాస్తవమైంది నీచిత్త పరిస్థితి. దాని నుండి మొదలు పెట్టడంలో నీకు పట్టు దొరుకుతుంది. పునాది నీదవుతుంది. మొదలు - చివర - పునాది - ఫలం - అంత ఒకటే ఆక్షణంలోనే.

ఇతరులు గానీ, ఇతరములు గానీ మహా అయితే నీకు సహాయకాలు కావచ్చు. కాని అసలు నీకు నీవు ఉండాలి. మార్పు రావలసింది నీలో, మార్చుకోవలసింది నీవే. ఇతరులిచ్చే టెక్నిక్ నీకు పనిచేయదు. అది ఇచ్చే వారికెంత పనిచేసిందో నీకు తెలియదు, నీవు నిరూపించే అవకాశం లేదు. పూర్వీకల గురించీ అంతే. కథల వెంట పడడం, ఇతరుల అనుభవాలు నిలవ చేసుకోవడం మృగతృష్ణ లాంటిది. టెక్నిక్‌కు తలవొగ్గడమంటే దోచుకోబడడం. టెక్నిక్‌లు తెలియని మానసిక క్షేత్రంలో నిర్వహించే వ్యాపార సరళులు. టెక్నిక్ వల్ల భౌతిక లబ్ది వుండొచ్చు. కాని మానసి కంగా భారమౌతుంది.

అవగానే దారి

మానసిక క్షేత్రంలో పని చేసేది ఒక్క అవగాహన మాత్రమే. నిన్ను నీవు అర్థం చేసుకోవాలి. నీకు నువ్వు అర్థం కావాలి. అవగాహనతో సమస్యను లోతుగా పరిశీలించడం వీలవుతుంది. సమస్య మీద ఆసక్తి ఉన్నపుడు, పట్టు చిక్కుతుంది. గాఢమైన స్వయం పరిశీలనతో అంతర్దృష్టి ఏర్పడుతుంది. అపుడు అంతర్దృష్టి అనే అద్దంలో సమస్య స్పష్టంగా కనిపిస్తుంది. నీ తీక్ష్ణతకు అవాంఛితం, ప్రక్కకు తొలుగుతుంది, రాలిపోతుంది లేదా కాలిపోతుంది. సమస్యే లేదు, ఇంకా సాధనెందుకు? ఇదీ నిజమైన ధ్యానం. స్పష్టతకు మించిన ధ్యానంలేదు, తీక్ష్ణతకు మించిన ధ్యానంలేదు. నిలకడకు మించిన ధ్యానంలేదు. నిర్మలత్వానికి మించిన ధ్యానంలేదు. ఇది ఎరుక వల్ల సాధ్యపడుతుంది. ఎన్నికలేని ఎరుకవల్ల కుదురు తుంది. ప్రతీదాన్ని వీక్షించు. అపుడు సాక్షీమాత్రంగా వుంటావు.

ఈ అవగాహన కుదిరినాక. ఏ టెక్నిక్ అయినా నిన్ను టెక్నిక్‌లో బంధించదు. నీవు టెక్నిక్ లేని మాస్టర్‌గా కన్పిస్తావు. ఆ క్షణంలో నీ సమస్యతీరే దాక అది నీవరకే పరిమితం. దాన్ని మరొకరి కొరకు టెక్నిక్, వ్యాపారంగా వినియోగించావంటే ఇరువురికి మౌఢ్యం ఏర్పడుతుంది. అప్రమత్తంగా వుండగలిగి నపుడు ఏం చేసినా ఎరుకలో వుంటుంది.

కళ్లు మూసుకునైనా కూర్చో, కళ్లు తెరిచైనా కూర్చో. శ్వాసమీద ధ్యాస పెట్టినా సరే, నిశ్వాసం అనే దాని మీద ధ్యాస పెట్టినాసరే. మాటలేవైనా ఆధ్యాస ఎరుకగా పని చేసినంత వరకు నీది ధ్యాన స్థితియే. ఆలోచనపై నిఘా వేయడం అవసరం. ఆలోచనను లేదా సంకల్పాన్ని ఎప్పటి కప్పుడు గమనించు, దాని వెంట ఆసక్తితో, తీక్షతతో అయితే నిబ్బరంగా నడువు. నీవుదాన్ని వదిలిపెట్టవని ఎపుడు దాని కనిపిస్తే అపుడు అది మాయమౌతుంది. కాపలాదారుడు మెలకువగా వున్నంత వరకు దొంగ జొరబడడు. అనుకూలంగా వుండడానికి ఆసనం వేసుకొని కూర్చోవచ్చు. నిశ్శబ్దంగా - లోన బయట - ఆలోచనాల రణగొణ ధ్వనులు లేకుండా - గడుపు. అది సాధ్యం. సహజమౌతుంది. లేదా నీ ఆలోచనలను నిజాయితీగా, నిజమైన మిత్రునితో యాదాలాపంగా చర్చించు; పంచుకో; డైలాగ్ రూపంలో సాగించు. నీ భారం తీరుతుంది, సమస్యలు దూరంగా తొలుగుతాయి. ఇవి ధ్యానంలో మార్గం కాని మార్గాలు. అంతర్గతంగా విప్లవం తెచ్చేదే నిజమైన ధ్యానం. ప్రేమను కురిపించేది ధ్యానం. ప్రజ్ఞను వికసింపజేసేది ధ్యానం. చేతనత్వంలో, ప్రవర్తన తెచ్చేది ధ్యానం.

-18-1-98

# ధ్యానంలో ఆలోచనారాహిత్యం

ధ్యానానికి అనేక పద్ధతులున్నాయి. ఎవరి పద్ధతి వారిది. అందరి ధ్యేయం శాంతి కొరకే. ఏకాగ్రత - ప్రశాంతత -ఆత్మజ్ఞానం - దైవసాక్షాత్కారం అని లక్ష్యాలు చెప్పుకుంటుంటారు. ఇది ఒక సమర్ధన, సమాధానం, సమన్వయం. అర్ధం తెలియందే, భావం గుండెకు పట్టందే, హృదయం ఆర్ద్రం కాందే ఏదీ జరగదు. అర్ధం - భావం - ఆర్ద్రత కలిసి క్రియాత్మక మవుతాయి. ధ్యానం అంటే ఏమిటి,దేనికోసం, ఎలా సాధ్యం అనే విషయాలు ముందుగా విస్పష్టం కావాలి. అర్ధం కాకుండా ఏపద్ధతైనా వ్యర్థమే.

ధ్యానం మనసుకు సంబంధించింది. జీవితం సుఖంగా వుండాలంటే మనసు ప్రశాంతంగా వుండాలి. అంటే మనసు నెమ్మది కావాలి, నిశ్చలంకావాలి, నిష్కల్మషం కావాలి. అసలు మనసుకు అలజడి కల్గించే దేమిటి? ఆవేశకావేశాలు, కోపతాపాలు, ఆశాపాశాలు, ఇష్టాయిష్టాలు, వైరుధ్యాలు, అయోమయాలు. ఇలాంటి వన్నీ ఘర్షణ

పుట్టిస్తాయి. ఘర్షణ మనసును చెదరగొడుతుంది. దాని ఫలితం దుఃఖం, విచారం, పశ్చాత్తాపం. ఇవి ఏ నేపథ్యం నుండి పుడతాయి - ఆలోచననుండే. కాబట్టి ఆలోచన ఘర్షణకు కారణమవుతున్నది.

ఇక్కడ మంచి ఆలోచన, చెడ్డ ఆలోచన అని విభజించి చూడరాదు. ఎందుకంటే ఆలోచన ఏదైనా మనసును అదర కొడుతుంది. మనసు మెదడు ద్వారా మనిషిలో పని చేస్తుంది. లేదా మనసు మెదడును ప్రభావితం చేస్తుంది అని కూడా చెప్పుకోవచ్చు. మెదడుకు ఒక ఆలోచన మంచిదిఒక ఆలోచన చెడ్డది అని తెలుసో లేదో. ఇది పరిశీలించాల్సిన విషయం. కంప్యూటరు ఇది సంఖ్య అనిగానీ, ఇది పదం అనిగానీ దానంతటికది గుర్తించలేదు.

కాబట్టి ఆలోచన మెదడును చలింపజేస్తుంది. అంటే ఆలోచన ఘర్షణ కల్గిస్తుంది. ఆ ఘర్షణ మనసును కుదిపేస్తుంది. దానివల్ల శాంతికి భంగం కల్గుతుంది. శాంతి కావాలంటే ఘర్షణ వుండరాదు. ఘర్షణ తొలగాలంటే ఆలోచన అంతం కావాలి. ఆలోచన అంతం కావడమే ధ్యానం.

ఇదీ ధ్యానం యొక్క అవసరం. ధ్యానం దేనికోసమో, మనిషికి దాని ఆవశ్యకత ఏమిటో అర్థమయింది. ఇది అర్థం కాకుండా ఎలాంటి ధ్యానం చేసినా దండగే అనేది తేలిపోవాలి. ఇది అర్థం చేసుకోవలసిన విషయమేగాని శిక్షణ పొందవలసిన విషయం కాదుగదా! ఇది ప్రాక్టీసుచేసేది కాదని తెలుస్తూనే వుంది. కాబట్టి పద్ధతితో పనేముంది?

ధ్యానం అంటే ఆలోచనను అంతం చేయడం అని రూఢి అయింది. ఇక్కడ ఆలోచన అంటే మానసిక మైంది అని అర్థం. సైన్సుకు సంబంధించిందీ కాదు, నిత్య జీవన నిర్వహణకు సంబంధించిందీ కాదు. ఆ రెండూ అవసరం. భౌతిక జ్ఞానం మనసును గాయపరచదు. మానసిక జ్ఞానమే అలా చేస్తుంది. మానసిక విషయాలలో శిక్షణ గాని, ప్రాక్టీసు గాని, పద్ధతి గాని వున్నదంటే, అది ఆలోచనతో కూడి వుంటుంది. అది ఆలోచన కొనసాగింపే అవుతుంది. ఆలోచన ప్రవేశించిం దంటే అది ధ్యానం కాదు, ధ్యానానికి వ్యతిరేకమైంది అవుతుంది. టెక్నిక్కులు, పద్ధతులు ప్రవేశపెట్టే వారు అవగాహనతో కూడిన ధ్యానం నిమిత్తం గాక, వేరే ప్రయోజనం కోరి చేస్తారు. లేదా సరిగా తెలిసికోకనూ చేయవచ్చు.

కాగా, ఏకాగ్రతనూ, ఆరోగ్యమునూ, ఉపశమనాన్ని కోరి కొన్ని ధ్యాన పద్ధతు

లుండవచ్చును. అంతేగాక ప్రకృతి వైద్యం లాగ, కొన్ని పరిస్థితులనూ అలవాట్లనూ మార్చడానికి శాంపిల్ శిక్షణ ఇవ్వవచ్చును. నిజమైన ధ్యానాసక్తుడు వాటి పట్ల మెలకువతో వ్యవహరించగలడు. అయితే అభ్యాసం జడత్వాన్ని కల్గించరాదు. మళ్లీ ఆలోచనను తెచ్చి పెట్టరాదు.

ఇక పోతే ఆలోచనను అంతం చేయడమెలా? అది సాధ్యమేనా అని అడగవచ్చు. ఆలోచనకు పూర్వాంగాలూ, ఉత్తరాంగాలూ పరిశీలించాలి. గతం - అనుభవం - సిద్ధాంతాల పట్ల విశ్వాసం - ఊహలు నిజమను కోవడం - ఇత్యాది అంశాల వాస్తవాన్ని పరిశీలించుకోవాలి. వస్తువు మీదకన్నా వస్తువును గూర్చిన ఆలోచనమీదే మనం భద్రత నిమిత్తం ఆధారపడుతున్నామనేది గ్రహించాలి. ధ్యానంలో పద్ధతికన్నా అవగాహన ప్రధానమైంది.

30-6-98

# ధ్యానంలో పద్ధతి

ధ్యానంలో టెక్నిక్, లేక పద్ధతి (Method) లేక పోవడమే కృష్ణమూర్తి ప్రత్యేకత. పద్ధతి వున్నదంటే అది ఆలోచనలో భాగమే. టెక్నిక్ యాంత్రిక మవుతుంది. ఆలోచన అవగాహనకు అవరోధం. అంటే ధ్యానానికి అది ఒక బంధం, పరిమితి, నిబద్ధత అవుతుంది. నీ వొక హిందువునని అనుకొంటే, హిందువుగానే, నీ ఆలోచన ప్రక్రియను వినియోగిస్తావు. ఆ ఆలోచనా ద్వారా నిన్ను నీవు క్షీణింప జేసుకుంటావు. అలా మానసికంగా ఆలోచన నీకు వినాశకారి అవుతుంది. కృష్ణజీ అవగాహన అంత సూక్ష్మంగా, అంతలోతుగా ప్రయోగింప బడుతుంది. ఇదంతా అర్థం చేసుకోవడమే ధ్యానం. ఈ అవగాహనలో పద్ధతితో లేక టెక్నిక్‌తో కూడిన ధ్యాన మార్గాలన్నీ తప్పే. అంటే ఆలోచనా స్థాయిలో సాగే ధ్యానమేదైనా సరైనది కాదు.

యోగమనే అర్థంలో ధ్యానాన్ని వాడుతున్నారు. నియమనిష్టలు, పూరక - కుంభక - రేచకాలు, ఆసనాదులు, రకరకాల భౌతిక ప్రక్రియలు ధ్యానం పేరుతో

చలామణి అవుతున్నాయి. వాటివల్ల ఆరోగ్యంచేకూరవచ్చు, దేహం చురుకుదనం పొందొచ్చు. మెదడు పదునెక్కవచ్చు. వాటి ఫలం అంతంత మాత్రమే. ఆలోచనలను అధిగమింప జేయలేవు. మౌనస్థితిని కల్గించలేవు. అవి దైహికంగా సరిపోవచ్చు, మాసికంగా సరిపోవు. విచారణ ఒక నిర్దిష్ట పద్ధతికి లోనైనా కూడ అది ఒక విధానమై ధ్యానం యొక్క నిజమైన అర్థాన్ని కోల్పోతుంది. అందుచే ధ్యానం వివిధ రకాలుగా వుండొచ్చు అనే మాటకి కృష్ణజీ అంగీకారం కాదు. అనేక రకాలుగా వుండడానికి ఆస్కారం లేదు.

రకరకాల ధ్యానపద్ధతులు అవలంబించేవారు, చేయగా చేయగా, ఒక రకమైన మానసిక స్థితిని చేరుకోవచ్చు. అది గుణంలో వేరైందికాదు, ఆలోచనను అంతం చేసే స్థితిగా వుండదు. అందుచే వాళ్లలో అహం, వైరుధ్యం, సంఘర్షణ, సమస్యలు - అన్నీ వుంటాయి. అవన్నీ తొలగడానికే కదా ధ్యానం, అవన్నీ తొలగితేనే కదా ధ్యానం. కృష్ణజీ చెప్పే ఆలోచనలేని - ధ్యాన - స్థితిలో అవన్నీ తొలిగిపోతాయి. కాబట్టి కృష్ణజీతో ఎవర్నీ కలపడం కుదరదు.

కృష్ణజీలో ఇంకా కొత్తదనాలున్నాయి. గురు-శిష్యులు లేరు. అందుచే గురువు శిష్యుణ్ణి వాడు కోవడం గాని, శిష్యుడు గురువుకు పంగనామాలుపెట్టడంగాని వుండదు. ప్రచారాలు, ఆధ్యాత్మిక సంస్థలు లేవు. దాంతో అబద్ధాలు, వక్రీకరణలు చోటుచేసుకోవడం గాని, సంస్థ అలివి గాకుండా పోయి ఆశయాన్ని, సంస్థాపకుణ్ణి మింగివేయడం గాని, జరగదు. మతం, కులం, జాతీయత ఎగిరి పోయాయి. కనుక మిగిలింది మనిషి హాయిగా, అవిరోధంగా బ్రతకవచ్చు. ఆధ్యాత్మిక జ్ఞానాన్ని కొట్టి పారవేశారు, జ్ఞానాన్ని మోయడంగాని, ఆరాధించడంగాని, వ్యాపారించండం గాని, యాంత్రికం చేయడంగానిలేదు. నమ్మకం ప్రమాదకర మన్నారు. ఇక నమ్మి మోసపోవడంలేదు. స్వేచ్ఛ కోల్పోవడం లేదు. మిగిలేది వాస్తవం. మోక్షంమాట లేదు, దేవుళ్ల తంతులేదు. ఆశలు, ద్వేషాలు, పక్షపాతాలు పోయాయి. చదువులు -ఉద్యోగ పెరపెరలు ఇప్పుడున్నట్లు ఉండవు. ఇక అంతరంగ వికాసం, మానవత్వపు టౌన్నత్యాలు వుంటాయి.

ఈ సందర్భంలో నూతన సంవత్సరపు ప్రాధాన్యత ఏమైనా వుందా అని

చూశాము. ఏమీ లేదు, రొటీన్ మార్పు తప్ప. పాతకు కొత్తకు ఏ వ్యత్యాసం లేదు. అంతా మనసు సృష్టించిందే. సుఖశాంతులు ఊహాగానాలే. మనవనులు లెక్కేసుకోవడానికి క్యాలెండరు పెట్టుకున్నాం. అది తిరుగుతూఉంది. అర్థ రాత్రి అత్యానందం, అరుపులు, మెరుపులు, ఆహారాలు నూతనత్వాన్ని తేలేవు. పాత ఆలోచనలను, సంప్రదాయాలను వదులుకొంటే, మనసుకు ర్యాడికల్‌ఛేంజ్ వస్తే, నూతనత్వం ప్రవేశిస్తుంది.

1-1-1998

# గుర్తింపుకు లోనయితే వికాసం కొడిగట్టినట్లే

## IDENTIFICATON

మనిషి ఎందుకు మరో మనిషితోనో, గ్రూపుతోనో, దేశంతోనో గుర్తింపు (Identification) పొందాలనుకుంటాడు? క్రైస్తవుడుగానో, హిందువుగానో, బౌద్ధుడు గానో చెంది పోవాలనుకుంటాడు? సంప్రదాయం - అలవాటు -ప్రేరణ - అనుకరణ - సోమరితనం - స్వార్థం వల్ల మత విషయకంగా గాని, రాజకీయంగా గాని చేరిపోవాలనుకుంటాడు. గుర్తింపు సృజనాత్మక అవగాహనను తుదముట్టిస్తుంది. దాంతో మనిషి పార్టీనాయకునికో, ప్రీస్టుకో, కీలుబొమ్మయిపోతాడు.

మనం ఇతరులతో గుర్తింపు పొందడం ప్రేమకు చిహ్నామా? ప్రయోగానికి చిహ్నామా? గుర్తింపు అంటే ఏదో పట్టుకు కూర్చోవడం, సొంతం చేసుకోవడం అవుతుంది. దానివల్ల సూక్ష్మంగానో స్థూలంగానో నిరోధముంటుంది. కాకుండానే సమర్థులనుకోవడం జరుగుతుంది. అలాంటప్పుడు ప్రేమ ఎలా వుంటుంది?

ప్రేమ అంటే గాయపడనిది, మృదువుగా వంగేది. గ్రహింపు గలది. అది అతి సున్నిత స్పందనారూపం. గుర్తింపు ప్రేమ స్వభావాన్ని దెబ్బ తీస్తుంది. ప్రేమ, గుర్తింపు కలిసి సాగవు, ఒక దానికొకటి విచ్ఛిన్నకరం. గుర్తింపు చెందడం అనేది ఆలోచనా ప్రక్రియ, స్వయం రక్షణ, నిరోధం, సమర్థన, ఉంచుకోవడం, తెంచుకోవడం చేస్తుంది. ఆ ప్రక్రియలో మనసు లేక నిజతత్వం కాఠిన్యం చెందుతుంది. సామర్థ్యం పెంచుకుంటుంది. అది ప్రేమకాకపోగా స్వేచ్ఛను హరిస్తుంది. స్వేచ్ఛలోనే సున్నిత స్పందన వుంటుంది.

ప్రయోగం, చేయాలంటే గుర్తింపు కావాలా? గుర్తింపు క్రియ పరిశోధించడాన్నీ, కనుగొనడాన్ని ఆపివేస్తుంది. తన్నుతాను తెలుసుకొనే ప్రయోగం లేకుంటే సత్యం ప్రసాదించే సౌఖ్యం వుండదు. గుర్తింపు అనేది అన్వేషణకే గుదిబండ, ఒక బద్ధకం, మరొకరి తరుపు అనుభవం, అందుకే అది అసత్యం.

అనుభూతి చెందాలంటే గుర్తింపులన్నీ అణగారిపోవాలి, అందుచే భీతి పనికిరాదు. ఎందుకంటే భయం అనుభూతి చెందనివ్వదు. అసలు భయం వల్లనే ఎవరితోనో, ఏదో గుంపుతోనో, ఏదో ఆదర్శప్రాయపు సిద్ధాంతంతోనో, అలా ఏదో గుర్తింపు కావలసి వస్తుంది. భయం స్వభావం ఏమంటే నిరోధించడం, అణచడం, స్వీయరక్షణ. ఈ స్థితిలో అల్లకల్లోలపు సముద్రంపై పయనించే సాహసం ఎలా చెయ్యగలవు? నిజమార్గాన్వేషణ యాత్రలేనిదే సత్యం, సౌఖ్యం ఉండజాలవు. గుదిబండ (లంగరు) పడితే సత్యం, సౌఖ్యం ఉండజాలవు. గుర్తింపు అంటే శరణు పొందడమే. శరణార్థునికి రక్షణకావాలి, రక్షణలో పడింది నశించిపోతుంది. గుర్తింపు స్వయం నాశనకారి. అందుచే అనేక గుర్తింపుల మధ్య ఘర్షణ తథ్యం.

గుర్తింపుకు అనుకూలంగా ప్రతికూలంగా పోరాటం సాగినంత కాలమూ అవగాహనకు నిరోధం పెరుగుతూనే వుంటుంది. అంతర్గతం బహిర్గతం గుర్తింపు ప్రక్రియపై పూర్తి ఎరుకవుండాలి. అంతర్గతం కాంక్షే బహిర్గత వ్యక్తీకరణ. ఇది గ్రహిస్తే అన్వేషణకు, సౌఖ్యానికి ఆస్కారం వుంటుంది. గుర్తింపుకు లోనైన వానికి స్వేచ్ఛ లేదు. స్వేచ్ఛలో మాత్రమే సకల సత్యావిష్కరణ ఉంటుంది. దొరస్వామి, రఘుపతిరావు, వేదపారాయణ, సాంబశివారెడ్డి మున్నగువారు ఈ చర్చలో పాల్గొన్నారు.

# సత్యం - దేవుడు

దైవ భావమే వద్దంటే జీవితం నిస్త్రాణం, నిర్వీర్యం, నిరర్థకమై పోదా? నమ్మకం లేకుండా ఒక అడుగు ముందుకు వేశేదెలా? దైవాన్ని కాదంటే ప్రత్యామ్నాయమేదైనా వుందా అని మానవుణ్ణి వేధించే కొన్ని ప్రశ్నలు. వీటి గూర్చి కృష్ణజీ చెప్పిన సమాధానంపై చర్చ సాగింది.

దేవుడున్నాడని అంగీకరించినా, లేదని కొట్టి పారవేసినా సత్యం (రియాలిటీ)

అనేది ఒకటుంది. దాన్ని నమ్మకంతో కనుగొనలేరు. ఎందుచేతనంటే నమ్మకమనేది భయం, ఆదుర్దా, ఆధారపడడం అనే వాటి నుంచిపుట్టింది. పైగా నమ్మకం అభిప్రాయంతో జతపడి వుంది. దేవుడు అనే అభిప్రాయం దేవుడు కాదు గదా! ఒక అభిప్రాయం మీదో, ఒక విగ్రహం మీదో ఆధారపడితే అది వెనక ఒకప్పుడు లేదు, ముందు మరొక్కప్పుడు ఉండదు. ఇంకా అది తప్ప మిగతా వానిపట్ల గుడ్డిగా వుండడం జరుగతుంది. నమ్మకం అందరికీ ఒకటిగా వుండదు. అనేక దేవుళ్లనూ అనేక సమస్యలనూ సృష్టిస్తుంది. మనుషుల్ని విభజిస్తుంది, నాశనం చేస్తుంది. మనసేకదా దేవుడనే పిలకను బహిర్గతం చేసేది. అలాంటి మనసు నిజాన్ని అవగాహన చేసుకోలేదు. ఆమనసుకు దేవుడికన్నా నమ్మకమే ప్రధానమై పోతుంది. నమ్మకం పేరుతో చంపడానికి వెనకాడదు. ఇటీవల నమ్మకం సామూహిక ఆత్మహత్యలకు పురికొల్పింది.

దేవుణ్ణి నమ్మిన వాడూ ఆటంబాంబు పేల్చి వినాశనం కల్గిస్తున్నాడు. దేవుణ్ణి నమ్మని కమ్యూనిస్టు కూడా మేలైన సమాజం నిమిత్తం జనాన్ని సంహరిస్తున్నాడు. ఇద్దరూ ఏదోరకమైన నమ్మకంతో దుఃఖం తెచ్చి పెడ్తున్నారు. దేవుణ్ణి నమ్మినా దేవునికి బదులు సిద్ధాంతాన్ని నమ్మినా ఇద్దరూ ఒక్కటే, ఇద్దరికీ సత్యం (రియాలిటీ) తెలియదు. మనసు తనను తాను అర్థం చేసుకోలేకపోతే, నిశ్చలంకాకపోతే అసాధారణమైనటువంటి ఆ రియాలిటీ తెలియదు. కాని నమ్మకం మనసును స్థిమితంగా వుండనివ్వదు. నమ్మకం వల్ల మనసు సంకుచితమై, చితికి పోతుంది. ఈ హాని కరమైన ప్రక్రియ అంతా మనసుకు యదార్థంగా తెలిస్తే, నమ్మకాలనుంచీ, భ్రమల నుంచీ విముక్తి చెందుతుంది. నిస్పృహకు లోనైన మనసుకు యదార్థం తెలియదు. నిస్పృహల మనసు ఎప్పుడూ ఆకాంక్షిస్తూనే వుంటుంది. ఆకాంక్షే (Hope) అది చూడగల సత్యం.

నమ్మకం కల్గించే గందరగోళాన్ని లోతుగా చూసిన మనస్సు నెమ్మది చెందుతుంది, నిశ్చలమౌతుంది. అప్పుడు మాత్రమే సత్యం గోచరిస్తుంది. సత్యం ఆహ్వానిస్తే వచ్చేది కాదు, లంచానికి లొంగదు, పొగడ్తకులోబడదు. త్యాగంతో సత్యాన్ని కొనలేవు. కేవలం నీతి పేరుతోదక్కదు. ఊహ, కాంక్ష, భయం, నమ్మకం లుప్తమైనపుడు సత్యావిష్కరణ వుంటుంది. ఈ డైలాగ్‌లో బాలచంద్రారెడ్డి, రమణారెడ్డి, రామప్రసాద్, వేణుగోపాల్, హనుమంతు, భాస్కరరెడ్డి, వేద పారాయణ, సాంబ శివారెడ్డి, రఘుపతిరావు ప్రభృతులు పాల్గొన్నారు. వచ్చేవారం "ఆధ్యాత్మికత్వం అంటే ఏమిటి?" అనే అంశంపై చర్చ ఉంటుంది.

# సత్యం ప్రత్యక్షం కావడానికి దైవభావం ఒక అవరోధం

సత్యం అంటే ఏమిటో దైవమంటే ఏమిటో అన్నీ తెలిసినట్లే వుంటాయి. అన్నీ తెలుసు అనే అనుకుంటాము. నిజంగా తెలుసోలేదోనని ఎవరికి వారు ప్రశ్నించుకోరు. ఎందుకంటే ఎంతమందో చెప్పారు. ఎన్ని శాస్త్రాలో చెప్పాయి. అయితే సత్యమంటే వేరా, దైవమంటే వేరా అని విచారించుకోవాలి.

అబద్ధాలాడకుండడం ప్రాథమిక సత్యం. అదే సంపూర్ణం అనుకుంటే జీవితపు లోతులు. విలువలు తెలియవు. అయినా అబద్ధాలాడకుండ వుండడానికి, దైవానికీ సంబంధం ఏమిటి?

సత్యం దేన్ని గురించి అనే ప్రశ్న వుంది. సత్యం కేవలమైందా లేక సంబంధిత మైందా! అంటే Subjective గా వుంటుందా, objective గా వుంటుందా, related గా వుంటుందా అనేది చర్చనీయాంశం. దాన్ని మాటలతో పరిమితం చేయరాదు. గ్రహిస్తూ, జీవితంలో చూసుకొంటూ అవగాహన చెందాల్సి వుంటుంది. ఒకరికి సత్యమైంది అందరికీ సత్యం కావాలి. ఇలా వాస్తవికమైన భూమిక మీద మాత్రమే సాధ్యం. ఊహ మీద, ముందు నిర్ణయం మీద, అనుకోవడం ద్వారా వీలయ్యేది కాదు. కాబట్టి వాస్తవాన్ని వాస్తవంగా గుర్తించడం సత్యమైంది అని అర్థమౌతున్నది. వాస్తవమంటే ఇంద్రియాలకు గోచరమై జీవితంతో సంబంధపడి అనుభూతమై లేక నిరూపితమై వుండేది. మరో విధంగా చెప్పాలంటే వున్నది వున్నట్లుగా గ్రహించడం సత్యం.

అసత్యంలో ఉన్న సత్యాన్ని గ్రహించడం సత్యం. సత్యమని ప్రచారం చేయబడిన దానిలోని అసత్యాన్ని కూడ చూడవలసి వుంది. సత్యం ఏక్షణానికి ఆక్షణం దర్శించవలసి వుంది. సత్యం ఒకసారి దర్శించినా, అది స్థిర బిందువు లాగా, కొండలాగ జీవితంలో అలాగే వుండిపోతుందంటానికి వీలులేదు. సత్యం ఆరాధనీయమైంది, ప్రార్థించదగ్గది, సర్వానికీ ఆధారమైన ప్రత్యేకశక్తి అని సరిపెట్టుకొనేది కాదు.

సత్యమేదైవం, దైవమేసత్యం అని మాటవరసకు అంటే సరిపోదు. సత్యమూ తెలియక దైవమూ తెలియక మాటలతో మోసపోవలసి వస్తోంది. ప్రస్తుతం నడుస్తున్న చరిత్రలో దైవం ఒక భావం. భావం వస్తువు కాదు. మాట కూడ వస్తువు కాదు. వస్తువును గూర్చి అనుకునేది భావం, వస్తువును గూర్చి చెప్పేదిమాట. మనం భావానికి,

మాటకూ పరిమితమై పోవడం వల్ల దానికి మించి పరిశోధించ లేకుండా వున్నాం. కాబట్టి భావము అడ్డుగావుంది. మాటముందుకు సాగనీయడం లేదు. భావాన్ని వదలాలి, మాటను నమ్ముకుని కూర్చోరాదు. పూజింపబడేది, నమ్మబడేది, సంకేత - ప్రతిమ - విగ్రహ - అవతార రూపాలు చెందేది దైవం అనుకున్నంత కాలం, వాటిలో మనసు తగుల్కొని వున్నంతకాలం ఎప్పటికప్పుడు జీవితంలో గ్రహించాల్సిన సత్యం మరుగున పడిపోతుంది. దాని చుట్టూ ఊహతో, మాటలతో అల్లిన అర్భాటాలూ సత్యాలనబడి మోసగిస్తున్నాయి.

దైవం ఉన్నదా లేదా అనేది ప్రశ్నకాదు. దైవం నిత్య జీవితంతో సంబంధం పడిందా లేదా అని ఎవరికి వారు చూసుకోవాలి. సంబంధ పడివుంటే, అనుభూతి (Experiencing) పరమైతే అది అందరికీ వాస్తవమై వుంటుంది. పరిశోధించి చూసుకోడానికి స్వేచ్ఛతో కూడిన మనసుండాలి. నమ్మకాలతో, భయాలతో మనసు నిండివుండే పరిశోధన స్వచ్ఛందంగా వుండదు. అవి పరిశోధనకు అవరోధాలవుతాయి. భ్రమలకు కారణం నమ్మకాలూ, భయాలేకదా! పరాధీనత వున్నంతకాలం దైవభావం అసత్యమైనదే. పరాధీనత లేనపుడు మాత్రమే సత్యంగోచరిస్తుంది, దైవపు నిజస్వరూపం తేల్తుంది.

మనం యధార్థాన్ని గుర్తించడంలేదు, తీవ్రంగా చూడడంలేదు, ఎందుకని? మనం మొత్తం భావాలలోనే జీవిస్తున్నాం. ప్రపంచం మారణాయుధాలతో నిండి వుంది. ఇది యదార్థం. దీన్ని మార్చుకోవాలా లేదా, మార్చు కోవాలంటే ఉన్నదానిలో మార్పు తెచ్చు కోవడం; ఆదర్శం పెట్టుకోవడంకాదు; అభిప్రాయాలతో (ideas) జీవించడం కాదు. భావాలతో మునిగిపోతున్నాం కాబట్టి యదార్థాన్ని నిజంగా గుర్తించడం లేదు.

మానసిక ప్రపంచంలో కూడ భౌతిక ప్రపంచాన్ని అనుకరిస్తున్నాం. భౌతికంగా ఒక భవనానికి ప్లాను, డిజైను, అవసరమే. మొదట్లో భావం కావచ్చు. భౌతికంగా అవసరమైంది. కాని సత్యాన్వేషణలో భావంతో పనిలేదు.

భావప్రపంచంలో చిక్కుకుపోవడం వల్ల "ఆధ్యాత్మిక" ప్రపంచం దెబ్బతిని పోయింది.

ఆరోగ్యంగా వుందాం అనేది తెలుసుకోనేదా? సత్యం వుందికాని, తెలుసు కొనేది కాదు. అది వున్నదే.

మనసు నిబద్ధతకులోబడి హిందువనో మరొకటనో భావంలో జీవిస్తున్నాం. హిందువుగా ఉండడమనేది సత్యం కాదు.

సత్యం అవిభాజ్యమైంది. సత్యంగా జీవించే వాడిని ఆస్తికుడని అనవలసింది లేదు, నాస్తికుడన వలసిందిలేదు. కాబట్టి ఆస్తికనాస్తి కత్వాలతో పనిలేదు. సత్యంగా జీవించే వాడికి వేరేపేరు పెట్టవలసిన అవసరమేముంది?

- 2-7-1997

# జనంలో కొత్త దేవుళ్లవెఱ్ఱి

జనాలు కొత్త దేవుళ్ల వెంట పడుతున్నారు. ఒక దేవుణ్ణి వదిలి మరో దేవుణ్ణి పట్టుకుంటున్నారు. ఈ వెంటాడంలో ఆలోచనకు కూడ తావులేకుండా పోతుంది. ఇదొక వెర్రిగా, పిచ్చిగా తయారయింది. తాము చేసేపని సరైందో కాదో పరిశీలించు కోడానకి గానీ, తమను గూర్చి తాము తెలుసుకోడానికి గాని సమయం కూడ లేకుండా ఆదుర్దా పడుతున్నారు. ఎందువల్ల ఇలా మనుషులు పరులకు వశమై పోతున్నారు? ఇకపోతే, కంప్యూటర్లు, సిద్ధాన్నంలా తయారయ్యాయి. కంప్యూటర్ జ్యోతిష్కుల వలె ఇక కంప్యూటర్ దేవుళ్లు తయారవుతారు. మనిషి స్వేచ్ఛ, మేధస్సు, వికాసం, ప్రేమ ఏం కావాలి?

కొత్త కల్కి దగ్గర నుంచి వెనక్కి పోతే అయ్యప్ప, సంతోషిమాత, సత్యసాయిబాబా, గణపతి సచ్చిదానద, సుందరచైతన్య, షిర్డిబాబా - ఇత్యాది దేవుళ్ళకు, లేక దేవుని ప్రతినిధులకు సంబంధించిన భక్తులముఠాలు నానాటికి పెరిగి పోతున్నాయి. అలా అని వ్యక్తిలో శాంతి సౌఖ్యాలుగానీ, సమాజంలో నీతిగాని పెరగడంలేదు, ఘోరంగా తరిగిపోతున్నాయి. పేరు ప్రఖ్యాతులతో పెద్దలని పించుకుంటున్న ఈ "దైవాంశ సంభూతులు(?)" సమాజాన్ని చెరుస్తున్నారా, దోచుకుంటున్నారా లేక బాగు చేస్తున్నారా అని ఒక్కసారైనా స్వేచ్ఛగా, ఆలోచించుకోవలసిన అవసరం లేదా? మనిషి ఏ బంధాలకు లోనుగాకుండా, ఏ ముసుగు వేసుకోకుండా ఈ మతాధి పత్యాలకూ, రాజకీయ ప్రలోభాలకూ, ఆధ్యాత్మిక దురాశలకూ వశం గాకుండా తనకు తానుగా వుండలేడా? ఇది చాలా సీరియస్ ప్రశ్న. ఈ దేవుడు గాక పోతే ఆదేవుణ్ణి, ఈ గురువుగాకపోతే

మరో గురువునూ ఆశ్రయించినంత తేలికైంది కాదు జీవితం. ఒకరికి పప్పురుచి, మరొరికి ఉప్పురుచి అని సమాధాన పడేంత సులభమైంది కాదు.

జీవితాన్ని అర్థం చేసుకోడానికీ, నిజంగా జీవించడానికీ ఎంతో లోతైన అవగాహన కావాలి. నాకు సత్యమైంది నీకూ సత్యం కావాలి. అది వాస్తవాన్ని వాస్తవంగా గ్రహించడం వల్లనే సాధ్యమవుతుంది. ఎవరి అభిరుచివారిది, ఎవరి మార్గం వారిది అనడం చౌకబారు వ్యాపార ధోరణి. దేవుళ్ల వల్ల, ప్రబోధముల వల్ల జరుగుతున్న దేమిటి? కీర్తి - ఖ్యాతి - ధనం - అధికారం - అత్యాశ - ముఠా తత్వం. ఇంతకు మించి ఏదైనా వున్నదనుకోవడం, ఒక ఆత్మతృప్తి, ఆత్మవంచన.

నమ్మకం మనిషిని ఎంతటి అధోగతికైనా పడదోస్తుందన్న సంగతి మేధావులనబడ్డ వారు కూడ గ్రహించలేక పోవడం మిక్కిలి శోచనీయం. "మేధావులు" తాము వంచనకు గురికావడమే గాక అమాయక ప్రజానీకాన్ని వంచనపాలు చేస్తున్నారు. కూటికొరకు కోటి విద్యలు, పేరుకొరకు పెద్దవ్యూహాలు. ఈ నాడు దేవుడి పేరు, లేక ఆధ్యాత్మిక విషయం చాలా లాభదాయకమైన మార్కెటు సరుకయి పోయింది. ఇది కళ్లారా చూస్తున్నాము.

నిజమైన జీవిత విషయాలలో సరియైన అవగాహన పొందడానికి గాను ప్రతి బుధవారం సా॥ 6 గం॥లకు తిరుపతి యస్.వి. యూనివర్సిటీ ఆవరణలో ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఇంజనీర్సు భవనంలో తీవ్ర యోచనా శీలురు కలుస్తున్నారు.

## వాస్తవాన్ని మించింది సత్యం

వాస్తవాన్ని చూడగలిగినపుడు అభిప్రాయంతో పనిలేదు, వస్తు సము దాయంపై అభిప్రాయాలు పెట్టుకోవడం అనవసరమని గ్రహించాలి. మానసిక విషయాలపై అభిప్రాయాలు వ్యక్తం చేస్తారు. అవి వైరుధ్యాలతో కూడి వుంటాయి. మనసులో కొన్ని నిర్ణయాలుంటాయి. మనసు నిబద్ధమై, కొన్నింటికి కట్టుబడిపోయి వుంటుంది. ఆ నిబద్ధతను బట్టి కొన్ని అభిప్రాయాలకు ముడిపడి పోతుంటారు. అలాగే దేవుని గూర్చి, సత్యం గూర్చి కొన్ని అభిప్రాయాలు కలిగి వుంటారు. అభిప్రాయాలెప్పుడూ వాస్తవాలు కావు, సత్యాన్ని చూపలేవు. సత్యాన్ని స్వయంగా అవగాహన చేసుకోవాలి.

సంపూర్ణ స్వేచ్ఛతో చూడాలి. లోతుగా గ్రహించాలి. వస్తువును చూడడానికి లేక తెలుసుకోడానికి ఇంద్రియాల సహాయం కావాలి. సత్యాన్ని మనసుతో అవగాహన చేసుకోవలసి వుంటుంది. మనసు కూడ నిశ్చలమయితేగాని సత్యం సమగ్రంగా బోధపడదు. సత్యావగాహనకు అవిటి తనం అడ్డం కాదు.

నేను హిందువునని చెప్పుకోవడం ఒక అభిప్రాయం మాత్రమే. అది వాస్తవమూ కాదు సత్యమూ కాదు. నేను మానవుణ్ణి, మానవత్వం కలవాణ్ణి అని వ్యవహరించడం సత్యం. సత్యం గ్రహించాలంటే నిజాయితీగల మనసు వుండాలి. అది నిష్కల్మషంగా వుండాలి. ఎలాంటి ముసుగువున్నా సత్యం కనబడదు. మత బంధిఖానాలో వున్న వానికి సత్యం తెలియదు. నమ్మకమనే గుంజకు కట్టుబడిన వానికి సత్యం తెలియదు. జాతికి, జాతీయతలకు కులానికి వర్గానికి, కట్టుబడి వున్నా, దేనితోనైనా గుర్తింపు పొందాలని ప్రయత్నించినా సత్యం సుబోధకం కాదు.

సత్యం సచేతనమైంది. సత్యాన్ని కనుగొనే మనసు కూడ సచేతనంగా వుండాలి. అలాంటి మనసు జ్ఞానంతోనూ అనుభవాల్తోనో భారంగా పడి వుండరాదు. సజీవ స్థితిలో మాత్రమే సత్యావిష్కరణ జరుగుతుంది. సత్యమంటే ఏమిటో దైవమంటే ఏమిటో తెలుసుకోవడానికి సంస్కృత పదాలు వల్లెవేస్తే ఉపయోగం లేదు. ఎలా ధ్యానం చెయ్యాలో తెలియాలి. అది పూజకు వేరైంది. వేలాది మంది పూజచేస్తున్నారు. అయినా సుఖవంతమైన ప్రపంచాన్ని సృష్టించలేక పోయారు. వాళ్లలో సృజనాత్మకత లేదు. సృజనాత్మకతలో పూర్తి చొరవ, పూర్తి ప్రేమ, దయ, సానుభూతి ఆదరణ వుంటాయి. చిన్నప్పటి నుంచి పూజ చేయడమంటే యంత్రంలా తయారు కావడమే. కాని ప్రశ్నించడం, సంశయించడం, పరిశోధించడం తెలిస్తే ధ్యానించడం తెలుస్తుంది. అది గొప్ప ఆశీస్సు. "మానసిక ప్రతి బింబాలు సత్యానికి అడ్డు వస్తాయి. సత్యం కనుగొనాలనే తీవ్రాసక్తి పరుడు మాత్రమే క్రొత్త నాగరికత సృష్టించగలడు. సత్యాన్ని ఏ క్షణానికి ఆ క్షణం కనుగొనాలి. అది శాశ్వతంగా వుందనిగాని, వరుసగా కొనసాగుతుందని గాని అనుకోరాదు. శంకరుడో, బుద్ధుడో చెప్పాడని నమ్మి కూర్చున్నావంటే నీవు సత్యం తెలుసుకోవడానికి ప్రయత్నించడం లేదని అర్థం"

నమ్మితే తప్పేమిటి, నీతిగా వుంటే చాలు గదా అనే ప్రశ్న ఉదయించింది. శీలము లేక సత్ప్రవర్తన కల్గివున్నపుడు నమ్మకంతో పనేముంది? నమ్మకం మనుషుల్ని విదీయడమేగాక, అసత్య ప్రచారానికి దారితీస్తుంది. ప్రచారంలో ఎప్పుడూ వ్యవస్థ,

ధనమూ, అధికారం పనిచేస్తుంటాయి. అందులో సత్యానికి చోటు వుండదు. సత్యం ఆంతరంగిక ఆవిష్కరణ.

(చర్చ సారాంశం) జూలై చివరిలో 97

# విశ్వాసం సత్యం కాదు

సత్యాన్ని విశ్వాసంతో కనుగొనలేము. నమ్మకం ఒక సెక్యూరిటీ నిమిత్తమే. ఆశ, భయం, అదుర్దా, అధారపడడం వల్ల నమ్మకంలో తగుల్కొంటున్నాం. దేవుడు అనే అభిప్రాయం దేవుడు కాదు.

కొన్ని వేల సంవత్సరాలకు విశ్వంలో వెంకటేశ్వర స్వామి ఉండకపోవచ్చును. ఎందుకంటే వెనక ఒకప్పుడు వెంకటేశ్వర్లు లేడు కదా. it is transcient. ఒక విగ్రహాన్ని పెట్టుకోవడంతో, ఇక చుట్టూ ఉన్న దానిపట్ల గుడ్డిగా అయిపోతున్నాం.

వాస్తు నిజమా అంటే అది ఆరోగ్య రీత్యా, అనుకూలత రీత్యా చూసుకో వలసిందేగాని, దాన్ని ఒక నమ్మకంగా తీసుకోరాదు.

నమ్మకం అందరికీ ఒకటి కాదు, అది విభజిస్తుంది, నాశనం కల్గిస్తుంది. అనేక సమస్యలను అనేక దేవుళ్లను సృష్టిస్తుంది. మనసు దేవుణ్ణి Project చేస్తుంది. మనసు అవగాహన చేసుకోలేదు. దేవుడికన్నా నమ్మకమే మనకు ముఖ్యమైంది. దేవుడి పేరుతో చంపుతున్నారు. నమ్మకంతో ఆత్మహత్యకు పాల్పడడం కొత్త రకం ప్రగతి! దేవుడు ఉన్నాడనడమూ ఒక నమ్మకమే, దేవుడు లేడనడమూ ఒక నమ్మకమే. ఇద్దరికి సత్యం (రియాలిటీ) తెలియదు.

నమ్మకం మనసును రోగమయం చేస్తుంది. అంటే నమ్మకం వ్యక్తిగత భద్రతగా పనిచేస్తుంది. ఇంతా తెలిసి, మనసు చురుకుగా నమ్మకాల నుంచి విముక్తి పొందవద్దా? వడలిపోయిన మనసు సత్యాన్ని కొనుగొనలేదు. నిస్పృహలో ఊగిసలాడు మనస్సు ఒక ఆధారం కోరుతుంది. ఆకాంక్ష శరణ్యం అవుతుంది.

ఇదంతా నిజంగా చూస్తే మనసు నిశ్చలమవుతుంది. అప్పుడు మాత్రమే సత్యం బయటికి వస్తుంది. గ్రహింపుకు సిద్ధం కాందే అది వచ్చేదికాదు. ఆశించనటు వంటి కాంక్షించనటువంటి, మనసున సత్యం ఆవిష్కరణ చెందుతుంది.

# నమ్మకం ప్రశ్నింపనివ్వదు

మనిషి ఎందుకు ప్రశ్నించడం లేదు. ఎవరు చెప్పినా వింటూ పోతున్నాడు. ఎవరు చెప్పినాసరే తనకు తానుగా ప్రశ్నించి అవగాహన చేసుకోక పోవడానికి కారణం ఏమిటి?

ఈ విషయంలో చదువుకున్న వారు మరింత ఎక్కువగా కట్టుబడి పోతున్నారు. దీనికి కారణం మన చదువు కూడ నడుస్తున్న సంస్కృతిలో భాగమై పోవడమే. సంస్కృతి ప్రశ్నించనివ్వడంలేదు.

సంస్కృతికి కట్టుబడి నమ్మకంతో చెప్పేవారు అయినా నిజంగా నమ్మకంలో వుండడం లేదు. ఎందువలనంటే అసలు నమ్మకానికి మూలంలోనే అనుమానించే స్వభావం వుంది. కనుక నమ్మకం, నమ్మక పోవడంలో కూడ అవగాహన లేకపోవడమే ముఖ్య కారణం.

ఏదైనా సంపూర్ణంగా నమ్మడం అంటూ వుండదు. అలాంటి అనిశ్చిత స్థితిలో జీవిత విషయాలలో నిర్ణయాత్మకంగా పోవడంవల్ల ఇబ్బందులు వస్తున్నాయి. వాస్తవిక భౌతిక విషయాలలో ఒక నిర్ణయాభిప్రాయనికి వచ్చి, అనుసరించడం తప్పదు. కాని మానసిక విషయాలలో ముఖ్యంగా తెలియని విషయాలలో ఇది శాశ్వతంగా ఇంతే అని అనుకోవడం పొరపాటు. అది శాశ్వత నమ్మకంగా ఉండిపోయి, ప్రశ్నించడానికి అవకాశం ఇవ్వదు.

వివేకం, ప్రజ్ఞ, అవగాహన పనిచేసి ప్రతి విషయంలోనూ నిజాన్ని గుర్తించి మార్పు చెందడంలోనే జీవితం సుఖశాంతులతో సాగగలదు.

# సంప్రదాయం ప్రేమకాదు

పెద్దలమాట వినడం, ఆచార వ్యవహారాలు పాటించడం అవసరమైన భాగమే అనిపించవచ్చు కొందరికి.

సంప్రదాయంలో నమ్మకం చేరివుంది. నల్లపిల్లి ఎదుట పడడం అశుభమనీ, నుదురుపై నామాలు పెట్టుకోవడం దివ్యం అనీ భావం వుంది. అయితే నల్లపిల్లి

ఎదురు కావడం అశుభం అనడానికీ, నామాలు అవాంఛనీయం కాదనడానికి ఆధారం ఏమిటి? రెంటి లోను వున్నది నమ్మకం కాదా? కాబట్టి నమ్మకపు స్వరూప స్వభావాలు ఏమిటో తెలిసికోవలసిన అవసరమేర్పడింది. కాబట్టి సంప్రదాయపు మూలాధారం, బేసిస్ ఏమిటో తెలియాలి. ఎలా ఏర్పడుతుందో, ఎలా పనిచేస్తుందో యోచించాలి.

గతంలో పుట్టి వర్తమానంలో పని చేస్తూ భవిష్యత్తులోకి వెళ్లేది సంప్రదాయం. విజ్ఞానాభివృద్ధికి సంబంధించినంత వరకూ గతంలోని అన్వేషణ ఫలితాలను తీసుకొని, దానిపై అబివృద్ధి చేసుకొనవలసిందే.

సంప్రదాయంలో Betrayal of the present by the past, వర్తమానాన్ని గతంతో వంచించడం లేక నొక్కి వేయడం వుంది. వాస్తవికత లేక యదార్థత వర్తమానానిదే. వాస్తవిక వర్తమాన చైతన్యమే జీవితం. ఈ జీవితానికి ఈ సమయం అనగా actual life మాత్రమే సత్యమైనది. వర్తమానమే సత్యము కదా! పదం లేక మాట అనేది గతం. పదంతో యాధార్థతను చూస్తే, చూసినట్లు కాదు. ఎందుకంటే పదమే సంప్రదాయం. పదం పుట్టి ఇప్పటికి ఒక అభిప్రాయం ఇచ్చేసింది. కనుక పదంతో అభిప్రాయ మేర్పడుతున్నదేగాని, యదార్థత జీవితంలో గోచరించడం లేదు.

చెట్టును చూడండి - అన్నపుడు, చెట్టును నిజంగాచూడడంకన్నా చెట్టును గూర్చి ఆలోచిస్తున్నాం. ఆలోచన అనగానే పదాలు, గుర్తింపులు, గత విషయాలు వస్తుంటాయి. ఇదంతా సంప్రదాయమే. కనుక సంప్రదాయ మంటే, పదం, ఆలోచన, గతం.

ఈ సంప్రదాయం వర్తమానంలో జీవించనివ్వడం లేదు. Observation from moment to moment is not thinking క్షణ క్షణం గమనించడం ఆలోచించడం కాదు.

ప్రేమ సంప్రదాయంకాదు. సంప్రదాయమున్నచోటు ప్రేమ లేదు. సంప్రదాయకుడు గౌరవ మర్యాదలు పొందవచ్చుగాని, అతనిలో ప్రేమలేదు. అసలు ప్రేమ వుందా లేదా అనేది చూసుకోవాలి. ప్రేమ ఎందుకు లేదంటే మనం ఆలోచనలో పడి, సంప్రదాయంలో జీవిస్తున్నాం. బిడ్డలను, అభిమానులను చూస్తున్నామంటే అది ప్రేమకాదు. అందులో స్వార్థం, ప్రయోజనం, భయం వున్నాయి. ఒక వ్యక్తి హిందువుగానో క్రైస్తువుడుగానో మారడం సంప్రదాయం. అది ప్రేమ కాదు.

జ్ఞానాన్ని, ఆలోచనలను పోగుచేసి, వాటిని ఆరాధించుకోవడం సంప్ర దాయం. దాన్ని ప్రేమ అని చెప్పడం ఘోరం. అలా గూడు కట్టుకున్న అభిమానాన్ని, అంటి పెట్టుకోవడాన్ని బద్దలు చేసేది ప్రేమ. ప్రతి గుర్తింపు, ప్రతిమాట వెనక ఇష్టా యిష్టాలు, అనురాగ ద్వేషాలు వుంటాయి. ఇదంతా మమకారమేగాని ప్రేమకాదు.

సంప్రదాయం రోజురోజుకూ బలపడుతోంది. దానికి విరుగుడు ఉందా. గత జ్ఞానాన్ని ఆధారం చేసుకొని సైన్సు విజ్ఞానవేత్త సాగినా, గతాన్ని బద్దలు చేసే సైన్సు వుంది. అందుచే విజ్ఞానం వేరు, సంప్రదాయం (traditon) వేరు అని అనాల్సి వుస్తుంది. ఆలోచనే సంప్రదాయం, ప్రేమ అంటే విప్లవం.

భౌతిక విషయాలు కొనసాగడం వల్ల సంప్రదాయం నిలిచి వుంటుంది. మానసిక విషయాలు కొనసాగ వలసినవికావు. కాబట్టి మానసిక విషయాలలో సంప్రదాయం ఉండరాదు. ఉంటే ప్రమాదకరం.

జీవితంలో మార్పు రావాలి గాని, సంప్రదాయ బద్ధమై పోరాదు. సంప్రదాయం కాలంతో సంబంధించింది. ప్రేమ కాలంతో చూసేది కాదు. Ending of traditon is ending of time. ప్రేమలో హృదయ సంబంధమైన అవగాహన ఉంటుంది. సంప్రదాయంలో ఆలోచనలతో - మనసుతో -కూడిన ప్రతిక్రియలు (reations) మాత్రమే వుంటాయి. ఆలోచన అనే అలజడి అణగారగానే ప్రేమ పుడుతుంది.

1.10.97

# ఇష్టం - నచ్చడం - ప్రేమ

"నా ఇష్టం, నాకు నచ్చింది" అనే నిర్ణయపూర్వకమైన మాటలు మొండి తనాన్ని సూచిస్తాయి. మొండి తనంగా వుంటే ఆ మాటలు అర్థంకావు. అర్థం కావాలంటే సహేతుకంగా వుండాలి. వివరణ ఇవ్వలేక, నిలబడలేక వుంటే మూర్ఖత్వ మనిపిస్తుంది. ఇష్టమేమిటి నచ్చుడమేమిటి? దానివెనుక ఒక మనస్తత్వముంటే దానికనుగుణ్యంగా వుంటే నచ్చుడమవుతుంది. అలాంటి నిబ్ధతకు సరిపోయింది ఇష్టమౌతుంది. నిబద్ధతకు ప్రశ్నార్థకమైనపుడు ప్రశ్నించడానికి వీలు లేదనడమే మూర్ఖత్వం. కాబట్టి ఒక వస్తువును గాని విషయాన్నిగాని హేతుబద్ధంగా, వివరణాత్మకంగా పరిశీలించాలి. ఆ పరిశీలనలో

ప్రశ్నలకు జవాబు దొరకాలి. అపుడు నిర్ణయం తీసుకోవాలి. అలాంటి విచక్షణకు అవకాశమియ్యని ఇష్టత, నచ్చుబాటు అర్థరహితమైనవి.

నీవు వేరూ నేను వేరూ అయినపుడు నీ ఇష్టం నీది నా ఇష్టం నాది అనడానికి అవకాశముండొచ్చు. అసలు నీవు నేను వేరు ఎలా అవుతాము? ఒక సమాజంలో వున్నాము, ఇరుగుపొరుగై వున్నాము. సంబంధంలో ముడిపడి వున్నాము. మనుషులతో వున్నట్లుగానే విషయాలతో, వస్తుజాలంతో, ప్రకృతితో సంబంధపడి వున్నాము. పూర్తిగా ఒకటిగా ఎలా లేము అనుకుంటున్నామో పూర్తిగా వేరై కూడ లేము. ఏ అంశానికి ఆ అంశం ఇద్దరమూ సమాధాన పూర్వకంగా మాట్లాడుకోవాలి. దృష్టిని సారించాలి. ఎవరికివారే యమునా తీరుకాదు.కనుక నా ఇష్టం అనడానికిలేదు. కనుక నీ ఇష్టం అనడానికిలేదు. అవసరానవసరాలు బాగోగులు చూసుకోవలసిందే గాని నచ్చటాలు పనికిరావు.

ప్రేమించడమనేది పరావలంబనమైందికాదు. పరులపై ఆధారపడిన ప్రేమ ప్రేమకాదు. స్వావలంబనమైనదే సరైన ప్రేమ. ఈ ప్రేమించడమనేదాని నిలకడేమిటో చూడాలి. ప్రేమించబడేది వస్తువైతే కొంత స్థిరత్వముంటుంది. కొంత సారూప్యత ఉంటుంది. కాబట్టి అలాంటిది నచ్చుబాటు కావచ్చు. ప్రేమించేవాడి మనసు మారినా వస్తువు అలాగే వుంటుంది. ఇది తెలిసి చేసే పని. మనిషినిగానీ మనస్తత్వాన్ని గానీ, ప్రేమించాల్సి వచ్చినపుడు అదేమిటో పూర్తిగా తెలియదు. తెలిసింది నిలబడదు. క్షణక్షణం చిత్తం మారుతుంటుంది. నికలకడలేని దాన్ని ఏ విధంగా ప్రేమించడం? ఇకపోతే ప్రేమించే వాడి మనస్తత్వం కూడ అంతే. మారేదే కనుక ప్రేమ పరస్పరం ఆధారభూతమైనది కాదు.

ఎదుటి వానిమీదో రియాక్షన్ మీదో ప్రతిస్పందనమీదో ఆధాపడినదని అనుకోవడం వల్లనే అలాంటి ప్రేమ స్థిరంగా కొనసాగడంలేదు. ఒకరిని కొంత కాలం లేక కొద్దిసేపు ప్రేమిస్తాం. ఆ తర్వాత మరికొంత కాలం ప్రేమించకపోవచ్చు. ఆతర్వాత విడిపోవచ్చును కూడా. అలాంటిది నిజమైన ప్రేమఎలాఅవుతుంది. దానికి స్థిరత్వమెక్కడిది? ఇద్దరిలో ఎవరిలోనైనా మార్పుండ వచ్చు. ఇద్దరిలోనూ మార్పుండవచ్చు. ఇద్దరిలోనూ మార్పుండకుండా, ఇద్దరి రియాక్షన్‌పై ఆధారపడ కుండా వుండడానికి వీలుందా? ఆ ఇద్దరి మధ్యా ప్రేమ నిజంగా వున్నదంటే అర్థమేమిటి?

ప్రేమ సబ్జెక్టివా లేక అబ్జెక్టివా? తాత్వికమైందా లేక వస్తు ప్రధానమైందా? తాత్వికమైనదైతే పరస్పర మనస్తత్వాలను పరిశీలించాలి. వస్తు సంబంధితమైనదైతే మనస్తత్వాన్ని విశ్లేషించాలి. ఇది స్వావలంబనమైందా, పరస్పరావలంబనమైందా అని చూస్తే అర్థమవుతుంది.

స్వావలంబనమైనది ఎలావుంటుంది? ఎదుటి వానిపై లేక ఎదుటి దానిపై ఆధారపడనిది. ఇది మళ్లా రెండు రకాలు. (1) నిబ్దమైంది, (2) అనిబద్ధమైంది. నిబద్ధమైనదంటే ముందుగానే ఏర్పరచుకున్న మనస్తత్వం, conditioned. అందులో ఇష్టాయిష్టాలు రాగద్వేషాలు లాభనష్టాలు ప్రయోజనాలు చేరివుంటాయి. మొండి వైఖరి కూడ వుంటుంది. ఇది నచ్చటాలకు, ఇచ్చకాలకు మూలమవుతుంది. స్వావలంబనమైనదిగా కనిపించినా, ప్రయోజనంపై ఆధారపడితే పూర్తిగా స్వావలంబన మనిపించుకోదు. అందుకే ఒకే రీతిగా వుండదు.

అనిబద్ధమైనది Unconditioned అయితే విషయ ప్రధాన మవుతుంది గాని, పూర్వ నిర్ణయాత్మకం కాదు. ఇక్కడ ముందుగా నిర్ణయించుకున్న దృష్టిలేదు. కనుక స్వచ్ఛందంగా, స్వేచ్ఛగా వుంటుంది. అవగాహనతో కూడి వుంటుంది. వర్త మానానికి సంబంధించి వుంటుంది. అదొక మానసిక స్థితి, ఉన్నదున్నట్లు చూసేగుణం. అట్టి స్థితిలో జనించే స్పందనే ప్రేమ. అది నిజమైన ప్రేమ. అది ఇతరులపై ఆధారపడింది కాదు

కాబట్టి ఒకే తీరులో ఉంటుంది. అంటే అలాగే నిత్యమైన స్థిరమైన కొనసాగింపుతో వుంటుందని కాదు. కొనసాగే దానికి కాలప్రమేయం వుంటుంది. దీనికి కాలబద్ధతలేదు. క్షణక్షణం వుండేది. ఎప్పటికప్పుడు జరగాల్సింది. జరిగిందాన్ని స్మరించుకొనేది కాదు. రానున్న దాన్ని ఊహించేది కాదు. ఉన్నదాంతో వుండేది. ఉన్నదేదో తెలుసుకొనేది. అలాగ పూర్తిగా స్వావలంబనమైంది. ఏది ప్రేమకాదో, ఏది పరాలంబనమైనదో తెలిసికొనగలిగిన స్థితి నుండి ఉద్భవించేదే ఈ ప్రేమ. అక్కరలేనివి, అసత్యమైనవి తొలగిపోగా మిగిలేదే ప్రేమ. ఈ ప్రేమలో ఇష్టా యిష్టాలకు తావులేదు. నచ్చుబాటు అంటూ వుండదు. నేను -నాది అనే ప్రమేయం లేనిది. నాకు నేను అనేది కానిది.

27-9-98

# 'ఆత్మ'కు కేంద్రమేంటి?

బుధవారం ఇంజనీర్స్ ఇన్స్టిట్యూట్ భవనంలో కృష్ణమూర్తి అధ్యయన కేంద్రంలో సెల్ఫ్ (self) పై చర్చ జరిగింది. సెల్ఫ్‌ను గురించి, దాని పోకడల గురించి అవగాహన చేసుకోవడమంటే సెల్ఫ్ అంటూ ఒకటున్నదని గానీ లేదనిగానీ ముందుగానే నిర్ణయించుకోవడం కాదు. సెల్ఫ్ అంటే తెలుగులో 'ఆత్మ' అనవచ్చు. సెల్ఫ్ అన్నపుడు కలిగే భావం కన్న 'ఆత్మ' అన్నపుడు కలిగే భావం వేరు. 'ఆత్మ' అన్నపుడు అది ఎక్కడో ఒదిగి యున్నదనే భావన, మనోరూపం, ప్రతిమలు ఏర్పడి వున్నాయి. అయితే దానితో వున్న దివ్యచర్య, నిత్యసంబంధం ఏమిటో మన అనుభవంలో తెలియడంలేదు. లోతుగా చూస్తే ఏమనిపిస్తున్నది? గంతంతోనూ, జ్ఞానం (మానసిక సంబంధమై సమాచారం) తోనూ కూడుకొన్న ఆలోచన సృష్టించిందే సెల్ఫ్, ఆలోచనే సెల్ఫ్.

ఇలాంటి ఊహాత్మక 'ఆత్మ'ను నమ్మి జీవించడంలో అర్థమేముంది? అది మానవ జీవితాన్ని స్వార్థ పరంజేసి, సంకుచితపరచి, విభజించి, ముక్కలు ముక్కలు జేసి ప్రేమ పేరుతో వ్యవహారాలు, భద్రత పేరుదో సంఘాలూ, మతాలూ, జాతి పేరుతో ద్వేషాలు, మోక్షం పేరుతో భ్రమలు సృష్టిస్తోంది. వ్యక్తిగత హింస నుంచి ప్రపంచ యుద్ధాల వరకూ దారి తీస్తోంది. బుద్ధి జనితమైన 'ఆత్మ' వెంటబడి కంప్యూటర్ లాగ మానవుడు వర్గస్తుడు గానో వర్ణస్థుడుగానో మతస్థుడుగానో జాతీయువాది గానో ప్రోగ్రాం వేసుకుంటున్నాడు. సాధనలను, వాదనలను పెంచుకొంటున్నాడు. అందులో కూరుకుపోతున్నాడు. విచ్ఛిన్నకర భారీ బాధాకర జీవితంలో చిక్కుకుపోతున్నాడు. జీవితపు లోతులను విశాలతను చూడలేక పోతున్నాడు. ఈ 'ఆత్మ' విశ్వాసాన్ని తక్షణం వదిలినపుడు మనసు పుష్పంలా విచ్చుకొంటుంది. గాలిలా స్వేచ్ఛ పొందుతుం, ఆకాశంలా హాయి చెందుతంది. చర్చలో రఘుపతిరావు, వేదపారాయణ, భాస్కరెడ్డి, దొరస్వామి ప్రభృతులు పాల్గొన్నారు. వచ్చే 5వ తేదీ బుధవారం 'మరణమంటే ఎందుకు భయం' అనే అంశం పరిశీలిస్తారు.



# మంచి చెడు నిర్ణయాలు

ఫలితాలను బట్టి పనులకు విలువలు ఆపాదించడం జరుగుతోంది. ఫలం అనుకూలించినపుడు మంచిపని అంటున్నాం. ఫలం వ్యతిరేకించినపుడు చెడ్డ పని అంటున్నాం. మంచిఫలం, చెడ్డఫలం అనేది కూడ అలాగే చెప్తున్నాం. ఈ అనుకూలత, వ్యతిరేకత ఎవరికి అనేది పరిశీలించాలి. ఈ మంచి చెడులను మనం నిర్ణయం చేసి అవి విధి నిర్ణయాలని పరిగణిస్తున్నాం. వాటికి మార్పు లేదని కూడ భావిస్తున్నాం. ఇలా మంచి చెడులు వర్గీకరణ నిర్ణయాలు ముందుగానే చేసుకుంటున్నాం, ఆ నిర్ణయాలతో ముందుకు పోతున్నాం. ఇదెంత వరకు సబబో పరిశీలన చేద్దాం.

చూసేవాని మనస్తత్వాన్ని బట్టి అనుకూల వ్యతిరేకతలు వుంటాయి, మనసుకు నచ్చితే అనుకూలత, నచ్చక పోతే వ్యతిరేకత; నచ్చినది మంచి, నచ్చనిది చెడు. నచ్చడం నచ్చక పోవడం మనసు నిబద్ధతను బట్టి వుంటుంది. మనసు నిబద్ధీకరణ సంప్రదాయాన్ని బట్టి వుంటుంది. గతానుభవం, తృష్ణ, ఆవేశకావేశాలను బట్టి నిబద్ధమై వుంటుంది. నిబద్ధమైన మనసు చేసే నిర్ణయం పాక్షికంగానే వుంటుంది. గతం ఒక నిబద్ధత. అది వర్తమానాన్ని స్వేచ్ఛగా చూడనివ్వదు. ప్రస్తుత అవగాహనకు మచ్చలేని స్పందన ఇవ్వదు. అలాగే ఆశ, అసూయ, హింస, ద్వేషాదులు వర్తమానాన్ని సరిగా చూడనివ్వవు. వాటితో కూరుకుపోయిన మనసుగల మనుషులు చేసే నిర్ణయాలు వాటి మసకలతోనే వుంటాయి. అలాంటి నిర్ణయాలు మంచివి ఎలా అవుతాయి. విద్వేషంతో చేసే పనులు విద్వేషికి మంచిగానే కనిపిస్తాయి. అవి అతనికి అనుకూలమైన పనులు గనుక వేరే దృష్టితో చూసే అవకాశం అతనికి లేదు.

కాబట్టి నిబద్ధమైన మనసు చేసే తీర్మానాల్లో, విభజనలో మంచి చెడుగా, చెడు మంచిగా కన్పించే ప్రమాదం వుంది. ఈ స్థితిలో ఒకరి మంచి మరొకరికి చెడ్డగా, ఒకరి చెడు మరొకరికి మంచిగా భాసిస్తుంటాయి. వాక్యం ద్వారా మంచి చెడులకు నిర్వచనం ఇచ్చి పనులను, ఫలితాలను అలా నిర్ణయం చేయడం సముచితం కాదు. దోషాలు కప్పి పుచ్చుకోడానికి చేసే పనులు సత్ఫలితాలను ఇస్తున్నట్లు కన్పించవచ్చు. అలా కన్పించడమే మూలోద్దేశం కావచ్చు. ఫలితాన్ని బట్టి అనగా మేలు జరుగుతున్న దాన్ని బట్టి దానికి మూలమైన పని మంచిదని సమర్థిస్తారు. దానిలోని అసమంజసత్వం కన్పించడం లేదా? దోపిడీ డబ్బు దానధర్మాలకు వినియోగించినంత మాత్రాన దోపిడీ

మంచిదవుతుందా? దానం మంచి దవుతుందా? స్వార్థబుద్ధితో, కీర్తి కాంక్షతో, మతలబుతో గడించిన సంపదను సామాజిక కార్యక్రమాలలో పెట్టినంత మాత్రాన స్వార్థమూ, కీర్తికండూతి ప్రశంసార్హములా? పనులెలావున్నా ఫలితాలకు పుణ్యము, పాపము అని పేరు పెట్టడం వల్ల ఫలితాలను బట్టి పనులను బేరీజు వేయ్యాల్సి వస్తోంది. ఇది ముందు చూపుకాదు, వెనుక చూపు.

నిబద్ధపూర్ణమైన మనసుతో గత భారంతో ఘనీభవించిన బుద్ధితో, ఆశాపూరిత హృదయంతో, విభజనాత్మక దృష్టితో సమాజాన్ని, చట్టాన్ని, అధికారాన్ని నమ్మకాలను, ఆచారాలను, దేవుళ్లను మనమే తయారుచేసుకున్నాం. మనం చేసుకున్నవి గనుక మనకు మంచివి గానే కన్పిస్తున్నాయి. లోతుగా చూస్తే, మైక్రోస్కోపులో చూస్తే వాటి దుష్ఫలితాలు సమాజంలో తెల్లమవుతున్నాయి. అవినీతి, అసమానత్వం, దురాగతం, అశాంతి అందలమెక్కుతున్నాయి. వాటికి - మనం సృష్టించుకున్న వాటికి - సదాశయమనే సామాజిక ముసుగు తొడిగాము, ఫలాపేక్ష రహితమనే ఆధ్యాత్మిక ముసుగుకూడ వేశాం. అయినా అవి మానవునికి మేలు చేయడం లేదు, మార్పు తేవడం లేదు. రక్షణ నివ్వలేదు. ఈ నేపథ్యంలో ప్రతిదానికి మంచి - చెడు అన్న సంప్రదాయకముద్ర, ముసుగు వేయడం, సరికాదని అర్థమవుతున్నది.

అయితే ఏ నిర్ణయమైనా చేసేముందు మనసు స్వచ్ఛందంగా, స్వేచ్ఛగా వుందా లేదా అని చూసుకోవాలి. నిబద్ధమైన మనసులో స్వేచ్ఛవుండదు, స్వచ్ఛత వుండదు. స్వేచ్ఛలేని మనసులో గజిబిజి, ఘర్షణ, విభజన, స్వార్థం వుంటాయి. అవే అసలైన చెడు. ఆచెడు - ముసుగులో, ముసలంలా పనిచేస్తుంది. స్ఫటికం లాంటి మనసులో పక్షపాతముండదు. చెడు వుంఢదు. స్వచ్ఛమైన అద్దంలో ఉన్నదున్నట్లు గోచరిస్తుంది.

కనుక గతం నుండి, నిబద్ధత నుండి మనసు పూర్తిగా విడుదల చెందాలి. ఇది ఏక్షణానికి ఆక్షణం జరగాల్సిన ప్రక్రియ. మనిషి తనను తాను అవగాహన చేసుకోవడం వల్ల మార్పు చెందుతాడు. నిత్యావగాహన ప్రధాన మవుతుంది. వర్తమాన స్పృహ నిండుగా వుంటుంది. మానసిక రుగ్మతలకు చోటు వుండదు. ద్వేషం, స్వార్థం, లేవు గనుక నిర్హేతుకమైన ప్రేమ జనిస్తుంది. ఇది మార్పు చెందిన మనసు లక్షణం. అలాంటి మనసుతో ఏమి జేసినా అది హితమే అవుతుంది. అలాంటి మనసు మంచి చెడ్డలు పట్టిక జోలికి పోదు. సహజ మానవత్వంతో స్పందిస్తూ ఉంటుంది. తద్వారా ఏమి చేసినా చేయక పోయినా మానవ కళ్యాణమే సిద్ధిస్తుంది.

మార్పు చెందిన మనిషి ఎప్పుడూ గానీ ఎప్పటికైనా గానీ తనకూ ఇతరులకూ మేలు చేసే తలపులోనూ - క్రియలోనూ కొనసాగుతాడు. తనకూ ఇతరులకూ మేలైనదే నిజమైన మంచి. అపుడు నీతి అవినీతులతో పనిలేదు, పుణ్య పాపాలతో ప్రమేయం లేదు. ఇది ఎవరికి వారు గ్రహించినపుడు, అది సమాజంపై ప్రభావం చూపుతుంది.

21-1-98

# అంతర్దృష్టిలో వుండేదేమిటి?

ఆలోచనతో కూడిన చూపు సామాన్యమైంది, బాహ్యమైంది. ఆలోచన లేకుండా చూడడం అంతర్దృష్టి లేక లోచూపు. తన లోకి తాను చూచుకోవడం అంతర దృష్టి అంటే దృష్టిని తనవైపు లేక తనలోకి మళ్లించడం. అన్నిటిలోకి చూడడం అంతరదృష్టి అని అర్థం కాదు. అయితే తన లోతులు తాను చూడగలిగనపుడు అన్నిటి లోతులు చూడగలిగిన సామర్థ్యం వుంటుంది. నిశ్శబ్దమైన మనసు (Silent mind), ప్రశాంతమైన మనసు (Quiet mind) మాత్రమే అంతర్దృష్టి వహించ గలదు. ముందుగానే ఒక దృష్టి, ఒక అభిప్రాయం పెట్టుకొని చూడడమంటే ఆలోచనతో పనిచేయడమే కాబట్టి ఒక మీడియా - మత, సిద్ధాంత, నమ్మక, అనుభవ, సూత్ర, గ్రంథ, దైవ, జాతీయభావనల - ద్వారా ఎంతలోతుగా, ఎంత తీవ్రంగా జూచినా అది అంతర దృష్టికాదు. జ్ఞానం ద్వారా నిబద్ధత ద్వారా చూడడం కూడ అంతర దృష్టి కాదు. కాబట్టి సంపూర్ణ స్వేచ్ఛతో, నిశ్చల - నిర్మల మనసుతో తనలోనికి తాను జూచుకొనుట అంతరదృష్టి, అది అంతరాంతరాళాల్లోకి పోతుంది. లోలోతులకు పోయిన కొద్దీ స్వీయావగాహనను అతిస్పష్టం చేస్తుంది.

మనసు లేకుండా చూడడం అంతరదృష్టి అని ఒక అర్థంస్ఫురించింది. అనగా మామూలు మనసు, బుద్ధి మౌనం వహించడం జరుగుతుంది. ఇక అక్కడ మనసులేదని అనుకోవడం కాదు, మత్తులో మునిగి మనసు పోయిన రీతి కాదు. అపుడు ఒక ప్రత్యేకమైన, వేరే తెలివి (ప్రజ్ఞ -Intelligence) పనిచేస్తుంది. అదిస్వీయావగాహనను, అంతరావగాహనను కల్గించడమే గాక, బాహ్యదృష్టిని కూడ పరిశుద్ధం చేస్తుంది. సంఘర్షణలకు మూలం తొలిగినాక, తాను చేసే ఏ వ్యవహార మైనా సవ్యంగానే ఉంటుంది.

అంతరదృష్టి వల్ల Perception, ప్రత్యక్షీకరణ కలుగుతుంది. అంటే ప్రత్యక్షంగా, తనకు తాను వాస్తవాన్ని చూడడం ఉన్నదున్నట్లు చూడడం జరుగుతుంది అదే సత్యదృష్టి. అది సమస్యను సమస్యగా చూస్తుంది. దాంతో సమస్య విచ్చుకుంటుంది. అపుడు సహజమైన, సవ్యమైన పరిష్కారం లభిస్తుంది.

ఉదాహరణకు ఆకలి సమస్య తీసుకుందాం. అది మానవ సమస్యే గాని జాతి సమస్య కాదు. ఆకలి వేయడం మనిషికి సహజం. మనిషిగా ఆకలి తీర్చు కోవడం సహజం. ఆహారోత్పత్తి కూడ సహజమైంది అవుతుంది. అంతేగాని ఆకలి సమస్య - ఆహారసమస్య అమెరికాది అనీ ఇండియాది అని అనడం తప్పు. అలాంటి జాతీయతే మానవ సమాజాన్ని విభజించి, సమస్యను సృష్టిస్తుంది. జాతీయ భావపు ఆలోచనే సమస్యగా మారుతోంది. ఈ సమస్య అమెరికాకు లేదు, ఇండియాకు వుంది అనడం సరికాదు. అమెరికనులు అని అనుకోకుండా మానవులు అని అనుకోగలిగితే, బాధ్యత ఏర్పడి తోటి మానవుడు దృష్టిలోకి వస్తాడు. అమెరికా గుర్తింపు ఇండియా గుర్తింపు, పెట్టుకోబట్టేగదా - సైనికశక్తినీ, అంతరిక్ష పరిశోధననూ పెంచుకోవడం జరుగుతోంది. పోటీలూ పోలికలేకదా అత్యవసర ఆహార సమస్యకు తక్కువ ప్రాధాన్యత నిస్తుండేది, అనవసర యుద్ధసన్నద్ధతను పెంచేది. సైనికులకు, యుద్ధాలకు పెట్టే బడ్జెటు ఆహార కొరతను తీర్చలేదా? కనుక సమస్యలను ఆలోచనతో గాక అంతర దృష్టితో తీర్చుకోవడం అవసరమని అర్థం కావాలి.

28-9-97

# Introspective Talk

## (హృదయానికి వినికిడి)

ఇన్‌ట్రాస్పెక్షన్ అంటే ఆత్మ పరీక్ష అని సామానార్థం. అది లోలోపల విశ్లేషణ లేక పరిశీలన అని చూసుకోవాలి. విశ్లేషణలో ఆలోచన ముఖ్యం. పరిశీలనలో యదార్థ స్థితిని గ్రహించడం వుంటుంది; అది హృదయ పరిశీలన; తనను తాను వినడం, తెలుసుకోవడం జరుగుతుంది.

స్వీయాలోచనా విశ్లేషణ వలన హృదయం తెలియదు. తన ఆలోచనలు ఇలా సాగాయి, తన మనసు ఇలా పనిచేసింది, అందుచే ఆయా పనులు చేయాల్సి వచ్చింది

అని చెప్పుకోవడం జరుగుతంది. అవి ఆలోచనతో, విశ్లేషణతో కూడిన మాటలు. "అలాంటి సంభాషణ వల్ల హృదయం తెరుచుకోదు. అది హృదయాన్ని మూసేస్తుంది. నిరుత్సాహ పరుస్తుంది, నిండా నిరుపయోగమైంది". "తెరుచుకోవడ మంటే వినడం, నీకు నీవు వినడమే కాకుండా, ప్రతి ప్రభావాన్ని వినాలి, నీ గురించిన ప్రతిచలనాన్ని వినాలి". విన్నమీదట ఏం చేశావు ప్రత్యేకంగా అని చూడడం కాదు, ఆ తెరుచుకోవడానికి తోడ్పడడమే దాని పని వినడమంటే గమనించడం, గ్రహించడం.

అలాంటి వినికిడి హృదయాన్ని పవిత్రీకరిస్తుంది, మనోసంబంధమైన విషయాలనుండి హృదయాన్ని శుద్ధిపరుస్తుంది. "మనసుతో వినడం మనేది ఒట్టి వాగుడు. నీకు గానీ ఇతరులకుగాని అది రలీఫ్ ఇవ్వదు. అది బాధ యొక్క కొనసాగింపు, కనుక నిరర్ధకం. పశ్చాత్తాపపు పలుకులు పాక్షికమైనవి. జరిగిందానిఫలితం ఎవరో మోస్తారనికనుకోవడం గానీ, ఎవరో తప్పిస్తారను కోవడం గానీ దురాశే అవుతుంది.

ఒకరికొకరు చెప్పుకోవడం వల్ల పాపక్షమాపణ వుండదు. ఎవరూ ఎవరి భారమూ తీర్చలేరు. అలా ఆశించడం భ్రమజనితం. ఎవరి బాధలు వాళ్లవే. ఇతరుల బాధలు వినే సమయంలేదు. అదే వృత్తిగా పెట్టుకున్న వాల్లు వింటారు, వాళ్లకు ధనరూపంలోనో, ప్రార్ధన రూపంలోనో, విశ్వాసం రూపంలోనో మూల్యం చెల్లించాలి. వినడం ఆ వృత్తి పరుని ఉద్యోగం, దానివల్ల ఫలితం శూన్యం. మన కష్టాలు ఎవరి మీదో పెట్టాలని చూస్తాం. పవిత్రీకరణ ఒప్పుకోలు వినేవాడి మీద వుండదు. హృదయం తెరుచుకోవాలని కోరేవాడి బాధ్యత వేరు. హృదయం తెరుచుకోవడం ప్రధానం.

గతం స్మరించుకోవడం ముఖ్యంకాదు. మార్పు చెందడం ప్రధానం. మార్పు ఎవరికి వారు చెందాలి. ఇతరు లెవ్వరూ హామీ ఇవ్వలేరు, ఖాయపరచలేరు. కష్టాలు, బాధలు, 'పాపాలు' బదిలీ చేసేవికావు. అనుభవించాల్సిందే లేదా అర్థం చేసుకోవాలి. వాటితో వుంటూనే తేలిక పడాలి. అయితే వాటిపై ఆధారపడికాదు, అవగాహన ద్వారా మార్పు చెందుతూ పరిష్కారం పొందాలి. మార్గమనుకుంటే అదొక్కటే! దానికి ఆసక్తి ముఖ్యం. ఆయాసక్తి సమాజంలో మార్పు తేవాలన్నా, తనతో మొదలవ్వాలి.

తనను తాను అర్థం చేసుకొనే రీతిలో వుండాలి. ఇది మన బాధ్యత. అంతేగాని గురువుకో మత పురోహితునికో, వారి పక్షాలకో వదిలివేయండం కాదు. దృక్పథంలో, నిత్యజీవితంలో రాడికల్ మార్పువస్తే ప్రపంచం కూడ ప్రభావితం అవుతుంది.

# సుగోచరం

## (PERCEPTION)

పర్సెప్షన్ అనే పదానికి ప్రత్యక్షీకరణం లేక పుర్ణావగాహన అని చెప్పవచ్చు. బాగాగోచరించింది, సుగోచర మయినది అనే భావంలో వాడవచ్చును. లోతుగా చూడడం ద్వారా పూర్తి గ్రహింపు కలుగుతుంది.

తనలోకీ, తనకు సంబంధించిన ప్రతి విషయంలోకి, ప్రతి సంబంధంలోకి లోతుగా చూడడం అంతర్దృష్టి (Insight). దానివల్ల అవగాహన, ఎరుక, వాస్తవ దర్శనం కలుగుతాయి. అంతర్దృష్టికి పక్షపాతం, నిబద్ధత లేవు. గనుక అది సూటిగా, స్పష్టంగా, సత్యంగా వుంటుంది. అవగాహనకు వాస్తవ దర్శినానికి సంబంధించిందే సుగోచరం (Perception). అదే గ్రహింపు. ఆకళింపు, ద్యోతకం, ప్రత్యక్షీకరణం అవుతుంది. అది ఉన్నదానిని యథాతథంగా, గంభీరంగా అనుభూతి చేసుకోవడం. కనుక అంతర్దృష్టికి ప్రత్యక్షీకరణకు (Perception) అంతగా భేదంలేదు. శబ్దాలు వేరు కాబట్టి అర్థంలో ఛాయా భేదా లుండొచ్చు. ఏమోగాని, భావనలో అనుభూతిలో తేడా లేదు. శబ్దాలను వాస్తవిక దృష్టితో, అనుభూతి పరంగా అర్థం చేసుకోవడం ప్రధానం.

"తర్కం బుద్ధిని పదునుగా, స్పష్టంగా, వాస్తవికంగా, తేటగా వుంచుతుంది. కాని పర్సెప్షన్ కలిగించలేదు. కాని పర్సెప్షన్ లాజికల్ (తార్కికం) గా పనిచేస్తుంది. పర్సెప్షన్ నిమిత్తం లాజిక్ అక్కర లేదు. కాని అది ఏమి చేసినా సహేతుకంగా, తార్కికంగా, తెలివిగా, వాస్తవికంగా వుంటుంది." తార్కికంగా వుంటుందేగాని, అలా చెయ్యాలన్న ఉద్దేశంతో కాదు. పూర్తిగా చూడడం (Insight or Perception) జరిగినపుడు ఆ క్రియ సంపూర్ణమైంది, సత్యమైంది - ఆ క్షణానికి పూర్తిగా చూడడమంటే ఇక ఏమాత్రం గడబిడ లేదు.

ప్రత్యక్షీకరణ జరిగిందంటే, వేరే చెత్త చెదారం ఇక పోగు చేసికోవడం వుండదు. పర్సెప్షన్ ఎప్పటికప్పుడు పని చేస్తుంది. దానికి వేరే తర్కం అనవసరం లేదు. ప్రత్యక్షీకరణ మనేది లో దృష్టి. అ లోదృష్టికి హేతుబద్ధంగా వుండే సొంత సామర్థ్యం వుంది. అలాగే దానికి తగిన తర్కమూ, క్రియా వుంటాయి. అది పూర్ణమైంది. ఎందుకంటే లోదృష్టిలో ప్రత్యక్షీకరణ (అవగాహన) సంపూర్ణమైంది. ఆ చూపు మసక బారదు, బూజుపట్టదు,

గజిబిజి ఉండదు. గందరగోళం ఉండదు. (పర్సెప్షన్) ఎలా వస్తుంది? అక్రమత, గజిబిజి, వైరుధ్యం వుంటే రాదు. మొదటిదే చివరిది (First step is the last step) అన్నపుడు అర్థం ఏమిటి? మొదటి చూపు పూర్ణమైంది. చివరిచూపు పూర్ణమైంది. మధ్యలో పాక్షికత వుండదు. భ్రమించడం జరుగదు. పాక్షిక ప్రత్యక్షీకరణలో ఎవరికి తోచిన తర్కం వాళ్ళు ప్రవేశపెడతారు. ఈ పాక్షికత వలననే ఒకరు ఒకవిధంగా, మరొకరు మరొక విధంగా, గీత, బైబిలు అనుసరిస్తూ వుంటారు. ఎవరికి వారే పూర్ణులను కుంటారు. పూర్ణావగాహనలో దుఃఖం యెడ స్పందనేమిటి? కరుణ ఎలాపనిచేస్తే అదే స్పందన. దయ నుండి ఉద్భవించే స్పందన దుఃఖం పట్ల పనిచేస్తుంది.కరుణ యొక్క శక్తి దుఃఖనివారణకు సరితూగుతుంది. మరింత వివరంగా చెప్పాలంటే, సంపూర్ణ అవగాహన గలవాని చర్య కరుణకు సంబంధించిందిగా వుంటుంది. కరుణాస్పందనే అతని స్పందన. ఒకరికి దుఃఖం సంభవించినపుడు, సంపూర్ణ వాస్తవ దృష్టి (Pereption) గల వ్యక్తి హిందువుగానో, క్రైస్తవుడుగానో మత విశ్వాస నిబద్ధతపై ఆధారపడి ఓదార్చక, తన కరుణ ఏవిధంగా స్పందిస్తే ఆవిధంగా సహాయపడతాడు. కరుణకు గల శక్తియే (energy) తగిన రీతిని దుఃఖితుణ్ణి ఓదారుస్తుంది.

మనోముద్ర (ఇమేజ్) లేనప్పుడే ప్రత్యక్షీకరణ సాధ్యం. ఇది చాలా సులువు. చిత్రం, పదం. బింబం - అన్నీకూడ మనోరూపాలే (ప్రతిబంబాలే). ప్రత్యక్షీకరణ దానంతటకది రావడం, వెలుగు కావడం జరుగుతుంది. ప్రత్యక్షీకరణే శ్రేష్టం అని తెల్సు కోవడం ఉంది. బింబాలుండే మనసు, దీన్ని ప్రత్యక్షం చేసికో లేదు. బింబాలతో చూస్తే వక్రత ఉంటుంది. మనం చెప్పింది నిజం; తార్కికంగా నిజం. నేను కాని వినడంలో 'నేను' లేదు. విన్నదాన్ని మోసుకెళ్ళేటప్పుడు 'నేను' ఉంది.'నేను' అనేది కాలం లో పనిచేస్తుంది.

"నీవు" "నేను" అనే విభజన తొలిగితేనే అనగా "నేను"అనేది లేనపుడు కరుణ వుంటుంది. కాబట్టి కరుణ (లేక ప్రేమ) 'నేను' అనేదానితో ప్రేరణ చెందేదికాదు. అలాంటి ప్రేరణ లేదు గనుక ప్రత్యేక ఫలితాన్ని ఆశించదు. కార్య కారణత్వం లేదు. బాధితుడు ఒక ఫలితాన్ని కోరినా అది తాను కోరిన రూపంలో లభించదు. ఓదార్పు వుంటుంది. కరుణ అంతర్ చైతన్య పొరలను ప్రభావితం చేస్తుంది. మానవుడు మూలాలు దర్శించాలి. పైపై సర్దుబాట్లు సరిపోవు.

# జీవించడమే వర్తమాన చైతన్యం

జీవితం వేరు, జీవించడం వేరు. పుట్టినది మొదలు మరణం వరకూ సాగేది జీవితం. ఏ క్షణానికి ఆ క్షణం అనుభూతిగా వుండడం జీవించడం. అనుభూతంగా వుండడంలో వుండే అంశాలు స్పందన - ప్రేరణ - అవగాహన - క్రియ - ఎరుక - సుఖం - దుఃఖం మొదలగునవి. ఈ అంశాలు సంబంధంలో తెలుస్తుంటాయి. సంబంధం భావాలతోనూ, మనసుతోనూ, ప్రకృతితోనూ, చుట్టు ప్రక్కల వారితోనూ వుంటుంది. కావున జీవించడమనేది సంబంధంలో వుంటుంది. సంబంధమే మానవ జీవితం. సంబంధం సరిగా వుండేటట్లు చూసుకోవడం ఎరుకలో జరగవలసిన ప్రక్రియ.

సంబంధం స్వచ్ఛందంగా, స్వేచ్ఛగా, ప్రేమగా, పరస్పర అవగాహన రీతిలో వున్నపుడు జీవించడం సాఫీగావుంటుంది. సంబంధం సరిగా లేనపుడే సంఘర్షణ జనిస్తుంది. ఘర్షణ వుందని గ్రహించినపుడు అది లేకుండా చూసుకోవడం మానవ కర్తవ్యం. ఘర్షణ మనసులో పుడుతుంది. అది బయటికి పొక్కే ప్రక్రియ మనిషివలనే జరుగుతుంది. కనుక దానితో వ్యవహరించాల్సింది మనిషే!

జీవించడం అనేది స్వీయావగాహనతో కూడింది. కనుక ఎలాంటి సిద్ధాంతాన్నీ వేరుగా వెతుక్కోనవసరం లేదు. ఎవరి అనుభవాన్నో ఆశ్రయించ పనిలేదు. తన జీవన సరళి నుంచే ఆచరణాత్మకమైన జ్ఞాన మేర్పడుతుంది. అదే అతని తాత్వికత. కనుక తత్వమనేది జీవించడం నుంచి జనిస్తుంది. మనిషి మనిషిగా జీవించడం అవసరం. మనిషి సాధారణంగా జీవించడం అవసరం. వివేకంతో, ప్రేమతో జీవించడం అవసరం. ముసుగులు, మసకలు, ముద్రలు మనసుకు లేనపుడు మాత్రమే అది సాధ్యం. ఎందుకంటే సహజ సిద్ధమైన స్వచ్ఛత అపుడు నిలుస్తుంది.

స్వచ్ఛత క్షణక్షణమూ వుండాలి. అపుడే అది నిత్యనూతనం కాగలదు. జీవించడం ఈ క్షణానికి చెందింది. దానికి సంపూర్ణత సంతరించాలంటే అది శక్తివంతం కావాలి. ఆ క్షణం శక్తివంతం కావాలంటే దానిపై పూర్తి సావధానత వుండాలి. అది సాధ్యం కావాలంటే మనసుకు పట్టిన భారాలు, ప్రాకులాటలు, పీకులాటలు, ద్వంద్వ వైఖరులు పూర్తిగా తొలిగి పోవాలి. 'ప్రపంచపు పాకులాట తప్పు, దైవ సంబంధిత పాకులాట గొప్ప' అనుకోవడం కూడ పాకులాటలో భాగమే. అది ప్రాకులాటను పెంచడమవతుంది. అందుచే చదువుకున్నవాడికీ చదువుకోని వాడికీ మత సంబంధమైన,

సంప్రదాయ సంబంధమైన ప్రాకులాట వున్నంత వరకూ అతడు మనసులో తీవ్ర ఘర్షణ పడుతూనే వున్నాడు. ఇది వాస్తవమా కాదా ముందు తేల్చుకోవాలి. ప్రాకులాటల ఘర్షణ నుండి మనసు పూర్తిగా విడుదలైనపుడు మిగిలేది శూన్యంకాదు; నిండైన చైతన్యం, ప్రేమ, ఔదార్యం, విశ్వజనీనత. అలాంటి మార్పు వచ్చినపుడు సమస్యలు, పరిష్కారాలు, సంబంధాలు పూర్తిగా మారిపోతాయి.

ఈ చర్చలో వేదపారాయణ, రఘుపతిరావు, దొరస్వామి, కాళహస్తి చిరంజీవులు, గుంటూరు అరుణ మొ॥ వారు పాల్గొన్నారు.

## చేతన

శరీరం పోగానే చేతనత్వం కూడా పోతుందా, లేక మిగిలిపోయి ఈలోకంలో పని చేస్తుందా? అయితే ఏం చేస్తుంది?

కాన్షియస్‌నెస్ (Conciousness) అనే ఇంగ్లీషు పదానికి చేతన, చేతనత్వం, చైతన్యం అనే పదాలు వాడుతున్నాం. సమానార్థకాలుగా చూస్తున్నాం. ఒకే భావంతో ఉపయోగిస్తున్నాం. చైతన్యం అంటే ప్రాణం అనే అర్థం కూడ వుంది. ఇక్కడ ఆ అర్థం తీసుకోవడం లేదు. భావనా సముదాయన్ని చేతన అందాం. ఇంకా విస్తృతంగా మొత్తం దృగ్గోచరాన్ని చేతన అనుకుందాం. జ్ఞాపకాలు, అనుభవాలు, ఆలోచనలు, మానసిక కదలికల మొత్తం కలిపి చేతనత్వం అయింది. అది ఆంతరంగిక సామగ్రి. చిత్తమూ అదే, దానిలోని సరుకూ అదే. దేహానికి కొంత స్వయం ప్రేరకశక్తి వుంది. ఈ చేతనత్వం శరీరానికి మహా ప్రేరక శక్తి.

పనిచేసే దేహం పోగానే, ప్రాణం (చేతన) పోయిందని అర్థం. ప్రాణంతో పాటు, మహాప్రేరకమైన చేతనత్వం కూడ అంతరించిపోతుంది. ఇలా అనడం అర్థవంతంగా, హేతు బద్ధంగా వుంది. అంతా అయిపోయింది, అంతా పోయింది. అయినా ఇంకా మిగలిందేమైనా వుందా అనే ప్రశ్న మిగిలి వుంది. అవును , మిగిలింది వుంది. ఆ దేహంచేసిన పనులు, ఆ మనసు వదిలిన భావాలు 'మనకు' మిగిలి వున్నాయి. మన చేతనత్వానికి తగిలి వున్నాయి. అతని ప్రబోధాలు మనకున్నాయి. అవి కదిలించవచ్చు, అది వేరే సంగతి. ఆ కదిలించే దానికి వేరే పేరు పెట్టాల్సిన అవకాశం కన్పించడంలేదు, సందు దొరకడంలేదు. అతని శరీరంతో పాటు అతని

చేతనత్వం పోయింది. కాని అతను మనచేతనత్వంలో జ్ఞాపకంగా మిగిలి పోయాడు. దీన్ని చెప్పడంలోనూ, అర్థం చేసుకోవడంలోనూ ఒక చిక్కువుంది. స్పష్టపరుద్దాం. భాషాపరంగా అర్థం చేసుకుందాం.

రామ విజ్ఞానం అనే మాటవుంది. దాన్ని రెండు విధాలుగా అర్థం చేసు కోవచ్చు. రాముని సంబంధించిన విజ్ఞానం అని అర్థమవుతున్నది. రాముని గూర్చి విజ్ఞానం అనీ చెప్పుకోవచ్చు. మొదటిది అతనికి సంబంధించింది. రెండోది మనకు సంబంధించింది. ఇది స్పష్టంగా వుంది. శరీరంతో పాటుచేతనత్వం పోయిందా అనేదాన్ని ఈ రీతిలో అర్థం చేసుకోవాలి. శరీరంతో పాటు శరీరికి చేతనత్వం పోయింది. అతడు పోయాడంటే అతడుగా వ్యవహరించిన దేహం చేతనత్వం అంతా కలిసి పోయినట్లే. ఇక అతనుగా మిగిలిందేమీ లేదు. అతడుగా మనకు దర్శనమిచ్చేది గాని, 'ఆత్మ'గా మనకు అతడు మిగిలేది గాని ఏమీ లేదు. ఎలాంటి భ్రమకూ అవకాశం లేదు.

అతని ప్రబోధాలు మిగిలాయి. అవి అతని జీవిత సారం కావచ్చు. అవి మనకు జ్ఞాపక చిహ్నాలేగాని అతని 'ఆత్మ' కాదు. మనం యదార్థం చూడాలి. అందుకు సమ్యగార్థం గ్రహించాలి గాని, అపార్థానికి తావియ్యరాదు. ఇకపోతే ప్రబోధాలు కదిలిస్తున్నాయి, సజీవంగా వున్నాయి అని అంటుంటాము. అవునా, కదిలించవచ్చు. అవి మనలో ప్రవేశించినపుడు, మరోవిధంగా - అవి మనవైనపుడు, మనవే మనల్ని కదిలిస్తాయి. అవి నిమిత్తమాత్రం, మనకు మనం కదిలేము. ఇక అతను లేడు. మనల్ని కదిలించేది అతని 'ఆత్మ' కాదు. మార్పుకు సిద్ధమైనటువంటి మనచేతనత్వం. అతనుగాక, మనముగాక అనంతంగా వున్నమహా (ప్రకృతి) చేతనత్వం గూర్చి మరో సారి చర్చించు కుందాం.

## తపన - తాపత్రయం

మనిషి కూడు - గుడ్డ - నీడ కొరకు తపన పడతాడు. అది సహజం, కనీస అవసరాలు తీరాలి. భౌతిక అవసరానికి మించి మరేదో సంపాదించాలనుకుం టాడు. మానసిక తృప్తికి వాటిని వాడుకుంటాడు. అది అత్యాశ,ఘోరమైన తపన.

మానసిక తృప్తికై పడేతపన రెండురకాలు. తిండి బట్ట గూడు సంతృప్తిగా

వున్నా వాటిని ఇంకా, మరింతగా ఆర్జించాలనే తపన ఒకరకం. వాటితో సంతృప్తిగా వుంటూ, వాటిని మించినది మరేదో పొందాలను కోవడం రెండోరకం.దానికి ఆనందమనో, ఆధ్యాత్మికమనో పేరు పెడతాడు. ఆ పేరు ముద్దుగా వుంటుంది. ఇష్టంగా వుంటుంది, ఊరిస్తుంది. ఉన్నదానితో తృప్తి పడక లేనిధానికై తపన పడతాడు. దేవుని వెంట పరుగులు తీస్తాడు. మోక్షానికి అర్రులుచాస్తాడు. ఈ జన్మ చాలక మరోజన్మ కావాలంటాడు. ఈలోకంలో గాక, మరో లోకంలో సుఖించాలంటాడు. చీకాకులు పోవాలని ఏకాకి అవుతాడు. ఉన్నస్థితిలో వుండక లేని స్థితికై తపన పడతాడు. ఈ తపన తనను తిని వేస్తుందని తెలియదు. విచక్షణ కోల్పోతాడు. తన్ను తాను చూసుకోడు.

కోటీశ్వరుడు కూడ మరొకరి కాళ్ళు పట్టుకుంటాడు. ప్రసిడెంటుకూడ మోకరిల్లుతాడు. పోపుకూడ ప్రార్థిస్తాడు. తాను భక్తులకు వేరైన వాడనుకుంటాడు. తనకు మించిందాన్ని కోరుతుంటాడు. ఉన్నది పోతుందనే భయం ఉండవచ్చు. లేనిది రావాలనే ఆశ పనిజేయవచ్చు. కీర్తి కండూతి కల్గించే తపన అంతా ఇంతకాదు. ఆర్జించాలనే తపన, అధికారం చెలాయించాలనే తపన, ఆనందం పొందాలనే తపన, అమరత్వం చెందాలనే తపన, కైవల్యం కొరకు తపన, జన్మరాహిత్యం చేకూరాలనే తపన, ఇక తపనలకు మించిన తపన దైవసాన్నిధ్యం - ఈతపన లన్నిటికీ కారణమేమిటి?

తాపత్రయం అనే అర్థంలో ఇక్కడ తపన శబ్దం వాడడమైంది. అత్యాసకు బద్ధమైన దాన్ని తపన అంటున్నాం. మానసిక ఆనందానికి ప్రేరేపించేదాన్ని తపన అంటున్నాం. ఒక నిబద్ధతామత్తుతో వెంటబడడాన్ని తపన అంటున్నాం. ఒక రకంగా చేసే సాధన, కృషి, ప్రయత్నం తపనలో భాగమే. ప్రశ్న, జిజ్ఞాస, కుతూహలం అనేవాటిని తపన అనడం లేదు. అవి మానవ సహజాతాలు. వాటి స్థాయిని అంచనా వేస్తున్నాం. వాటి అవసరాన్ని గుర్తిస్తున్నాం. వాటి గమ్యాన్ని గమనిస్తున్నాం. వాటి స్థానాన్ని కనిపెట్టి చూచేస్తున్నాం.

మనిషికి భౌతికశక్తితోపాటు ఊహించేశక్తి వుంది, మనసు ఎక్కువగా పని చేస్తుంటుంది. భౌతిక సృజనత్వానికది అవసరంకూడ. అయితే వాస్తవాన్ని మనసు నిండా నింపుకోవడంలేదు. పూర్తిగా లోతుగా దాని పట్ల ఎరుక వహించడంలేదు.

భౌతికంగా కొంత ఆధారం చేసుకొని ఊహల్లోకి తేలిపోతున్నాడు. వర్తమానంలో నిలబడలేకున్నాడు. మానసికంగా కాలం నిర్ణయించుకొని విభజన చేస్తున్నాడు. గతం - వర్తమానం - భవిష్యత్తుగా చూస్తున్నాడు. గతాన్ని దృష్టిలో పెట్టుకొని, భవిష్యత్తుకు దూకుతున్నాడు.

ఈ మానసిక అవాస్తవికత వల్ల లేనిదానిపై మనసు పెట్టుకోవలసి వస్తున్నది, ఆశపడవలసి వస్తున్నది. అలవాటయిన మనసుకు ఆశపడడమే ఆనందం. అలాంటి ఆనంద ప్రక్రియే తపన. నిజంగా, వాస్తవంగా అది ఆనందం కాదు. ఆనంద మనిపించే, భ్రమింపజేసే స్వయంతృప్తి, మానసిక ప్రక్రియ. ఉన్నదానిని ఉన్నట్లుగా చూడలేకపోవడం వలన, లేనిదానికై ఆశపడడం వలన, మానసికంగా కాలవిభజన చేసుకోవడం వలన భౌతిక విషయాలపై రేగే ఆలోచనలు అత్యాశకు, తపనకు దారితీస్తున్నాయి.

జీవితమంటే ఏమిటో సరిగా తెలియనితనం, అలవాటయిన రీతిలో మానసికంగా సాగిపోవడం, ఎవరో చెప్పింది నమ్మడం, నిరంతరం ఎవరిమీదో, దేనిమీదో ఆధారపడడం అంతర్గతంగా అసంతృప్తి పుండును పుట్టిస్తాయి. మూర్ఖత్వం దాన్ని పెద్దజేస్తుంది. సోమరితనం దానిపై కారం జల్లుతుంది. అపుడు వేడి - బాధ పుడుతుంది. దాన్నుండి తప్పించుకోవాలన్న పట్టుదల తపనగా మారుతుంది.

మనిషి మనిషిగా జీవించకుండా అమానవీయమైన, విభేదాత్మక మైన ముసుగలు వేసుకోవడం వల్ల ఆముసుగు వేడిమి నుండి తపన పుడుతుంది. నీవు నీ నమ్మకాన్ని, లేక సిద్ధాంతాన్ని ఎప్పుడు మార్కెట్‌లో పెట్టావో అప్పుడే తపన మొదలవుతుంది. మనిషైన వాడు, మనిషిగాకుండా పోవడం వల్ల మనసులోనే తపన రేగుతుంది. దానిపేరు ఘర్షణ. అసహజమైన చోట ఘర్షణ పుడుతుంది. అలాంటి ఘర్షణను నేరుగా తొలగించుకోకుండ, దానిమూలం తొలగించకుండా, దాన్నుండి తప్పించుకోడానికి చేసే సాధనే, ప్రయత్నమే తపన. దీన్ని తపన అనేకన్నా తాపత్రయం అనడం ఎక్కువ అర్థవంతం. మతం - కులం - జాతీయతాలు అన్నీ ముసుగులే. అవీ తాపత్రయాలే. దారేషణ, ధనేషణ, పుత్రేషణ - ఇవీ అసలు తాపత్రయాలు. వాటిలో తగుల్కొని మానసికంగా బయట పడలేకపోవడమే బాధాకరమైన విషయం.

దేవునిపేరుతోనూ, దివ్యత్వం పేరుతోనూ సున్నితంగా కొన్ని ఆశల సౌధాలు నిర్మించుకొంటున్నారు. అవన్నీ మనోజవాలే, మనోజములే. వాటిని చేరడానికి రకరకాల

సాధనలు కల్పించుకొన్నారు. వాటికి ఆధ్యాత్మికమని అందమైన పేరు పెట్టారు. అవన్నీ తాపత్రయ మార్గాలే,తపన కారణాలే. ఎందుకంటే వాటికి సత్య సమ్మతమైన ఉనికి లేదు, అనుభూతపరమైన జాడలు లేవు, నిత్య నిజజీవితంలో కనబడడం లేదు, స్వయంగా తనకు తాను చూడడంలేదు. స్వేచ్ఛను కోల్పోయి, నిబద్ధతకులోనై చూసే చూపు యదార్థతను గుర్తించలేదు.

జీవితం చాలా సరళమైంది, సూక్ష్మమైంది, సున్నితమైంది, సహజమైంది, లోతైనది. దాన్ని మనం సంక్లిష్టంచేసి, సంఘర్షణకు గురిజేసికాఠిన్యం జేశాము. ఈ మార్పుకు కారణం తాపత్రయమే. తపన జీవితం యొక్క ధ్యేయం, ఫలం సహేతుకంగా, సక్రమంగా, చైతన్యంగా జీవించడమే. అది ఎరుక వలననే సాధ్యం. కాని అసహజమైన ధ్యేయాలు, ఫలాలు పెట్టుకొని ఆశపడడంతో తపన మొదలవు తుంది.

15-1-98

# పవిత్ర గ్రంథాలు

మానవాళి మనుగడ సరిగా కొనసాగాలంటే నిష్కర్షగా ప్రశ్నించడం అవసరం. ప్రశ్నలద్వారా నేర్చుకోవడం జరుగుతుంది. నేర్చుకోవడమంటే జ్ఞానపు పరిమితిని పరిశీలించడం. బుద్ధిని దాటి పోవాలి. ఖాళీతనమే నీ స్వభావమని గ్రహించగలవు. కడగబడినపుడే, ఖాళీ అయనపుడే సౌఖ్యం వుంటుంది. "స్మృతికి బద్ధుడవైనంత కాలం, పుస్తకాల భాషల్లో పదాలలో చిక్కుకున్నంత కాలం ఘర్షణలూ తప్పవు, యుద్ధాలూ తప్పవు.''

ఆధ్యాత్మిక విషయాలను చెప్పే పుస్తకాలను పవిత్ర గ్రంథాలు అంటున్నాం. అయితే అవి మత పరంగా చేరిపోయాయి. చీలిపోయాయి. గ్రంథాలు జ్ఞానం సేకరించమంటాయి, మార్గం చూపిస్తాయి. సాధన చెయ్యమంటాయి. ఫలితాన్ని సూచిస్తాయి. ఈ విధానంలో కాలం, ఘర్షణ, సంశయం ఇమిడి ఉన్నాయి. అందుచే మనిషి పరిశుద్ధుడు కావడం లేదు సరికదా, పక్కదారి పట్టి పోతున్నాడు. బీభత్సాన్ని సృష్టిస్తున్నాడు. అవగాహన ప్రత్యక్షమైంది, తక్షణం జరిగేది. జ్ఞానం అలాంటిది కాదు.

పుస్తక జ్ఞానం పదాలతో కూడింది. పదాలు వల్లించడానికి మాత్రమే పనికొస్తాయి.

పైగా జ్ఞానం అధికారియై పెత్తనం చలాయిస్తుంది. పదం పవిత్రం కాదు, పదం సత్యం కాదు, పదం ఓంకారమైనా కావచ్చు, మంత్రమైనా కావచ్చు. ఆమెన్ అయినా కావచ్చు. ఏదైనా సరే పదం వాస్తవంకాదు. అందుకే పవిత్రం కాదు. నిప్పుకు బూడిదకూ వున్నంత తేడా వాస్తవానికీ, పదానికీ మధ్యవుంది. ముందురియలైజేషన్ (జ్ఞానోదయం లేక అవగాహన)కావాలి, తద్వారా అవసరమైతే పదం కావాలి. కాని మనం పదం ముందుపెట్టుకొని, జ్ఞానోదయం పొందాలని చూస్తున్నాం. అది జరిగేపనికాదు. అందుచేతనే పుస్తకాలు చచ్చినవాటితో సమానం. చచ్చినదాంట్లో పవిత్రత లేదు. స్వేచ్ఛ పొందినపుడు, పదానికి అతీతంగావున్నపుడు పవిత్రత వుంటుంది. సత్య దర్శనంలో, అవగాహనలో అది వుంటుంది.

మరియు జ్ఞానాధికారం మహా చెడ్డది. అది ఆరాధనకూ, అనుసరణకూ, అవినీతికీ దారితీస్తుంది. అది విజయానికి ప్రేరేపిస్తూ, మోక్షం పట్ల వెంపర్లు పుట్టిస్తుంది. మత గ్రంథాలు మనుషుల్ని బంధిస్తున్నాయి, విడదీస్తున్నాయి, ఛిన్నాభిన్నం చేస్తున్నాయి. విభజించడం పవిత్రత కాదు. కాబట్టి పవిత్ర గ్రంథాలను మొత్తంగా పక్కకు నెట్టి వేయడంతక్షణ కర్తవ్యం. ఇక్కడ ఒక్క విషయం గ్రహించాలి. ఏది చదివినా, ఏది విన్నా దాన్నుండి జ్ఞానం పోగుచేసుకొనేటట్లు వుండరాదు. ఎందుకంటే జ్ఞానం అవగాహనకు అవరోధం. సైన్సులో లాగ సత్యం, హైపోతెసిస్ (ప్రతిపాదన) ద్వారా లభించదు. మత పుస్తకాలలో రెడీమేడ్ ఆన్సరు వుందనుకోవడమే పెద్దభ్రమ.

"అచ్చయిన పదానికీ, పవిత్ర గ్రంథాలనబడిన వాటికీ ఎందుకు అంత ప్రాముఖ్యత? ఆశ్చర్యంగా వుంది... జ్ఞానాన్ని బోధించవచ్చు. ప్రజ్ఞను (Wisdom) బోధించలేము... నేను పవిత్ర గ్రంథాలను చదవను. కవిత్వం చదువుతాను. కాకపోతే, సరళమైన భాషనిమిత్తం పాత నిబంధన (బైబిల్) చదువు తాను..." అని కృష్ణజీ చెప్పారు.

వచ్చేవారం చర్చాంశం. "పవిత్రత మనుషుల్లో వుంటుంది గాని పుస్తకాల్లో వుంటుందా?"

3-8-97



# పవిత్రత ఎక్కడుంది?

ఓటు పవిత్రమైంది అంటారు. ఏమన్నా అర్థం వుందా? ఇది శుద్ధ అబద్ధం కదూ! రాయి పవిత్రమైంది అన్నా అంతే. అలాగే పుస్తకం మాత్రం ఎలా పవిత్రమవుతుంది! అసలు పవిత్రత అంటే ఏమిటి, అదెక్కడుంది? పరిశీలిద్దాం.

నీతిని మంచి అంటున్నారు. అది నియమానికీ, నడివడికకూ సంబంధించింది. అయితే అనుసరణవల్లగాక, అవగాహనవల్ల ఒక క్రమత ఏర్పడుతుంది. అది సహజ స్పందనతో వుంటుంది. ఆలోచన ఆగిన మీదట కలిగే స్థితి. అది ప్రేమపూర్వకంగా వుంటుంది. ఆ ప్రేమ యొక్క నైజమే పవిత్రత. "మనిషి సృష్టించిన దాంట్లో పవిత్రత లేదు. మనసు ప్రవేశించిన దాంట్లో పవిత్రతలేదు. జ్ఞాపకం నుంచీ, గతం నుంచీ పూర్తిగా విడుదలైనపుడు పవిత్రత వుంటుంది. అప్పుడు వాస్తవాలు వాస్తవంగా, సూర్యుణ్ణి నేరుగా చూసినట్లు గోచరిస్తాయి. "అలాంటి ప్రేమ ఉత్పన్నం కావాలంటే మీ పవిత్ర గ్రంథాలనూ, మీ దేవుళ్ళనూ, మీ ప్రతి ఒక్కరి వాంఛలనూ నెట్టిపారేయాలి. అదే అక్కడున్న పవిత్ర విషయం. అక్కడ మంచితనం పుష్పిస్తుంది. అది స్వేచ్ఛలో వికసిస్తుంది" కృష్ణజీ స్పష్టంగా చెప్పారు.

నిజంగా నేర్చుకోవడం జరిగే పాఠశాలలో పవిత్రత వుంటుంది. కాని దేవాలయం మసీదు చర్చిలలో నేర్వడం (Learning) ఆగిపోయింది. నమ్మకాలూ విశ్వాసాలూ మతాధికారం నేర్వడమనే క్రియను ఆపివేశాయి. కాని నమ్మకాలు పవిత్రమైనవనీ, పూజనీయమైనవనీ సంక్లిష్టకాంక్షలకూ, భయాలకూ లోనైన మానవుడు అంటున్నాడు.

పరిశుభ్రత భౌతికమైంది. వస్తు సంబంధమైంది. పవిత్రత హృదయ సంబంధమైంది. అనుభవపరమైంది. ఏదైనా ఆలోచనా స్థాయిలో నున్నంత వరకూ దానికి పవిత్రతలేదు, నీచత్వమూ లేదు. పవిత్రత పదానికీ, వస్తువుకూ సంబంధించిందికాదు. కనుక ఏ పుస్తకమైనా పవిత్రమైందీ కాదు, నీచమైందీకాదు, విభజనకూ ఘర్షణకూ దారి తీసేది ఏదీ పవిత్రం కాదు. జీవితం అఖండమూ, అవిభాజ్యమూ అయినప్పుడు అది పవిత్రమైంది.

సంఖ్యా బలాన్ని బట్టి దేనికీ పవిత్రత ఆపాదించరాదు. ఆసుపత్రులకు జనం రద్దీ ఎక్కువైనట్లు ఒక గుడి దర్శనానికి భక్తుల సంఖ్య అధికాధికం అయినంత మాత్రాన

అక్కడ పవిత్రత వుందనరాదు. కాగా, మానవుడింకా దిగజారి పోతుండవచ్చు, అనారోగ్యం పాలయినట్లుగా.

అలాగే "దేవుడు" అనే శబ్దం దేవుడుకాదు. అది దేనిని అవగాహనకు అందిస్తుందో, ఏది మనసుకు ఆవలవుండి అనుభూతికి కారణమవుతుందో ఆ అంతరంగ జీవితం పవిత్రమైంది. కానీ నిజంగా ఆ పదాలవల్ల అలాంటి అనుభూతి లభిస్తుందా? లోతుగా పరిశీలించినపుడు ప్రార్థన, దైవదర్శనం, పూజమున్నగునవి వినోద ప్రధానమైపోయాయి. జీవితం పరివర్తన చెందినపుడు, శీలం ఉన్నతోన్నత మయినపుడు పవిత్రత వుంటుంది. ఈ చర్చలో వేణుగోపాల్, చిన్నయ్య, సాంబశివారెడ్డి, దొరస్వామి, పుల్లారెడ్డి, హనుమంతు, మాధవరావు, వేదపారాయణ, భాస్కరరెడ్డి, రఘుపతిరావు మున్నగువారు పాల్గొన్నారు.

ఆగస్టు '97

# పరివర్తన జెందిన వ్యక్తులు కలిసి పనిచేయాలి

వ్యక్తిమారాలా సంఘం మారాలా అనేది తెలివి గలవాదం. బుద్ధుడు వ్యక్తి మారాలి అన్నాడు. మారిన వ్యక్తులు కలిసి సంఘాన్ని మార్చాలన్నాడు. సంఘం మారాలన్నాడు, మార్క్స్. వ్యక్తి పరివర్తన చెందాలి. వ్యవస్థీకృత సంఘం (మత -రాజకీయ - శాఖాపరమైన వేవైనా) వినాశకరం, అవినీతిమయం అన్నాడు కృష్ణమూర్తి. ఈనాడు ఏది సాధించాలన్నా, ఏ విజ్ఞప్తి మనవి చేసుకోవలన్నా ఒక సంస్థ లేకుండా కుదరడం లేదు ఎక్కువ భాగం. అయితే ఏ ఆర్గనైజేషనూ అక్కరలేదా, మారిన వ్యక్తులయినా కలిసి పనిచేయనవసరం లేదా? గత బుధవారం జిడ్డుకృష్ణమూర్తి అధ్యయన కేంద్రంలో ఇదే చర్చనీయాంశం. జిడ్డుకృష్ణమూర్తి ఆధ్యయన కేంద్రంలో.

జీవితాన్నీ, సమాజాన్నీ అర్థం చేసుకోడానికి ఆర్గనైజేషన్ అక్కరలేదు. సంపూర్ణంగా అర్థం చేసుకున్న వ్యక్తులు కలిసి పనిచేయవచ్చు. అదిఇబ్బంది కరం కాదు. ఎందుకంటే అలా కొలవడంలో స్వార్థానికి చోటు వుండదు. ఏదో మానసి కంగా సాధించాలనే ఫలితంపై (End result) ఆశవుండదు. అయితే సంఘాన్ని

మార్చడానికీ, అవగాహన ఇంకా లోతుగా పెంచుకోవడానికీ, తన్ను గూర్చి గానీ, సమాజం గూర్చిగానీ ఏమీ తెలుసుకోకుండా మానవుడు సంస్థలు స్థాపిస్తున్నాడు. మత -రాజకీయ - ఇతర ఉద్దేశాలతో నాయకుడు కావాలని చూస్తున్నాడు. కీర్తి, ధనం, గడించాలని తాపత్రయం పడుతున్నాడు. అవి దక్కాలంటే ఘర్షణకు, హింసకు వెనుకాడడంలేదు. సరైన నాయకత్వం గానీ మార్గదర్శకత్వంగానీ లేకుండా అశాంతిమయ జీవితం గడుపుతున్నాడు.

జీవితం, సత్యం తెలిసినవాడు సంకుచిత ఆత్మతృప్తికి, సుఖలాలసతకు పాటు పడడు. నిజమైన తృప్తి జీవితాన్ని అవగాహన చేసుకుంటే దక్కుతుంది. అవగాహనతో, మార్చిన సంఘటనలు బుద్ధుని జీవితంలో గానీ, ఇతరత్రాగానీ అనేకం వున్నాయికదా! కృష్ణమూర్తి వ్యక్తులెందరినో మార్చాడు. కాని ఆదర్శం పేరుతో మనుషులు వ్యవస్థీకృతం కారాదన్నాడు. వ్యవస్థ ప్రచారానికి పాల్పడుతోంది. ప్రచారం అనగానే అబద్ధాలు చేరతాయి. ఇక ఎప్పుడూ సంస్థను నిలుపకోడానికే వెంపర్లాటలు సరిపోతున్నాయి. మార్పు మృగ్యమైపోతోంది. ప్రజాపోరాట సంఘాలవారు ప్రజలను బలవంతంగా మార్చినా, అవగాహన లేక పోవడం వల్ల, మార్పు ఎక్కువ కాలం నిలవదు.

రాజకీయంగా గానీ సైన్య పరంగాగానీ చేసే హత్యాకాండను ఎవరైనా సమర్థించుకోగలరా? కసిగాగానీ, సిద్ధాంత పరంగాగానీ కొందరిని కాల్చేస్తే కాల్చేయబడ్డ వారిలాగా కాల్చేసిన వాడు ప్రవర్తించడనే గ్యారంటీ ఏమిటి? ఇద్దరికీ నిజమైన జీవితావగాహనలేదుగదా! రాజకీయ పార్టీలలోనూ, పోరాట ముఠాలలోనూ ఎన్ని విభజనలు రావడం లేదూ. రాబోయేవాని సుఖానికి ఇపుడున్నవాడు చావాలనడంలో ఎంత అమానుషత్వం వుంది? జీవితం అస్తవ్యస్తంగా బ్రతకడానికి కాదు. తాను సుఖంగా బ్రతుకుతూ, ఇతరుల్ని కూడ బ్రతక నివ్వడానికి. ముందు తనను తాను ఆలాగు చేసుకోవాలి. అలా జరగాలంటే సంపూర్ణంగా మారాలి. అలాంటివారు సమాజానికి కావాలి. అంతే గాని నక్సలైట్లుగా మారిన వారో, కల్కి కల్ట్‌లో మారినవారో కాదు. అవి పైపై ఆవేశపూరిత మార్పులేగాని లోతైన మార్పులు కావు. స్వార్థం, మోటివ్ లేకుండా రాడికల్‌గా పరివర్తన చెందినవ్యక్తులు సమాజ పరివర్తనకై కలిసి పనిచేయడం ఎంతైనా అవసరం. ఈ చర్చలో వేదపారాయణ, రఘుపతిరావు, చంద్రశేఖర్, సాంబశివారెడ్డి పాల్గొన్నారు.

వచ్చే బుధవారం చర్చనీయాంశం అవతారవాదం. 'యస్.వి. యూనివర్సిటీ ఆవరణలో, ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఇంజనీర్సు బిల్డింగ్‌లో, సా॥ గం॥ 6.00కు.

## స్థిమితంగా ఉండడమంటే ఏమిటి?

కలవర పడకుండా,

ఆదుర్దాపడకుండా,

ఆవేశ పడకుండా

ఆందోళన పడకుండా

ఆగ్రహం చెందకుండా

ఆబద్ధాలాడకుండా

అనవసరంగా ఊహించకుండా

అహంకారం చెందకుండా

అనవసరంగా మాట్లాడకుండా

అవసరంలో మాట్లాడడానికి వెనుకాడకుండా

అసలు విషయం దాటవేయకుండా, దాచకుండా

అందర్నీ తననూ ఎలాగో తృప్తి పరచాలనుకోకుండా

అవగాహనతో సావధానంగా ఉండడం.

## ప్రపంచశాంతి

ఆరోగ్యంగా వున్న శరీరం సౌఖ్యానిస్తుంది. నెమ్మదిగావున్న మనస్సు సంతోషాన్నిస్తుంది. సుఖసంతోషాలు హాయినీ, ఆనందాన్ని ఇస్తాయి. అవి తనువు - మనసులకు చెందినవి. శాంతి అనేది హృదయానికి సంబంధించింది. శాంతి గలవాడు ప్రసన్నంగా వుంటాడు.

శాంతి మనసుకు సంబంధించింది కాదు, హృదయానికి చెందిందంటారు. కృష్ణజీ శాంతి అంటే ఏమిటో తెలియాలంటే సౌందర్యమేమిటో కనుగొనాలి అంటారు. మాట్లాడే విధానం, ఉపయోగించే మాటలు, సంజ్ఞలు, అభినయాలు - ఇవన్నీ ముఖ్యమైనవి. వాటివల్ల హృదయ శుద్ధిని కనుగొనచ్చు. సౌందర్యాన్ని నిర్వచించలేము. దాన్ని మాటల్లో వర్ణించలేము. మనసు బాగానెమ్మదైనపుడు సౌందర్యం అవగాహన కొస్తుంది.

ఇంకా ఆయన ఇలా అంటారు. ప్రేమవున్నపుడు శాంతి వికసిస్తుంది. కేవలం ఆర్థిక భద్రతవల్లో లేక పిడివాదవ్రతమంత్రాలవల్లో కలిగే శాంతిలో సృజనాత్మకత శూన్యం. అలాంటి వాటితో ప్రపంచంలో ప్రాధమిక విప్లవం తీసుకొచ్చే అత్యవసరం వుండదు. అలాంటి శాంతి ఏదో తృప్తికో, తప్పుకోడానికో దారితీస్తుంది. కాని నీలో ప్రేమ సౌందర్యం పట్ల అవగాహన వుంటే, అపుడు శాంతిని కనుక్కోగలవు, అది మనసు బహిర్గతం చేసేశాంతికాదు. ప్రేమ, సౌందర్యాల ద్వారా లభించేశాంతి మాత్రమే సృజనాత్మకం. అది గజిబిజిని తొలగించి వ్యక్తిలో క్రమతను సృష్టిస్తుంది. ఈశాంతి, కనుగొనడం, ఎలాంటి ప్రయత్నంవల్లకాదు. నిరంతరం గమనికతో వున్నపుడూ, అసహ్యం పట్ల సౌందర్యం పట్లా సూక్ష్మ స్పందనతో వున్నపుడూ, అలాగే మంచీ చెడూ, జీవిత హెచ్చుతగ్గుల పట్ల సమస్పందనతో వున్నపుడు ఆ శాంతి ఆవిష్కారమవుతుంది. మనసు తయారుచేసే అల్పవిషయం కాదుశాంతి. అది అనంతంగా గొప్పది, అత్యంత విస్తృతమైంది, హృదయం నిండుగా వున్నపుడు మాత్రమే అది అవగాహనకు వస్తుంది.

శాంతి హృదయగతమైంది కదా! అంటే వ్యక్తిగతమైంది. వ్యక్తి ద్వారా శాంతి విస్తరిల్లాలి. శాంతి వ్యక్తి సంబంధమైనపుడు ప్రపంచశాంతి అంటే ఏమిటి? వ్యక్తితో ప్రాథమిక ప్రమేయం లేకుండా ప్రపంచశాంతి దేనిద్వారానైనా తెచ్చి పెట్టగలమా! సైన్సు ద్వారానో, సంస్థద్వారానో, మతగురువులద్వారానో, రాజ్యంద్వారానో, సిద్ధాంతం ద్వారానో సామూహికంగా శాంతిని, ప్రపంచశాంతిని గుప్పించగలమా? సామూహికశాంతి, లేక ప్రపంచశాంతి అంటూ ప్రత్యేకంగా ఏమైనా వుందా! విచారిద్దాం.

వాస్తవంగా చూస్తే విద్యకు, విజ్ఞానానికి కేంద్రమైన విశ్వవిద్యాలయంలో సౌందర్యారాధన ఏమీలేదు. అసలు ఈ తిరుపతిలోనే మురికి కూపం తప్ప సౌందర్యాధన ఏమీ కనిపించడంలేదు అని శ్రీరాంప్రసాద్ అన్నారు. స్వార్థంతో, పేచీలతో, భేదాలతో విద్యావంతులు కొనసాగుచున్నంతకాలం సౌందర్యమూ లేదు, శాంతి లేదు.

ఆత్మ పరిశీలన చేసుకుందాం. మనిషి అగ్లీగా, వైలెంటుగా తయార య్యాడు. హింస, యుద్ధం శతాబ్దాలుగా సాగిపోతున్నాయి. యుద్ధాలను సమర్థించే గురువులు, సిద్ధాంతాలున్నాయి. సహజంగానే మనిషి హింసాత్మకుడు అనే సూత్రం కూడ ప్రచారం అయింది. మనిషి హింసలేకుండా, దౌర్జన్యం లేకుండా శాంతిగా వుండలేడా? Violence అంటే ఏమిటో అర్థం చేసుకుంటే శాంతి వుంటుందేమో చూద్దాం. శాంతి అంటే ఏమిటో మనకు తెలియదు. ఎందుకంటే మనలో శాంతిలేదు, కనుక శాంతి అంటే ఏమిటో చెప్పలేము. హింసాత్మకంగా వున్నామనేది వాస్తవం. కాబట్టి అదేమిటో అర్థం చేసుకుందాం.

నాకు నేను ఇంట్లో Violent గా వుంటున్నానా? ఉద్యోగంలో ఎలా అంటున్నాను? ఇతరులకు నాపట్ల వుండే Violence ఏమిటి? అది అలా వుంచండి. నేనిలా అన్నాననేది ముఖ్యం. Acting unnaturally, artificially is violence. అభిప్రాయాలతో ముద్రలతో, మనోరూపాలతో (Images) తో బ్రతుకు తున్నానా! మానవుడుగానా లేక భావరూపాల తో బ్రతుకుతున్నానా? చిహ్నాల (Labels) తో బ్రతకడం వల్లనే గదా యుద్ధాలు వచ్చేది?

పులి ఎదురయినపుడు, మనలోని భయం తరంగాలు (Fear vibrations) దానిలో ప్రవేశించి, దానిలో భయాన్ని సృష్టించడంతో, అది మనమీదపడుతుంది. అందుచే ముందు మనం భయాన్ని వదులుకోవాలి. ఇక హింసతో పనిలేదు.

Nature లో violence వుందేమో! మనం ఆహారం తింటున్నాం. తర్వాత మనం తినబడుతున్నాం. కాబట్టి violence తప్పదేమో! కాని అవగాహన (Mental understanding) వుంటే హాయిగా వుండొచ్చనిపిస్తుంది - అని చిన్నయ్య అన్నాడు.

ఇంకా ఇలా అన్నారు: అహింస గొప్పది. అయితే భారతీయపాలకులు క్రూరంగాలేరా? సామాన్య మానవుడు ఇంగ్లీషు పాలకులకన్నా నల్లపాలకులచేతిలో మోసపోయారుకదా! ఈ జాతీయత వల్ల హింసతొలగిందా, లేక పెరిగిందా?

మనకు స్వరాజ్యంలో జరుగుతున్న మోసం అతి ఘోరమైంది. చట్టాన్ని చేసేవారూ, అమలు పరిచేవారూ, ఎలాగున్నారో, వాళ్ళ Quality ఏమిటో చూడాల్సివుంది. కనుక "మేధావులు" స్వార్థపరులై, దాన్ని నిలుపుకోడానికి హింసను ఆశ్రయిస్తున్నారు.

ఇక శాంతి ఎలా వుంటుంది? వుండేది హింస, విద్వేషం, విరోధం, పోరాటం.

హింస తొలగాలంటే ఆలోచన ఆగాలి, అభిప్రాయాలు తొలగాలి. గమనిక, అవగాహన పెరగాలి. మనసు నెమ్మది పడాలి, హృదయం తెరుచుకోవాలి. అవ్యాజ ప్రేమతో నిండాలి.

ఈ చర్చలో వేదపారాయణ, రామ్‌ప్రసాద్, హనుమంతు, రఘుపతిరావు, దొరస్వామి, భాస్కరరెడ్డి, రామమూర్తి, చంద్రశేఖర్ మొ॥ వారు పాల్గొన్నారు.

## విద్యార్థులు - వారి ఆలోచనాధోరణి

యువతలో విశృంఖలత, హింస, సెక్సు పట్ల అత్యుత్సాహం పెరిగిపోవడం గమనిస్తున్నాం. పోనీ చదువుకున్న యువత చదవులేని యువతకు వేరుగా వర్తిస్తున్నదా? చదువు విశృంఖలతకు, సెక్సుకు, హింసకు దోహద పడుతున్నదా లేక వాటిని యుక్తిగా వినియోగించుకోవడానికి పనికొస్తున్నదా?

చదువు విద్యార్థులను ఉద్యోగ సంపాదనారీతికి తోడ్పడుతున్నది. సమాచారం సేకరించడానికి, స్కిల్స్ వృద్ధి చెందడానికి చదువు కృషి చేస్తున్నది. పొజిషన్ - మని -ఉద్యోగం - భుక్తి ఎలాగా అనే ధోరణిలో చదువు యొక్క ధ్యేయం సాగిపోతున్నది కదా! వీటితో తృప్తి పడడంతో జీవితం సార్ధకమను కొంటున్నారు. అదేనా నిజమైన జీవితం? అలాంటి జీవితంలో భయం, హింస, నిరాశలేనట్లేనా? ఒక డాక్టరుగా లేక ఇంజనీరుగా, IAS ఆఫీసరుగా సాధించిందాంతో జీవిత సమస్యలు తీరిపోయాయా? ఎంతకీర్తి సంపాదించినా, ఇంతేనా? అవతలివాడు ఇంకా ఎక్కువ సంపాదించాడు కదా అనే ఆలోచనలోభద్రత వుందా? ఎందువల్ల ఇంకా అశాంతి! భయాలు ఉండిపోతున్నాయి? ఇవి లేకుండా వుండే జీవితం లేదా?

విద్యార్థి తాను సాధించినజ్ఞానంలో Security, మరియు stability లేకుండా పోతున్నవి. అందుచేత మరో దిక్కుకు పోవలసి వస్తున్నది.

చదువంటే సమాచార సంపాదన ద్వారా నేర్చుకోవడం అవుతున్నది. అది జ్ఞాపకశక్తి ద్వారా skills ద్వారా, Computer ద్వారా సమాచారం సేకరించడం జరుగుతోంది. మానవ మెదడు యొక్క ప్రతీక కంప్యూటరు. ఇది ఎందువల్ల వచ్చింది?

Accumalation, recording, Storing, and exhibiting ద్వారా చదువును కుదించడం వల్ల సమాచారం సేకరించే కంప్యూటరు ప్రాముఖ్యమైంది. మతం గూర్చి, గీత గూర్చి అలాగే సమాచారం సేకరించి దానికనుగుణ్యంగా నడుచు కోవడం computer జ్ఞానమే అయింది. అందుచే మెదడు నిబద్ధమై పోయింది. వృత్తి విద్యలాగే జీవితం కూడ స్మృతితో నిబద్ధమై యాంత్రికమై పోతోంది. చాలా చాలా తొలిగించు కోవడం (learning by Negation) ద్వారా నేర్చుకొనే చదువు ఒకటి వుందని కృష్ణమూర్తి చెపుతున్నారు.

నిబద్ధమైన కంప్యూటర్ వల్ల సంపూర్ణత, సంతృప్తి వుండడం లేదు. ఈ క్షేత్రంలో విద్యార్థికి అసంతృప్తి మిగలుతోంది.

దేవుడు - మతాలు - మున్నగు వీటి గూర్చి సమాచార సేకరణ లేకుంటే, వాస్తవిక జ్ఞానం ద్వారా శాంతిగా, సుఖంగా జీవించగలడు. మానసిక జ్ఞానం (Psychological knowledge) ద్వారా శాంతిలభించదు. మెదడును ఖాళీ చేయడం ద్వారా శాంతిలభించగలదు.

దేవుడు గురించి, జీవితానంతర స్థితి గూర్చి ఎందుకు చింతించడం! అనవసరపు జ్ఞానంతో మనసును ఎందుకు నింపుకోవాలి. అంతా ఖాళీచేయడమే కావలసింది, అర్థం చేసుకుంటే తప్ప, శాస్త్రాలు మొదలగునవి తొలగిపోవు.

జ్ఞానం (సమాచార సేకరణ) లేకుండా దేనినైనా చూడలేమా? ఇంతకు మించిన మార్గం ఏమీ లేదు. - Factual knowledge - వాస్తవిక జ్ఞానం తప్ప, మిగతా ఏరియా అంతా మనసులో ఖాళీ మాత్రమే వుంటుంది. అనవసరపు జ్ఞానం వల్లనే అశాంతి తాండవిస్తోంది. వృత్తిని గురించి మాత్రమే తెలుసుకొని, మిగతా మత విశ్వాసాల జోలికి పోనివారు, పనివాళ్లుగాని, వృత్తిపరులు గాని సమాజానికి హాని చేయరు. కాని చదువుకున్న మత విశ్వాస పరులే సమాజానికి ప్రమాదకారులు. పోపుగాని, జగద్గురువులు గాని భయంకర స్వార్థపరులు. ఎందుకంటే వాళ్ల మతాన్ని కాదనే వారిని సహించలేరు. అంతటితో సమరం మొదలవుతుంది. బైబిలు, ఖురాన్ ఎక్కడ పుట్యాయో అక్కడే నేడు యుద్ధాలు జరుగుతున్నాయి. వాళ్లిద్దరిమధ్యే యుద్ధజ్వాలలు ప్రజ్వరిల్లిపోతున్నాయి. సహనం అనేదాంట్లోనే వత్తిడి, అయిష్టత చేరి వున్నాయి.

15-10-97

# పరిశీలించకపోతే హాని

**మంచి అంటే ఏమిటి?**

అన్ని సంప్రదాయాల వారూ ప్రజలకు బోధిస్తున్నారు. ఇవన్నీ అవసరమేనని అనిపిస్తుందని ఒక అభిప్రాయం వెలిబుచ్చారు. అన్నిటిలో ఏదో ఒక మంచి వుంటుంది. కాబట్టి పర్యవసానం అందరిదీ ఒకటే కావచ్చు. అందరూ, బోధించక పోతే ప్రజలందరికీ అందడం కష్టం కదా అన్నారు.

అయితే ఒక మంచి విషయం ఉందంటే దాన్ని ప్రపంచ మంతటా వ్యాపింప జేయడం కష్టమా? కాదు. ప్రస్తుతం ఉన్న సదుపాయాల వల్ల అలాచేయడం అసాధ్యం కాదు. అందరూ మంచి మాత్రమే చెపుతున్నారన్న గ్యారంటీ వుందా? ఎవరికి వారు చెప్పుకుంటూ పోవడం వల్ల నిజంగా మంచి చెప్పేవారికి అడ్డు కోవడమే అవుతుంది.

ఇక పోతే మంచి అంటే ఏమిటో, ద్వేష మంటే ఏమిటో ముందు తెలియాలి కదా. ముందు తాను మంచిగా వుంటున్నదీ, లేనిదీ తెలుసుకోవాలి కదా. ఇంత ప్రచారం జరుగుతున్నా, ప్రపంచమానవుని జీవన విధానం నైతికంగా దిగజారి పోవడం. గొప్పగొప్ప వేత్తలంతా వాపోవడం మనం చూస్తూనే వున్నాం. కాబట్టి మంచి చెడులు లోతుగా పరిశీలించాలి.

సైన్సు ద్వారా వచ్చే విజ్ఞానానికి రెండు వైపులు వున్నాయి. మంచి చెడులున్నాయి. మేలు, కీడు జరుగుతున్నాయి. బస్సు మనల్ని దూరం తీసుకొని వెళ్తున్నది, వాతావరణ కాలుష్యం కూడ కలుగజేస్తున్నది. దాని సైన్సు స్వభావంలోనే దుష్పరిణామం కూడా వుంది. రెండు రకాల స్వభావాలున్నాయి. సైన్సును వినియోగించుకోవడం కూడా అలాగే జరుగుతున్నది కాబట్టి సైన్సు మానవునికి, సమగ్రమైన మేలు కూర్చడం లేదు. విజ్ఞాన వృద్ధితో ఓజోన్ పొరదెబ్బతిని పోతున్నది.

ప్రకృతి సిద్ధమైన వాటివల్ల ప్రకృతి సహజంగానే కొనసాగుతున్నది. కాని మానవుడు ప్రకృతిని ధ్వంసం చేస్తున్నాడు. ఏ రకం జీవరాశి పోయినా, ప్రకృతి దెబ్బతింటుంది. మనిషి పోతే ప్రకృతికి నష్టం లేదు. Man's birth is a freak in nature. ప్రకృతిలో సహజ విధ్వంసం జరుగుతున్నా మరో చోట అది నిర్మాణం ఔతూవున్నది. కాని

మనిషి మహావిధ్వంసం చేస్తున్నాడు - మరీ తక్కువ కాలంలోనే. మనిషిని ఎందుకు పొగడాలి? సహాయ పడేప్రకృతిని మనం పొగడడంలేదు, చెప్పుకోవడం లేదు - విధ్వంసం చేసే మనిషిని పొగుడుతున్నాం. అన్నిటినీ మెక్కి, మనంగొప్పవాళ్ల మనుకుంటున్నాం. Man is the crown of the universe. Man is most intelligent. These are egoestic statements. One man is eating so much which is sufficient for 3 people to live healthily.

మనిషిలో మంచితనమెక్కడ వుంది? He is intelligent and creative. But most of us, what are we doing? we are not understanding and observing ఆలోచనలో వుండడమే గాని పరిశీలించడం, అర్థం చేసుకోవడం జగడం లేదు.

మనిషికి పరిశీలించే గుణం వున్నా, పరిశీలించకపోవడమే వానిలో వున్నచెడు. ఆ చెడు విధ్వంసానికి కారణం. డా॥ వేదపారాయణ, డా॥ భాస్కరరావు, రఘుపతిరావు, దొరైస్వామి, హనుమంతు, శంకరరెడ్డి చర్చలో పాల్గొన్నారు.

8-10-97

# ఎవరి మార్గం వారిదా?

సిద్ధయోగం అనో, షట్చక్రాలనో కుండలి అనో- ఏదో ఒక యోగం పేరుతో వారం పది రోజులు శిక్షణ పొందవచ్చు. కఠిన నియమాలు పాటింపవచ్చు. ఏదో ఫలితం పొందవచ్చు. ఆహార నియమాలవల్ల, తక్కువగా తినడం వల్ల ఆరోగ్య లాభం ఉంటుంది. అంతకు మించిన ఆధ్యాత్మికత లేదు. ఆవారం రోజులు కాగానే మళ్లీ మామూలే. మనసు ఆలోచనా మయమవుతుంది. సంఘర్షణలలో చిక్కుకుపోతుంది. అలాగే భగవద్గీతను ఆధారం చేసుకొని చెప్పే ఉపన్యాసాలు యాంత్రికంగా ఉంటాయి. పాండిత్య ప్రకర్షణకు ఉపయోగపడొచ్చు. స్పందన మాత్రం అల్పం. బాగానే చెప్పడం ఉంటుంది. ఒక శ్లోకంపై ఆధారపడి, చెప్పేవిధానం బాగుండవచ్చు. ఎన్నెన్నో విజ్ఞాన విషయాలు చెప్పడం, ఎక్కువ మందిరావడం, ఆకర్షించడం జరగవచ్చు. అంతసేపూ హాయిగా మనసుకు నచ్చినట్లుండవచ్చు. ఆదంతా చక్కని కాలక్షేపంగా తయారవు

తుంది. కాని ఏదోశక్తి జనిస్తుందనడం భ్రమ.

ఎవరిదారి వారిది, మార్గాలు వేరైనా గమ్యం ఒకటి అనడం సరికాదు. ఇది తప్పు. జీవితం ఒకటే. ఆహారం వేరు కావచ్చు. దుస్తులు వేరు కావచ్చు. కాని, సమస్యలు అన్నీ ఒకటే, అందరికీ ఒకటే. భయం - ఆశ - ద్వేషం -మరణం, జీవనం అందరిదీ ఒకటే. అంతరంగంలో జీవితం అంతా ఒకటే. అసలు, హిందువు అనుకోవడమే మార్గం. అదొక మార్గం.

క్రైస్తవుడు అనుకోవడం మరో మర్గం. అపుడు అనేక మార్గాలు 'ఏర్పడుతుంటాయి. అసలు, ఏదో అనుకోవడం వల్లనే మార్గాలు ఏర్పడుతున్నాయి. అలాంటి మార్గాలు సరైన అవగాహన ఇవ్వవు. మనలను విడదీస్తాయి. మార్గాలు విభేదాలకు మూలం.

ఇక్కడ ఈ మార్గంలో మనశ్శాంతి లేదు, అని మరో చోటికి మరొకరి వద్దకు పోతున్నాం. మార్గం వెతుక్కుంటున్నాం. ఏదో మానసికంగా సృష్టించి దాన్ని ఆదర్శవంతం చేసి, పొందాలనుకుంటున్నాం. ఇలా ఆధ్యాత్మిక మార్గాలు ఏర్పడు తున్నాయి. అందుచే మార్గాలు ముఖ్యమైనాయి. ఒక మార్గానికి మరో మార్గం విరుద్ధమైంది. సర్దుబాటుకై ఎవరి మార్గం వారిది అంటున్నాం. అన్ని మార్గాలు గమ్యాన్ని చేరుస్తాయి అని అంటున్నాం, అయితే అసలు మార్గం సృష్టించడం, దాని మూలంగా ఆనందం - మోక్షం - కైవల్యం - జనన మరణ రాహిత్యం - స్వర్గం - నరకం - సృష్టించడం , ఇదంతా కల్పనయే కదా! కాబట్టి కల్పనలోనే దోషముంది. కనుక మార్గాలు ఒకగమ్యానికి చేర్చలేవు. అసలు గమ్యం కూడ ఊహతో పెట్టుకున్నదేగదా!

మానసికంగా ఇతరులపై ఆధారపడడం వల్ల వాళ్ల మార్గాలు పట్టవలసి వస్తున్నది. ఆ మార్గంలో తృప్తిలేక మరో మార్గం పట్టాల్సివస్తుంది. ఇలా మార్గాలు ఏర్పడడం, వాటన్నిటి వెంట పడడం జరుగుతుంది.

అసలు మార్గం పట్టుకోడానికి మూలం నీలో వున్న అసంతృప్తి, ఆశ. అలాంటివి ఎవరికి వారికి వుండడం కారణంగా విభిన్న మార్గాలు ఏర్పడుతున్నాయి. ఇలాంటి ఆశ ఎందుకు పుడుతున్నది? తాను ఏ విధంగా జీవిస్తున్నాడో దాంతో తృప్తిపడలేక, దాంతో వుండలేక దానినుండి తప్పించుకోడానికి ప్రయత్నిస్తాడు. కాని ఆ అసంతృప్తితో, ఆ సమస్యతో నిలబడితే సమస్య అక్కడే పరిష్కారం అవుతుంది. 17-12-97

# వినేప్రక్రియ క్రియాశీలకంగాకపోతే వినడమే వృథా

వినడమంటే అంగీకరించడమూ కాదు, వ్యతిరేకించడమూ కాదు. అయితే వాస్తవం వినాలి. సూర్యుడుదయిస్తున్నాడనేది వాస్తవం. దాని కంగీకారమెందుకు, అనంగీకారమెందుకు! చూడడం జరగాలి. ఇద్దరి చూపూ ఒకటే.

వినయంలాగా నిజాయితీ అనేది గొప్ప గుణం. ఆరోపించుకున్నది కాదు. తెచ్చిపెట్టుకున్న పెద్ద మనినిషి తరహా, గర్వాన్ని కల్గిస్తుంది. గర్వం అన్నీ తెలుసంటుంది. వినయం 'నాకు తెలియదంటుంది. లేదా తెలుసు కుంటా - నంటుంది. వినడంలో నిజాయితీ వుంటాలి. పదం వింటే సరిపోదు. శబ్దం వినాలి. భావం వినాలి, లోతుగావినాలి, సూక్ష్మంగా వినాలి. చెవితోనే గాక, మనసుతో, హృదయంతో, సర్వేంద్రియాలతో - మొత్తం ఉనికితో వినాలి. తెలిసినవన్నీ ప్రక్కన పెట్టాలి. తెలిసిందానిలోకి తర్జుమా చేసుకోరాదు. ఖండన మండనలు పనికిరావు. పిల్లలవలె ఆసక్తిగా, ఎదురుచూపులో వినాలి. విన్నదానిపై వివేకం పనిచేయాలి. ఇష్టాయిష్టాలు పని చేయరాదు. వాఖ్యానాలతో, వక్రీకరణతో విశ్లేషణతో వినరాదు. లోన పరిశీలన జరుగుతుంది. అది మార్పుకు, స్పందనకు దోహద పడుతుంది. ఒకరు చెప్పింది ఒకరు వినడం లేదు. భర్తను భార్య, భార్యను భర్త వినడంలేదు. పూర్తిగా వినడం జరిగితే ఆ ప్రక్రియే గొప్ప అద్భుతం అవుతుంది. విడమనేది ఒక కళ.

# మానవుడు ప్రకృతికి మిత్రుడా, శత్రువా?

మానవుడు ప్రకృతిలో ఒక భాగం. కాలక్రమేణ ఇది మరచి పోతున్నట్లున్నాడు. ప్రకృతి స్పందనతో జీవించడం తక్కువగా వుంది. ప్రకృతితో కలిసి మెలసి బ్రతకకుండా వికృత రూపాలపై ఎక్కువ ఆధారపడుతున్నాడు. ప్రకృతి సహజమైంది వికృతి మానవ మేధాశక్తితో నిర్మించుకొన్నది. మేధాశక్తిని మథించి నాగరికత సృష్టించు కొంటున్నాడు. సైన్సు -విజ్ఞానం వృద్ధి చేసుకొంటున్నాడు. అది తన సాధనకు, ఉల్లాసానికి, సౌఖ్యానికి విశ్రాంతికి దోహదపడుతున్నది. అయినా ఆ సౌఖ్యం ప్రకృతి సహజ సిద్ధమైన సంతోషాన్ని పెంచేదిగా వుండాలనేది ఒక తెలివిగల పరిమితి. ఆ పరిమితి దాటినవాని జీవితంలో సంఘర్షణ, భీభత్సమూ సంభవిస్తు న్నాయి. ప్రకృతి సంబంధమైన దేహాన్నీ, వికృతి

వైపుకు లాగుతున్న బుద్ధినీ సమన్వయం చేయడంలోనే మానవుని వివేకం పనిచేయాలి. ఈ పరిమితులు తెలియకనే మనిషి ఎక్కువ సుఖం పొందే బదులు, ఎక్కువ దుఃఖం పొలవు తున్నాడు. ఆడ, మగ - ఇద్దరూ ప్రకృతి జీవులే. కాని ఆడ మనిషిని ప్రకృతి అని, మగ మనిషిని పురుష్యుడనీ వేరు చేసి చెప్పడం ప్రకృతి బద్ధంగా లేదు అంటే సహజంగా లేదు.

ప్రకృతి భూతాలైన నీరు నిప్పు, నేల, నింగి, గాలి మనిషికి నిత్యం వాడుకలో వుంటున్నాయి. అందుచే మనిషి జీవిస్తున్నాడు. కాబట్టి ప్రకృతికి వేరుగా లేడని వాదించవచ్చు. దేహానికి సంబంధించినంత వరకు భూతాలు ఆధారమైవున్నాయి. ఆరవ ఇంద్రియమైన మనసుకూడా వుంది కదా! అది పూర్తిగా ప్రకృతి బద్ధమా? యోచించి చూడండి. ప్రకృతికి నిబద్ధమైన వరకు బుద్ధి పరిమితంగా పనిచేస్తుంది. స్వార్ధ పూరితంగా వుంటుంది.

బుద్ధి ప్రకృతిని వాడాలనుకొంటూ వుంటుంది. మనసు ప్రమేయంతో, బుద్ధి విశాలమైన కొద్దీ, వికసించిన కొద్దీ బుద్ధి యొక్క పరిమితి విచ్చుకుపోతుంది. నిస్వార్ధ దృష్టి పెరుగుతుంది. ప్రకృతి స్వేచ్ఛగా వినియోగమౌతుంది. బంధంలేకుండా పనిజరుగుతుంది. అపుడు మనసు ఒక శక్తిగా,గొప్ప తెలివిగా పనిచేస్తుంది. ప్రకృతితో సంబంధం వున్నట్లు కనబడినా, ప్రకృతికి అతీతంగా పనిచేస్తుంది. అపుడు ప్రకృతి సౌందర్యాన్ని ఆస్వాదించడం జరుగుతుంది. ప్రకృతిని ప్రేమించడం జరుగుతుంది. సౌందర్యం, సౌకుమార్యత, సంరక్షణ, లావణ్యం, లాలిత్యం వుండి, పర్యావరణ సమతుల్యంగా సాగుతుంది. అపుడు మనసు ప్రకృతి - భౌతిక - బద్ధంగాని అతీత, అనుత్తర శూన్యస్థితిలో నుండి పనిచేస్తుంది. భూతం అంటే గతం అనికూడ అర్థం వుంది. పంచభూతాలన్నీ గతానికి ముడిపడేసాగు తుంటాయి. శరీరంలో భౌతిక సంబంధమైన వాటికి వృద్ధి, సాధన, కాలం అవసరం. మనసు గతంతో పనిలేకుండా సద్యో అవగాహనతో వికసించగలదు. దానికి కాలంతో, సాధనతో పనిలేదు. భౌతికమైనది పరిణామం (evolution) చెందుతుంది. వికసిత మనసుకు నిత్యోదయం తప్ప పరిణామంతో పనిలేదు. నిత్యం మార్పు (Mutation) చెందుతూ రాడికల్‌గా పనిచేస్తుంది.

మనం యాంత్రికంగా పనిచేస్తున్నామే తప్ప ప్రకృతితో, తాదాత్మ్యం చెందుతున్నామా? గ్రామీణులకు పట్టణ వాసులకు వ్యత్యాసం తెలుస్తోంది కదా! టివీలు,

కంప్యూటర్లు వచ్చాక మనిషి భయానకమైన యంత్రమైపోతున్నాడు, సోంబేరి, సుఖలాలసుడు, బద్ధుడు, అస్వతంత్రుడు, నిర్దయుడు, ఆర్ద్రత లేని బుద్ధి జీవి అయిపోతున్నాడు. ప్రకృతికి ఎంతగా దూరమైపోతున్నాడో గ్రహించండి.

5-4-98

# సర్వజన సంక్షేమం

మానవులు సామాన్యంగా మూడు రకాల జీవితాలలో ఒదిగి తున్నారు. భౌతిక పదార్థ జీవితం, మతపరమైన జీవితం, ఆధ్యాత్మిక (లేకసాంస్కృతిక) జీవితం. ఆయా జీవితాలకు తగిన సిద్ధాంతాలు ఏర్పరచుకొన్నారు. పాశ్చాత్యు లందించిన బౌతిక విజ్ఞాన శాస్త్రం, భారతీయుల కర్మ సిద్ధాంతం, బుద్ధుని ధర్మచక్ర ప్రవర్తన, శంకరుని అద్వైతం, అరవిందుని అతీత మానసిక పరివర్తన, కృష్ణజీ జీవన తత్వం మున్నగునవి మానవులను ప్రభావితం చేస్తున్నాయి. అయినా మానవ చిత్తంలో వికాసం పెరిగేకన్నా, దిగజారుడు తనం పెరుగుతున్నది. ఎందుచేతనంటే మానవ మనుగడ విధ్వంసానికీ, మారణ హోమానికి ఎక్కువగా గురి అవుతున్నది. ఇది భయానకమైన మానసిక స్థితివల్ల, హింసాత్మక క్రియా కలాపాల వల్ల జరుగుతున్నది.

ఇందుకు ఎందరో కారణాలు వెతుకుతున్నారు. అందరూ మంచిగా వుండండి, మంచి చేయండి అని చెప్తున్నారని అంగీకరిస్తున్నారు. అయితే సిద్ధాంతాల మధ్య సమన్వయం లేక పోవడం కారణ మంటున్నారు. 'మంచి' అంటే ఏమిటో తెలియక పోవడమైనా కావచ్చు. సిద్ధాంతాల పుట్టుకను కాలానుగుణ్యంగా చూడాలిగాని పోల్చి చూడడం వల్ల ప్రయోజనం లేదని కొందరి అభిప్రాయం. ఎవరినీ మరొకరితో పోల్చరాదంటున్నారు. ఎవరికి వారు తమ సిద్ధాంతపు పట్టుకొమ్మతో ఊగులాడడమే ఛాందసం (fundamentalism). అది తొలిగితే గాని సామరస్యం కుదరదంటున్నారు. సామరస్యం (hormony) లేక పోవడమే అన్ని సమస్యల ఉనికికి కారణమంటున్నారు. మంచి చేయాలనుకుంటూనే మనుజులుగా జీవించకుండా, రకరకాల సైద్ధాంతిక ముసుగులలో జీవించడమే కారణమెందుకు కాకూడదు?

అసలు మానవ జీవతమంటే ఏమిటో సరిగా తెలియకపోవడమే ప్రధాన కారణం

అని తోస్తున్నది. వాస్తవం గ్రహించకనే ఆధ్యాత్మికత పేర, మతం పేర ప్రచారాలెన్నో సాగిపోతున్నాయి. సత్సంగాలకు, సమావేశాలకు ఎవరి సోత్కర్ష వారికి గొప్పగా వుంది. అన్ని మార్గాలకూ ధ్యేయం జనసంక్షేమమే అనేవారూ వున్నారు. కాని ఆధ్యాత్మికత అంటే ఏమిటో, దానికి మానవ జీవితంలో ఎంత అర్థం, ప్రాధాన్యత, పరిమితి వుందో పునః పరిశీలన చేసుకోవలసిన ఆవశ్యకత వుంది.

ఈ దృష్టితో "మానవజీవితం - ఆధ్యాత్మికత" అను అంశంపై తిరుపతిలో ప్రజాసదస్సు - చర్చా గోష్ఠి ఏర్పాటు చేయదలిచాము. ఆధ్యాత్మిక సంస్థలు, అధ్యయన కేంద్రాలు, మరికొన్ని, సంఘాలు ఇందుకు పూనుకుంటాయి. సర్వజనులకు ఇది ఐక్యవేదిక. వినడం, పరిశీలించడం, డైలాగ్‌లో పాల్గొనడం, సారం గ్రహించడం, హృదయంలో మార్పు చేసుకోవడం ఇందలి ముఖ్యాంశాలు. దీని నిర్వహణకు ఒక కమిటీ ఏర్పడింది. ఇలాంటి బృహత్తర ప్రణాళికలు దేశంలో పలుచోట్ల జరగాలి. స్థలం, సమయం తర్వాత ప్రకటింపబడును.

24-12-97

# పేదలపట్ల భావం

పేద వారిని సృష్టించింది మనం, 'కర్మ' కాదు. పేదవారు పేదవారుగా వుండడానికి కారణం సమాజంలేదా సమాజంలోని మేధావి వర్గం. పేదరికం అనే విషయాన్ని మరో విధంగా వాడుకునేవారు నాయకులు, రాజకీయ వేత్తలు. ఎన్నేళ్లు కృషి చేసినా పేదరికం అలాగే వుండిపోవడానికి కారణమేమిటి? పేదరికంపట్ల మనకు సరైన అవగాహన వుందా?

తింటానికి తిండి, కట్టుకోడానికి బట్టలేకపోవడం పేదరికం. ఇక వుండడానికి ఇల్లు లేక పోవడం మరింత పేదరికం. పని చేసుకోడానికి సరైన అవకాశం లేక పోవడం పేదరికం. స్వశక్తితో జీవం సరిగా సాగకపోవడం కూడా పేదరికమే. జాతీయ లేక అంతర్జాతీయ అంచనా స్థాయికి మించి (Poverty line) ఆర్థిక వసతి లేకపోవడం పేదరికం.

పేదలపట్ల మనకున్నసానుభూతి పెదవి వరకేనా? లేక బుద్ధి పరమైందేనా?

వారిపట్ల మనకున్న దృష్టి సరైందేనా? పేదలపట్ల మనకున్న బాధ్యత (Concern) ఏమిటి ? పేదలతో (Identity) తాదాత్మ్యం అయినపుడు మాత్రమే సరిగా అర్థంకాగలరు. వాళ్ల మధ్య జీవిస్తూ నిత్యం గుర్తింపు పొందినపుడు పేదరికం అంటే ఏమిటో వాస్తవికంగా తెలియగలదు. దేశాన్ని ప్రేమించడమంటే మనుష్యులను ప్రేమించడం, సామాన్య జనాన్ని ప్రేమించడం, వాళ్ల పరిమితులను, స్థితిగతులను అర్థం చేసుకోవడం. అంతేగాని, జాతీయ వాదులు (Nationalists) కావడం కాదు. జాతీయవాదుల ఆదర్శాలు పరిమిత మైనవి, వాస్తవికమైనవి కావు. నేను భారతీయుడను, నేను హిందువును - అను కోవడం మానసికమైన సంకుచితత్వం. నేను మానవుడను - అని అనుకోవడం వాస్తవికమైన విశాలదృష్టి. దేశం అనేది కొన్ని భౌగోళిక సరిహద్దులకు పరిమితమైనది. ఒక ప్రదేశం అనేది యదార్థం కావచ్చు. కాని జాతీయత అనేది యదార్థం కాదు. కాబట్టి జాతీయవాదులు, దేశభక్తి పేరుతో చలామణి అయ్యేవారు పేదరికాన్ని యదార్థంగా అర్థం చేసుకోలేరు.

యదార్థంగా పేదరికాన్ని గుర్తించినవాడు ఇంకా ఇంకా ధనవంతుడు కాలేడు, పేదలపట్ల సంబంధం లేనివాడుగా, బాధ్యత లేనివాడుగా వుండలేడు, పేదలకు వేరుగా వుండి మాట్లాడలేడు. బలవంతంగా ఆదర్శం కొరకో, పుణ్యం కొరకో, స్వర్గం కొరకో పేదగా జీవించడం వేరు, సహజంగా పేదగా, పేదలపట్ల నిజమైన సానుభూతితో, నిస్వార్థంగా జీవించడం వేరు.

పేదలతో తదాత్మ్యం చెందడం, పేదలను ప్రేమించడం, సరిగ్గా వాళ్లకు చేయదలచిందేదో చేయడం మాత్రమే వాళ్లను ఉద్ధరించడమవుతుంది. ఓట్లు గురించి చేసే సేవ, నిజమైన సేవా కాదు, ప్రేమాకాదు.

ఇక్కడ ఒక్క విషయం ఉంది. పేదలను ఉద్వేగపరచడం వల్ల, కోపోద్రిక్తుల చేయడంవల్ల పేదరికం పోతుందని మార్గం చూపే వాళ్లున్నారు. ధనవంతులపట్ల పేదలను రెచ్చకొడుతుంటారు. ఇలా చేసేవాళ్లు పేదలైనా, ధనికులైనా ముందు తామ హృదయంలో మార్పు తెచ్చుకోవాలి. వాళ్లు ఒక సిద్ధాంతం పేరుతోనో, దేశభక్తి పేరుతోనో తిరుగుబాటు చేయమంటారు. వాళ్లు ధనవంతులుగా వుండి, పేదలకు వేరుగా వుండి, మార్పు తీసుకొనిరావాలని చూస్తారు. దానికి సంస్కరణ అని పేరు పెడతారు. వాళ్లలో కొందరు ధనవంతులు కాకపోయినా ధనం పట్ల వాంచ పోగుచేసుకొనే గుణం కలవారే.

వీలయితే ఉన్నవాళ్లమనే ప్రదర్శన (Show of Wealth) చూపడానికి వెనుకాడని వాళ్లు అంటే వారివల్ల హింస పెరగవచ్చు గాని, ఒనగూడేది తక్కువ. పూర్తి పరిష్కారం రాదు. అందుచేతనే కొందరు జాతీయవాదులు ఎంత కృషిచేసినా విఫలులై పోతున్నారు.

హృదయంలో మార్పు చెంది పేదల్లాగ పేదలమధ్య వుంటూ సమైక్యంగా కృషిజేయడం వల్ల విప్లవం వస్తుంది. నిజమైన కృషి ఉద్యమ రూపం చెందుతుంది. విప్లవం శాంతంగా కూడా వస్తుంది. అలాంటిదే ఎక్కువ కాలం నిలబడుతుంది. ఎందుచేతనంటే అనుసరించేవారు, చూసేవారు పరివర్తన చెందుతారు. లక్షాధికారులు కోటీశ్వరులు, కోటీశ్వరులు కుబేరులు కావడానికి ఆరాటపడరు లోటులేని జీవనావసరాల తో తృప్తి పడతారు. మానసిక తృప్తికై నిల్వజేసుకోడానికి పోగుజేసుకోడానికి తాపత్రయపడరు. వాళ్లకు శ్రమయొుక్క సిరియొుక్క, నిజమైన విలువ తెలుస్తుంది.

పేదరిక నిర్మూలనకు ట్రస్టీషిప్ (Trustee ship) అనుదాన్ని చూపెట్టారు కొందరు పెద్దలు. అదే ధర్మ కర్తృత్వ సిద్ధాంతం. భూస్వామి లేక ధనస్వామి ధర్మ కర్తగా వ్యవహరిచడం, దయాదాక్షిణ్యం చూపడం, ధర్మగుణం దానగుణం కల్గి వుండడం, సహజంగా మార్పు చెందే అవగాహన కల్గి ఉండడం తక్కువ. కొన్ని సూత్రాలకు కట్టుబడి త్యాగం చెయ్యమనిబోధిస్తారు. లేదా ఒక సిద్ధాంతంగానో బలవంతంగానో అనుసరించడం వుంటుంది. ఒక విధానంగానైనా స్వీకరించ మంటారు. పునాదిలో మార్పు రాకపోవడం వల్ల పైపైవిధానాలు కావలసిన మేరకు పనిచేయడంలేదు. అందుచేత ఏ భూస్వామి తనకుతాను మారడంలేదు. మెప్పు కొరకు కొందరు మారినట్లు దానధర్మాలు చేస్తూంటారు. అది చాలదు. మానసిక విప్లవం రావాలి. అది అవగాహనతో, ఆచరణతో సాధ్యం. అన్ని రుగ్మతలకూ ఒకటే మందు. ముందు విప్లవాత్మకమైన మార్పు వస్తే, ఆ తర్వాత ఏంచేసినా చెల్లుతుంది, సరైనదవుతుంది. లోనఘర్షణ గందరగోళం తొలగందే బయట ఏమీ జరగదు.



# జీవితంలో నీతికి ఉన్నస్థానం

మానవుడు తనకు తాను నిర్వహించు కొనుటకు కొన్ని నియమాలు పెట్టుకుంటాడు. నియమం వ్యక్తిగతంగానూ, సామాజికంగానూ వుంటుంది. సరి యైన సంబంధం ఏర్పడడానికి తోడ్పడేది నియమం. వ్యక్తి గత స్థాయిలో వుండే నియమం నీతి కాగా, సామాజిక స్థాయిలో వుండే నియమం ధర్మం అయింది.

నీతి - ధర్మాలు జీవితం సాఫీగా సాగడానికి సులవైన సాధనాలు. సమాజ సంక్షేమానికి అవి అత్యవసరాలు. మనిషి సంబంధాలు పెరిగినకొద్దీ నీతి -ధర్మాలు మారుతూ వుంటాయి. సైన్సు వృద్ధిచెందినపుడూ, విస్తృతమైనపుడూ ఇవి మారు తుంటాయి. ప్రకృతికి సంబంధించిన నియమాలు ప్రకృతి ధర్మాలయినాయి. ఒక ప్పటి ధర్మాలు మరొకప్పుడు చెల్లకపోవచ్చు. ఒకచోటి ధర్మం మరొకచోట వర్తించక పోవచ్చు. కాబట్టి నీతి ధర్మాలు ఒకే రకంగానూ, శాశ్వతంగానూ వుండేవి కావు.

నీతి ధర్మాలు వాస్తవిక జీవితానికి సంబంధించినవి. అవి సమాజంలో పాటిం చాల్సినవి. అవి తెలియని విషయాలకు చెందినవికావు. అతీత శక్తులతో గానీ, కేవలం నమ్మకాలతో గాని ముడిపడినవి కావు. కాబట్టి వాటిని మతాలతో ముడి పెట్టరాదు. మతవాదులు కూడ నీతి నియమాలు, ధర్మాలు బోధిస్తారు. కాని నీతి నియమాలు మానవునికి సంబంధించినవి. మతం నమ్మకాలకు, ఊహలకు సంబం ధించింది.

నీతినియమాలు సత్ప్రవర్తనకు సహాయ పడతాయి. కాని వాటి ప్రభావం పరిమితమైంది. ఏందుచేత నంటే నియమాలు పాటించడాన్ని బట్టి ప్రభావం వుంటుంది. కొన్ని నిబంధనలు ముందు పెట్టుకుని, వాటిని అనుసరించడానికి ప్రయత్నించడ మవుతుంది. ఆదర్శ పూర్వకమైన అనుసరణద్వారా యాంత్రికత ఏర్పడే ప్రమాదం వుంది. అవగాహన కుదిరితే ఆచరణ సహజమైపోతుందని కృష్ణమూర్తి చెపుతారు. స్వచ్ఛందమైన, స్వేచ్ఛతో కూడిన మనసుకు అవగాహన లభిస్తుంది. అది పాక్షికమైంది కాదు, గతభారంతో కూడిందికాదు, నిబద్ధమైంది కాదు. ఎప్పటికప్పుడు వాస్తవాన్ని గ్రహిస్తుంది. కాబట్టి అలాంటి ప్రసన్న, నిర్మల మనసుతో ఏది ఆచరించినా, ఏది పాటించినా అదినీతిమయమవుతుంది. అది ధర్మబద్ధమవుతుంది. అవగాహన ద్వారా యేర్పడే నీతినియమ ధర్మాలు నిజమైన శీల సంపదకాగలవు. 4-2-98

# ఎలా ఆలోచించాలి?

ఎదుగుతున్న మనస్సుకు సహకరిస్తూ దాన్ని అవగాహన రూపంలో వికసింపజేసేది సరైన విద్య యని శ్రీకాళహస్తిలో రెండురోజులపాటు (19,20) జరుగుచున్న జిడ్డు కృష్ణమూర్తి అధ్యయన కేంద్రంలో ముఖ్య అతిథిగా పాల్గొన్న శ్రీ జె.యస్. రఘుపతిరావు వ్యక్తం చేశారు. మొదటి రోజు విద్యపై ఆసక్తికరమైన సంభాషణ జరిగింది. 'విద్' అనే ధాతువు ద్వారా వచ్చినది విద్య అనే శబ్దం. దాని అర్థం, తెలిసికొనుటలేక తెలిసినది. అలాగే తెలిసినవిగా వేదాలు ఏర్పడ్డాయి. అయితే ఒక్క సారి తెలిసిన విషయం జీవితం మొత్తానికి సరిపోతుందా? ఎప్పటికప్పుడు సృజనాత్మకంగా తెలియాలి, తెలియజేయాలి. హృదయాకాంక్షలకూ బహిర్గత ప్రవృత్తికి సమగ్రత చేకూర్చాలి. ఎలా యోచించాలో నేర్పాలి. గత విషయాలలోనూ భవిష్యత్ ఆశలలోనూ బంధించబడకుండా వుండాలి. ఎల్లపుడూ మనసుకు స్వేచ్ఛ నివ్వాలి. మనసు  నిబ్బరంగా వికసింపజేయాలి. అలా జేసేదే నిజమైన విద్యయని ముగింపు జేశారు. రెండోరోజు ధ్యానం గురించి మాట్లాడారు. ఆలోచనను అంతం యడమే సరియైన ధ్యానమని డా॥ వేదపారాయణ వివరించారు. మానవ సమస్యలకు ఆలోచనే మూలమన్న సత్యాన్ని ముందు బాగా గ్రహించాలి. ఏకాగ్రతతో సాధనజేస్తూ ఫలితాల వెంటపడేది ధ్యానంకాదు. గమ్యమూ గతమూ ఉన్నంత సేపూ అదిధ్యాన స్థితికాదు. ఆలోచనా స్వరూపస్వభావాలను ఆకళింపు జేసుకొని,  దానిని దాని యొక్క పరిధిలో వుంచి గమనికతో జీవించడమే ధ్యానం. ధ్యానం దానికది గమ్యమేగాని దేనికో సాధన కాకూడదు. ఆలోచన ఎప్పుడూ ఏదో ఒకదాని మీద ఆధారపడి వుంటుంది. ఒక ఘటనో ఒక వస్తువో, ఒక భావమో, ఒక సమాచారమో దానికి ఆధారమై వుంటుంది. కనుక ఆలోచన స్వతంత్రమైందికాదు. ఆలోచన భౌతిక విషయాలను మించి దేనినైనా సాధించి పెట్టగలదా? జీవితమనేది భౌతికమూ, మానసికమూ. ఆలోచనల్ని భౌతిక విషయాలలో వాడుకోవాలే తప్ప, మానసిక విషయాలలో చొరబడనీయరాదు. మానసికంగా వాస్తవికంగానే నడుచుకోవాలి. అపుడు మాత్రమే నిజమైన ధ్యానస్థితి ఏర్పడుతుంది.

ఇక పోతే విపశ్యన ధ్యానం ద్వారా స్థూలమైన మనస్సును సూక్ష్మతరం చేయడముంటుంది. తద్వారా అంతః చేతన మనసు, దేహంపై చూపే స్పందన అనిత్యం

అని గ్రహించాలి. అలా సహజంగా గమనించడం శాంతి చేకూర్చే ధ్యానం కాగలదు, శాంతి చేకూర్చగలదు. ఈ చర్చలో చిరంజీవులు, కె. రామమూర్తి, త్యాగరాజు, శంకరన్, ప్రతాప్ సిన్హా, శివయ్య, పి. సుబ్రమణ్యం, టీచరు సుబ్రమణ్యం, చలపతి ఇంకా అనేకులు పాల్గొన్నారు.

20-9-98

# మరణ మంటే...

మరణమంటే భయం, దుఃఖం, తెలియంది, అవాంఛనీయం - ఇదీ మనకు తెలిసింది. ఇది మనకు ఎలా తెలిసింది అన్నదాని నుండి మొదలు పెడదాం.

తర్వాత ఏమవుతుందో అన్నభయం. ఉన్నది పోతుందేమో అన్న భయం. ఇంకా కొన్ని రోజులు అనుభవిస్తే బాగుండుననే ఆశకు విఘాతం కల్గునన్న భయం. ఎవరైనా చనిపోతే, ఆ స్థితి చూడలేక భయం.

ఉన్నది పోతుందనీ ఆశ నిరాశ అవుతుందనీ అనుకున్నవి నెరవేరలేదనీ, దుఃఖం. జరగబోయేది తెలియదని దుఃఖం కలుగుతుంది. సంప్రదాయాన్నను సరించడంలోను దుఃఖం ఉంది.

చేతనత్వం, దాని ప్రక్రియలు సహజంగా తెలిసినవిగా వుంటాయి. అవి అణగారిపోతే ఏమవుతుందోననే తెలియని తనం వుంది. తెలియందాన్ని కలుసు కోవలసివస్తుంది గదా! అపుడేంచేయాలి? అదే జంకులో వున్న తెలియని తనం. చచ్చిన తర్వాత జీవుడేమవుతాడో, గాలిలో కలిసి పోతాడో, స్వర్గానికి వెళ్తాడో, నరకానికి వెళ్తాడో, మళ్లీ పుడతాడో, దెయ్యమైవుంటాడో, ఏదైనా మహాతత్వంలో కలిసిపోతాడో, మిగిలేదేమీ వుండదో - ఏదీ స్పష్టంగా తెలియకపోవడం వల్ల అయోమయం.

ఇంకా వుండాలనీ, ఏవోవో చేయాలనీ, మనసు ఒక నిబద్ధతకు లోనై సాగుతుంటుంది గనుక మరణాన్ని వాంఛించదు. పెట్టుకున్న బంధాల వలన మరణం అవాంఛనీయం అయింది.

ఏ మనసు పై కారణాలను పోగుచేసుకొని వుందో, ఆ మనసుతోనే మరణం యొక్క స్వభావాన్ని చూడడమవుతోంది మామూలుగా. అది హేతువు ద్వారా చూడడ

మవుతుంది, నిశితంగా వుంటుంది. అది బౌద్ధికం - అంటే బుద్ధి ద్వారా జరుగుతుంది. బుద్ధిని దాటి, మనసునుదాటి చూసే అవకాశం వుందేమో మనం చూడాలి. బుద్ధికి మించిన తెలివిగానీ ప్రజ్ఞగానీ అంతర్దృష్టిగానీ ఏమైనా వుందేమో కనుగొనాలి.

ఇతరుల దుఃఖాన్నిగానీ, మనదుఃఖాన్నిగానీభరించలేక దాని మూలాలకు పోయి చూడాలనుకోవడం బుద్ధిజీవికి సహజం. దాన్ని కొంత సూక్ష్మంగా, సునిశితంగా, తీవ్రంగా, యదార్థంగా,లోతుగా చూడడమే కావలసింది. దానికి ముందు మనం ఆయత్తం కావాలి, అది కర్తవ్యంగా గోచరించాలి.

మనకు మనం అర్థం చేసుకుంటూ పద్మవ్యూహంలోకి పోవడంలోనే స్వేచ్ఛ, బాధ్యత, సత్యగోచరత వుంటాయి.

మరణం గూర్చి ఇప్పట్నుంచే ఎందుకు ఆలోచనఅని అనడంతగదు. అది అనవసరపు విషయమని నెట్టివేయనూకూడదు. ఏదో కుతూహలంతో కాకుండా మనం జీవించడంలో అదొక భాగమే అన్న ఇంగితంతో సున్నితంగా దాన్ని సమీ పించాలి. అదీ ప్రశాంతంగా, గౌరవ ప్రదంగా చూద్దాం. పుట్టడమెలాంటిదో, మరణిం చడం కూడ అద్భుతమైంది - సృజనలాంటిదే. సృష్టి అనంతమైంది. ఆది చివర లేనిది, కొనసాగేది. ఇది మన జ్ఞానం వల్ల కలిగేది కాదు. మరణమూ అలాంటిదే.

గతం విస్మృతి అయినపుడే ప్రేమ స్ఫురిస్తుంది. ప్రేమకు గతం, భవిష్యత్తూ అంటూ లేవు. తెలిసింది మరణ సదృశమైతే, తెలియంది వ్యక్తీకరణ అవుతుంది. "నేను" చస్తే ప్రేమ వుంటుంది. దీని అంతరార్థం అవగాహనకు రావాలి. అపుడు మరణం యొక్క అర్థం తెలుస్తుంది.

గత విస్మృతితో, ఎప్పటికప్పుడు ఆలోచన అంతం కావడంతో, చివరి మరణం గూర్చిన చింత పోతుంది. అదుర్దా పోయినపుడు, చావు యొక్క అర్థం అవగాహన అయినపుడు, అది తేలికవుతుంది. క్షణక్షణ మరణంలోని అందం అంతుపట్టుతుంది. అంతం చేయడంలోని అసలు ప్రాధాన్యత తెలియక, కొనసాగింపులో పడిపోతాం. అందుచే అందం యొక్క అలలుమాత్రం స్పృశిస్తూ పైపైన తేలిపోతాం.

పుట్టుకలాగానే చావుకూడ అసాధారణమైంది. అవి రెండూ ఒకదాని కొకటి బహుదూరమని మనకు అనిపిస్తుంది. అందుకే దుఃఖం. ఇక్కడ నుండి అక్కడికి కొనసాగిస్తూ పోవడమే దుఃఖం. ఆ కొనసాగింపును అనుదినం అంతం చేయ గలిగితే,

మరణంతో జీవించడం వుంటుంది. మొత్తంగా అది వినూత్నీకరణ మవుతుంది, ఎప్పటికప్పుడు తాజా (ఫ్రెష్)గా, కొత్తగా వుండడం. కాబట్టి అంతం చేయడంలోని 'అర్థం', ప్రాధాన్యత మనకు అవగతం కావాలి, మనకు అనుభూతం అవ్వాలి.

ఇంకాస్త లోతుగా చూస్తే ఒక ప్రశ్న ఉదయిస్తుంది. భౌతిక నిర్వహణ జ్ఞానం అలా వుంచండి. మాసికమైన జ్ఞానం, కాలం అంతం చేయడమంటే ఇదేనా? ముందు మనం అనుకొన్నట్లు కొనసాగింపును, లేక ఆలోచనను ఎప్పటికప్పుడు అంతం చేస్తూ జీవించగలిగే సామర్థ్యం వున్నదంటే అర్థం ఏమిటి? కాలాన్ని జ్ఞానాన్ని కూడ అంతం చేసే సామర్థ్యంతో వుందనే అర్థం. మానసికంగా కాలమూ లేదు, ఆలోచనా పరిధీలేదు. అంటే ఎప్పటి కప్పుడు వర్తమానంలో, ఎరుకలో, గమనికలో వుంటుంది. ఆలోచన యొక్క కాలుష్యం అంటకుండా తాజాగా వుంటుంది. దీన్ని గూర్చి ఎప్పటికప్పుడు వర్తమానంలో, ఎరుకలో, గమనికలో వుంటుంది. దీన్ని గూర్చి మనసు నేర్చుకోవలసింది ఏమైనా వుందా? ఏమైనా శిక్షణ కావాలా? ఏమీ అక్కరలేదు.

ఆందోళన లేకుండా ఆదుర్దాలేకుండా గ్రహించడం వుండాలి. అలా ఆదుర్దాలేకుండా వింటుంది, చూస్తుంది,గ్రహిస్తుంది. అలాగే మరణం సంభవించినపుడు ఆందోళన అంటూ ఏమీ వుండదు. అదే దాని యొక్క అసాధారణ అందం, అసాధారణ శక్తి

(కృష్ణమూర్తి డైలాగ్స్ అనుసరించి వ్రాయడమైంది. మీటింగ్ లైఫ్ నుండి, ఫైర్ ఇన్‌ది మైండు - పీపుల్‌తో సంభాషణ నుండి గ్రహించాం)

# స్వార్థ చింతన వల్లే సర్వం నాశనం

మానవుల మధ్య సంబంధాలు సవ్యంగా లేవు. ఆరోగ్యకరమైన వాతావరణమూ లేదు. దీనికి కారణం మానవుని ఆలోచనలే! ఆలోచనలకు మూలం గతం. గతం నుంచి ఆలోచనలు పుట్టుకొస్తాయి. ఈ ఆలోచనలతో వ్యక్తి స్వార్థపూరితమైతే మానవ సంబంధాలు సరిగ్గా వుండవు. ఉద్రిక్తతలు పెరుగుతాయి. ఘర్షణలు ఆరంభమవుతాయి. ఆలోచనలు వ్యక్తి దైనందిన జీవితానికి పరిమితమైతే వ్యక్తి మస్తిష్కంలో విశాల దృక్పథం ఏర్పడుతుంది. ఇతరత్రా ఆలోచనలు ఘర్షణకు ప్రాతిపదిక అవుతాయి.

శాస్త్ర విజ్ఞాన అభివృద్ధి ఆలోచన కూడ మానవ సమాజంలో ఘర్షణకు దారి తీస్తుంది. శాస్త్ర పరిజ్ఞానం అభివృద్ధి చెందుతోంది. దాంట్లో సందేహం లేదు. మరింత అభివృద్ధి చెందాలని మనిషి తహ తహ లాడుతున్నాడు. ఈ తహ తహ స్వార్థ చింతనమంచి ప్రారంభ మవుతుంది. ఈ ఆలోచనే ప్రపంచ వినాశనానికి హేతువు. ప్రపంచంలో అమెరికా అన్ని దేశాల్ని మించి పోవాలని అనేక రకాల అణుబాంబుల్ని తయారుచేసింది. క్షిపణుల్ని తయారు చేసింది. అందుకు పోటీగా రష్యా, చైనా ఇతర దేశాలు కూడా బాంబులు తయారు చేస్తున్నాయి. ఇవన్నీ పాలకుల స్వార్థ కేంద్రం నుంచి పుట్టుకొస్తున్నాయి. శాస్త్ర విజ్ఞానానికి కూడ స్వార్థ చింతనే కారణ మవుతుందిక్కడ.

ఇలాంటి ఆలోచన రాకుండా ఉండి ఉంటే, ఈ రోజు ప్రపంచంలో ఏ ప్రాణీ ఆకలితో చనిపోదు. అయినా మనం ఆకలి చావులు వింటున్నాం, ఘర్షణ చూస్తున్నాం. ఉద్రిక్తతలు కళ్ళముందు కనిపిస్తున్నాయి. కారణం మనిషి స్వార్థ చింతనే! మనిషి స్వార్థ చింతన లేని పరిపూర్ణమైన మానవుడైతే ఈ ప్రమాదం వచ్చి ఉండేది కాదు. ఎప్పుడైతే మనిషిలో స్వార్థం ప్రవేశించిందో విభజన ఏర్పడుతుంది. ప్రపంచంలో పుట్టిన ప్రతి మనిషీ మొదట మానవుడు. అతనిలో ఏ విభజనా లేదు.

కాలక్రమేణా విభజన కొని తెచ్చుకుంటున్నాడు. కులమనో, మతమనో, జాతనో, ప్రాంతమనో, దేశమనో, విభజనల్ని మనిషే సృష్టించుకుంటున్నాడు. ఇలాంటి విభజనలేని పరిపూర్ణ మైన మనిషి మనకు అవసరం. అలాంటి మనిషి ఎలా తయారు కాగలడు? దానికి మూలం ప్రేమ. ప్రతి దాన్ని ప్రేమించే మనిషి విభజన సృష్టించు కోలేడు. ఆనందమయ జీవితాన్ని సృష్టించుకుంటాడు. విశ్వమానవ శ్రేయస్సును ప్రోగుచేస్తాడు. అలాంటి మనిషి స్వార్థచింతన నుంచి బయటపడతాడు. అప్పుడే అందర్నీ ప్రేమించగలడు. ప్రేమను మించిన గొప్ప లక్షణం ప్రపంచంలో ఏదీ లేదు. ప్రేమ స్వరూపం అందర్లోనూ ఉంటే ఈ రోజు ఇన్ని బాంబులు తయారయి వుండేవి కాదు. ఘర్షణలు చూసేవాళ్లం కాదు. ఆకలి ఉండేది కాదు. స్వార్థ చింతనలేకుండా శాస్త్ర విజ్ఞానాన్ని ఉపయోగించి ఉండి ఉంటే, ఇన్ని రోగాలు ఉండేవి కావు. ఇంత దరిద్రమూ కనిపించేది కాదు.

మనం ఎంతో అభివృద్ధి చెందామని చెప్పుకుంటున్నాం. అయినా ఇంకా నూటికి అరవై మందికి ఆకలి తీర్చలేక పోతున్నాం. ప్రగతి వుంది. అయినా ఆకలి తీరలేదు.

మనం అనుకున్న ప్రగతి మనల్ని వినాశనం వైపు తీసుకెళ్తోంది. విశ్వమానవ జాతి బాంబులతో సహజీవనం చేస్తోంది. వాటి ఉత్పత్తికి పెడుతున్న వ్యయాన్ని మానవ సమాజ శ్రేయస్సుకు ఉపయోగించి ఉంటే ఓ అద్భుతమైన సమాజాన్ని మనం చూసుండేవాళ్ళం. మరి ఎందుకు సృష్టించలేకపోయాం? మనం ప్రేమ స్వరూపులం కాలేకపోయాం. విభజనలేని పరిపూర్ణమైన విశ్వమానవులుగా మనం తయారు కావాలి. అప్పుడే వసుధైక కుటుంబాన్ని సృష్టించగలం. ఈ చర్చలో ఎస్.వి. యూనివర్సిటీ ఫిలాసఫీ విభాగం అధ్యాపకుడు వేద పారాయణ, జిడ్డు అధ్యయన కేంద్రాల సమన్వయకర్త చిరంజీవులు, మనవాణి ఎడిటర్ రఘుపతిరావు, సిటీ కేబుల్ మేనేజర్ రామచంద్రారెడ్డి, డా॥ భాస్కర రెడ్డి, రామమూర్తి, కాళిదాసు తదితరులు పాల్గొన్నారు.

('సిటీవిజన్' వారపత్రిక సమీక్ష) 1-7-2000

# జిడ్డుకృష్ణమూర్తి ఫిలాసఫీ

**తత్వం :**

ఫిలాసఫీ అంటే తత్వశాస్త్రం. వేదాంతం ఫిలాసఫీలో ఒక భాగం. ఏ విషయం గురించి అయినా దాని లోతుపాతులు తెల్పుచూ, పరిశీలనా విశ్లేషణలు జేస్తూ, జీవితానికి అన్వయం జేస్తూ మానవుని నడిపించేది తాత్వికత. అది ఏవస్తువును ఆశ్రయించి మనకు సహాయపడుతుందో అది మనం చూసుకోవాలి. ఊహాత్మక విషయాన్నైనా అది ఆలంబనగా తీసుకోవచ్చు. వాస్తవిక విషయం పైనా ఆధారపడవచ్చు. ఊహాభూమిక అయినచో ఆ నిర్మాణం ఏనాటికైనా పడిపోతుంది. వాస్తవం పునాది అయినపుడు అది నిరంతరం మేలుచేస్తుంది. ఊహ నమ్మకానికి చెందింది. వాస్తవం యదార్థానికి, వివేకానికి చెందుతుంది. వాస్తవాన్ని, లేదా "ఉన్నస్థితి" ("what is") ని గూర్చి పరిశీలించి, లోలోతులకు, విశాలతకు పోయేదే జిడ్డు కృష్ణమూర్తి తత్త్వం.

**వేదాంతం :**

వేదం యొక్క అంతం వేదాంతం. వేదం అంటే తెలిసింది. అంతం అంటే సమాప్తంజేయడం. Ending of the known తెలిసిందాన్ని వదిలేయడం. వ్యక్తం వదిలితే గాని అవ్యక్తం సిద్ధించదు. తెలిసిందాంతో తెలియంది కనిపెట్టలేవు. తెలిసిం

దాంట్లోకి తెలియందాన్ని ఇమడ్చలేవు. తెలిసింది స్మృతి, జ్ఞానం, ఆలోచన, అభిప్రాయం, సంస్కృతి, కాలం, గీత, కురాన్, బైబిల్, సర్వశాస్త్రాలు, నమ్మకాలు. తెలియంది తెలియందేగదా! తెలిసికోవాలనే గదా ఈ ప్రయత్నాలు, సాధనలు. కాని తెలిసినట్లు నటించవద్దు. నమ్మకమంటే నటించడమే. దానిపై ఆధారడి చేసేవన్నీ నటనలే.

**నటన :**

ఈ మధ్య సినిమాజూస్తుంటే ఒక fundamental doubt వచ్చింది. ఒక అమాయక మైన ప్రశ్నవేశాను. అసలు నటించడమెందుకు? సినిమాలు, సీరియల్స్, నటనాపరంగా ఎందుకు తీయాలి. నటనద్వారా చూపే ప్రేమలు, స్నేహాలు, మోసాలు, మాయమాటలు, సెక్సులు, హింసలు, నిత్య జీవితంలో కనిపిస్తున్నాయి కదా! ఇంకా అల్లిబిల్లి కథలు, కమామీషులు వ్రాయడం, చదవడం దేనికి? ఊసుబోకనా, వినోదానికా, వ్యాపారానికా? అలా అయితే, ఉన్నదానిని ఉన్నట్లుగా చూడలేకపోతూ, ఉన్నదాన్ని face చేయలేక తప్పించుకోవాలని ఏదో చేయడమవుతోంది. అందుచే వినోదాల్లోను, ఉత్తమోత్తమ పవిత్ర ఊహల్లోను, సంపాదనలోను తగుల్కోవడం జరుగుతోంది. అంతే కాదు, ఒకదాన్ని మరోదానికొరకు, వేరే ప్రయోజనం కొరకు వాడుకోవడం జరుగుతోంది. Use and use or use and throw - ఇదీమన విధానం. ఉన్నదున్నట్లు చూడలేని వానికి సత్యదృష్టి ఎలా వుంటుంది? అనంత సత్యమంటూ ఏదైనా ఉంటే, దాన్ని చూడగల స్థితి ఎలా కల్గుతుంది?

**కండిషనింగ్ :**

మనం నానారకాల వ్యవస్థలకు కట్టుబడి పోయి ఉన్నాం. మూడు వ్యవస్థల గురించి మాత్రం మాట్లాడదాం. ఒకటి విద్యావ్యవస్థ, రెండు వినోదవ్యవస్థ, మూడు దైవిక వ్యవస్థ, ఉద్యోగం, సంపాదన, సాధించడానికి ఏర్పడ్డదీ విద్యావ్యవస్థ. సిలబస్సు, పుస్తకాలు, పరీక్షలు వీటిని మించి ఏమీలేదు, టైమూలేదు. స్వేచ్ఛగా ఆలోచించుకోడానికే సమయం లేదు, అవకాశం లేదు. ఏ స్టేజిలోనైనా జీవితానికి అవసరమయ్యే తత్వ శాస్త్రం గూర్చి ఆలోచించడానికే వీల్లేదు. చేతి నిండా పనిలేక సినిమాలకు, టి.వి. సీరియల్స్‌కు, వినోద కాలక్షేపకబుర్లకు, హరి కథలకు పిచ్చిగా అలవాటయిన స్త్రీ సమూహానికి జీవితతత్వం గూర్చి ఆలోచించడమంటేనే బద్ధకం. రిటైర్ అయిన పెద్దలలో మెజారిటీకి చరమాంకంలో ఆధ్యాత్మిక విషయాలు అవసరమనిపిస్తాయి. అప్పటికే

వాళ్లు సంప్రదాయంలో ఉండే భక్తికో, భజనకో, మతబోధలకో,సాధనలకో వశమైపోయి ఉంటారు. అదంతా ఏదో ప్రయోజన మాశించో, భయం నుండి తప్పుకోడనికో, ఏమీ తోచకనో చేసే పనులే గాని స్వయంగా ఆత్మ జ్ఞానం గురించిగాని, ఆంతరంగిక విషయాల గూర్చిగాని తీవ్రమైన ఆసక్తి చూపడంకాదు.

మనిషి మెదడు సుమారు 4 వేల సంవత్సరాలనుంచి ఒక విధానానికి, ఒక సంప్రదాయానికి, ఒక నమ్మకానికి కట్టుబడిపోవడం జరుగుతోంది. అదే కండిషనింగ్. కండిషన్డ్‌మైండ్ కోరేదేమంటే, మరింత కండిషనింగ్. భ్రమలే నిజాలుగా తోస్తాయి. డి-కండిషన్ అయితే తప్ప కొత్తది ప్రవేశించదు. పాతది తొలగితే గాని కొత్తది పట్టదు. పర్వతం ఎక్కాలంటే బరువులు దించక తప్పదు. కనుక నమ్మకాన్ని సంప్రదాయన్ని, బ్రద్దలు చేయాలి.

మనోగతులను, లోతులను, సంక్లిష్టతలను పరిశోధించి, జీవిత సత్యాలను ఆవిష్కరించినవాడు బుద్ధుడు. నాగరికత తెలిసి 2500 సం॥లకు ఇది జరిగింది. ఆ మీద మరో 2500 సం॥కు అదేరీతిలో, అత్యంత అద్భుత స్వయం పరిశోధనతో జీవన ఔన్నత్యాన్ని ఆవిష్కరించుకొన్న వారు కృష్ణమూర్తి. మనకు కావలసింది అలాంటి మానవ మాత్రులైన మహోన్నతులు, సాధారణ జీవులైన ప్రేమ మూర్తులు.

**మానసిక స్థితి :**

మనసు మనిషికున్న ఒకే ఒక పెద్ద పరికరం, ఉపయుక్త సాధనం. దాని పనితనం దానికి తెలిసి ఉండడమే అది మనకు చేసే పెద్ద సేవ. నా మనసు అనేది నాదీ కాదు, నీదీ కాదు. అది ఒక development . అందుచే అది నీకు ఉపయోగపడుతుంది, నిన్ను మోసం చేస్తుంది. అది తెలిసిందాన్నుంచి, తెలిసిందానిలోకి పోతుంది, తెలియని దాంట్లోకి పోలేదు. మానసిక తృప్తికి ఆరాట పడకుండ, పేరు పెట్టకుండ, నమోదు చేయకుండ ఉన్నప్పుడు మాత్రమే మనసు ప్రశాంతంగా ఉంటుంది.

ఒక అభిప్రాయానికి సమీపంగా చర్య తీసుకెళ్ళామనుకున్నంత కాలం ఘర్షణ తప్పదు. అభిప్రాయాన్ననుసరించి గాక, స్పాంటేనియస్‌గా ఉండే చర్యవల్ల ఘర్షణ లేదు. అభిప్రాయం స్మృతి నుంచి వస్తుంది. జీవితానికి ప్రతి సవాల్ చర్యగాని, అభిప్రాయంకాదు.

'ఉన్నది' లేక 'ఉన్నస్థితి' యే మనసు. దాన్ని 'వాట్‌ఈజ్' (what is) అన్నారు కృష్ణమూర్తి.

మనసు కాలాతీతమైన దాన్ని రూపకల్పన చేయలేదు. అసలు ఆలోచనే మనసమస్య అయినపుడు అది మనకు మించిందాన్ని ఎలాకనుగొనగలదు? ఆలోచనను, జ్ఞానాన్ని అంతమొందించినపుడుడే ప్రజ్ఞ (wisdom) ఉదయిస్తుంది. స్పాంటేనియస్ గా ఉండే మనసు దేనినైనా కనుగొనగలదు, కూరుకుపోయిన మనసు కనిపెట్టలేదు. గతమే ఆలోచన. అంతంచేయడంలో స్వేచ్ఛ ఉందిగాని, కొనసాగించండంలో లేదు.

కేంద్రీకరించే (Concentrating) మనసు ధ్యానించలేదు. ఉద్దేశం, ప్రయోజనం ఉన్నపుడే ఏకాగ్రత అవసరం. అలాగాక మనసుకు ఎరుక ఉంటే చాలు. సాధనలు, క్రమశిక్షణలు, పూజలు, ప్రార్థనలు, ఆధ్యాత్మిక వైఖరులతో కూడిన మనసుకు నిజాలు తెలియవు. స్వయంతృప్తులు మాత్రం బయట కొస్తుంటాయి.

మనసెప్పుడూ సణుక్కొంటూ ఉంటుంది. దానికి ఏదో ఆలంబన కావాలి. దానికి మత పరమైన సరుకైనా ఒకటే, వ్యాపార సరుకైనా ఒకటే, వినోద విషయాలైనా ఒకటే.

**అవగాహన** - Understanding :

జీవితంలో అద్భుతమైంద, అవసరమైంది ఒకే ఒకటి. అదే అవగాహన. జీవితాన్ని సరిగా నడిపించేది అది. అది ఒక్కటున్నాచాలు. క్రియాశీలకమైంది అవగాహన. వాయిదా వేసేది కాదు. తక్షణ క్రియా శీలకమైంది. ఆచరణాత్మకం గాకపోతే జ్ఞాన మనేది విషయ సేకరణగా, నిల్వ సమాచారంగా వుండిపోతుంది. జ్ఞానం ఆచరణ ఏకకాలంలో ఏకీకరణ జెందడమే అవగాహన. ఏకకాలంలో కాకపోతే, మధ్యలో సాధన ప్రవేశిస్తుంది. సాధనకు కాలపరిమితి లేనిదై, ప్రక్క దారులు పట్టి, అవాంచనీయ ప్రభావాలకు, అవినీతికి లోనవుతుంది.

జ్ఞానం వేరు, అవగాహన వేరు. జ్ఞానం వేరు, ప్రజ్ఞ వేరు. knowledge is different from wisdom. ప్రజ్ఞ యొక్క మరో రూపం అవగాహన.

ఇంతకాలం జ్ఞానం ఆరాధనా వస్తువనుకొన్నాం. అది కాదని అర్థమైంది.

ఆధ్యాత్మిక జ్ఞానం I.T. లాంటిదని తేలింది. జ్ఞానం స్వేచ్ఛ నివ్వదు. నిబద్ధం చేస్తుంది. జ్ఞానం సృజనాత్మకం కాదు. సృజనాత్మకం కాందే డిస్కవరీ కుదరదు. మనసు నిండా జ్ఞానం అనేసరుకు కూరుకుపోయి ఉంటే ఖాళీ ఏముంటుంది, ప్రసన్నత ఎలా వుంటుంది?

జ్ఞానం కూడ ఒక రకమైన సంపద. ఆ సంపాదన సమస్యలు పరిష్కరిస్తుందని నమ్ముతాం. అది జరగడంలేదు. అందుకే తృప్తిలేకున్నది. ఈ సంపద గ్రుడ్డి వాళ్లను జేస్తుంది. జ్ఞానం ఎప్పుడూ గతానిదే. నిజం చెప్పాలంటే, తన్నుతాను తెలుసుకోవడమే ప్రజ్ఞానానికి మొదలు. అదే తెలివి, అదే ప్రేమ. ఎందుకంటే ఆలోచన తెలివికాదు, ఆలోచనవల్ల నిజమైన ప్రేమ పుట్టదు. ఆలోచనే possessive. possessive attachment is not love. ఆలోచన జ్ఞానంలో పని చేస్తుంది. జ్ఞానమంతా మనసే, అహమే, 'నేనే'.

జ్ఞానం అనేది ఒక సంప్రదాయం. సంప్రదాయమంటే జ్ఞాపకం యొక్క పాటవమే, అభ్యాసమే. అది గొప్ప గొప్ప అంతర్ విషయాలను కనుగొనలేదు.

ప్రేమ :

ప్రేమ అంటే గొప్ప బాధ్యతా భావం. To be sensitive is to love. ప్రేమ అనేపదం ప్రేమ కాదు. పుష్పం యొక్క తావి లాంటిది ప్రేమ. ముఖాముఖి స్పందనలో, పరస్పర ప్రసారంలో ఉండడం ప్రేమ. అభిప్రాయాలు, ఆలోచనలు, నిర్ణయాలు, భయాలు, భద్రతలు ఉన్నచో ప్రేమకు స్థానంలేదు. ప్రేమలో ఉపయోగించుకోవడం ఉండదు. 'మనో సంబంధ విషయాలలేమి ఖాళీలేని హృదయంలో, ఆలోచనల నుండి ఖాళీ యైన మనసులో ప్రేమపుడుతుంది. Sensation is not love.It is not product of desire. Logic is not love. Negation of what is not love is love. బాధతో ప్రేమ వుండదు. I love you because you love me is a trade. Love does not ask any thing in netrun

పేరాశ, పోటీ, ప్రతిఫలం, పెద్ద పెద్ద ప్రయోజనాలు చూపే పాఠశాలలకు పిల్లలను పంపడం తల్లిదండ్రుల ప్రలోభమే గాని ప్రేమకాదు. అందుకే సమాజం విచ్ఛిన్న మవుతోంది.

**మతపరమైన మనస్సు - Religious mind:**

మనసు పూర్తిగా ప్రసన్నంగా ఉంటే అది మతపరమైన మనస్సు. ప్రచారకాలు, వ్యవస్థీకృత మతాలు, మతాలు కావు. నమ్మకం చుట్టూ చేరింది అసలైన మతం కాదు. సంపదలు, వంశపారంపర్యాలు, పటాటోపాలు, బూర్జువా ఆధ్యాత్మికతలు మతపరమైన మనసు నివ్వవు. నువ్వు నమ్మినా నమ్మక పోయినా నమ్మకమనేది చాలా చిన్న విషయం - నిత్య జీవితంలో వంచన, ఆశ, అసూయ, హింస ఉంటే అది మతపరమైన మనసెలా అవుతుంది? దేవుణ్ణో, రక్షకుణ్ణో, గురువునో నమ్ముతూనే, ఆ నమ్మకాన్ని నిత్యజీవితంలో, వాస్తవ జీవితం లో అంటకుండా ప్రవర్తించడం మతపరమౌతుందా?

తన అహంభావం నుంచి స్వేచ్ఛ పొందిన మనసే మతపరమైంది. తన సత్యమేంటో తాను కనుగొనాలి గాని, ఆత్మనో, దేవుణ్ణో ఊహించి ఆరాధించడం ప్రధానం కాదు.

జీవితం మతపరమైంది, వ్యాపార పరమైంది, సెక్స్ పరమైంది, సైన్సు పరమైందిగా వేరు వేరు కాదు. మతపరమైన మనసుకు నమ్మకంతో పనిలేదు. వాస్తవాలతోనే దానికి పని. అపుడు నీవు ఏ 'ఇస్టు'వుకావు. Identification తో పనిలేదు. You must have a fresh mind, and not a tortured mind. ధ్యానమయమైన మనస్సే మతపరమైన మనసు.

**జీవితంలో - సంఘంలో మార్పు :**

మనం నిజంగా మార్పు కోరుతున్నామా! మన ఉద్దేశం ప్రధానం. మనం మార్పు చెందాలని మనం అనుకోవాలిగాని, అది ఇతరుల్లో కలగాలని ఎదురు చూడరాదు. ఈ బాధ్యత నాది - మీది, ఇది అర్థం కావాలి.

మానవ సంబంధంలోనే మౌళికమైన మార్పు రావాలి. అది విప్లవాత్మకం కావాలి. చిన్నచిన్న సంస్కరణలు పనిచేయవు. దేవుడు పేరుతోగాని, రాష్ట్రం పేరుతోగాని మనిషి మనిషిని వాడుక వస్తువుగా తయారు చేయరాదు. సిద్ధాంత పేరుతోనైనా అంతే. మానసికంగా వాడరాదు, భౌతికంగా వాడరాదు. మత గురువు, రాజకీయ వాది ఆదేపని చేస్తున్నారు. ఈ వాడుక ఉన్నంతకాలం సంబంధమంటూ వుండదు. మార్పు రావలసింది మానవ సంబంధంలోనే గదా!

వాడకం అంటే దోచుకోవడమే. అంటే భయం, భ్రమ, చింత చేరి ఉంటాయి. దోపిడీ ఉన్నప్పుడు ఘర్షణ తప్పదు. వాడకంతో మనలో ఘర్షణ, వ్యతిరేకత, విరోధం, ఉంటాయి. వినోదించాలన్నపుడు, ఏదో సాధించాలన్నపుడు ఇవి తప్పవు. సంబంధాలు దెబ్బతింటాయి.

భక్తి భావాలు, ఆవేశాలు, ఆశలు మార్పుకు అవరోధాలు. ప్రేమ ఉంటేగాని, మార్పు ఉండదు. మనసును పూర్తిగా విశుద్ధం చేస్తేగాని ప్రేమ నిలవదు.

ఆత్మ - అహం - దానిచేష్టలు నివారణ అయితేగాని పరివర్తన (transformation) రాదు. వాస్తవాల మీద ఆధారపడితేగాని మార్పు దిశకు పోము. మార్పు భవిష్యత్తులో గాదు, ఇప్పుడే, ఇక్కడే జరగాలి. క్షణక్షణం మార్పు నిలవాలి.

ఉత్సవాలు, పునశ్చరణలు నిరుపయోగం అని ఘంటాపథంగా అర్థమయితే గాని మార్పురాదు. కుల వివక్షలు, సాంఘిక ఘర్షణలు, దుఃఖాలు, విభజనలు - వాటి వాస్తవాలు అవగాహన అయితే, ఆ సత్యమే మార్పు తెస్తుంది.
(సోంప్రకాశ్‌గారి పిలుపు మేరకుతిరుపతి రోటరీ క్లబ్‌లో మాట్లాడిన విషయాలు.)

29-8-01

# తిరుపతి ప్రత్యేక చర్చా గోష్ఠిలో

## Meditaton in Daily Life

**స్పష్టత అంటే ఏమిటి?**

గందరగోళం లేకుండా జీవించడం. అనేక రంగాలలో specialities ఉన్నాయి. నిపుణతలున్నాయి. వాటి ద్వారాసూక్ష్మంగా, స్పష్టంగా పనిచేస్తున్నారు. అయితే జీవన విధానంలో, సంబంధాలలో స్పష్టత (clarity) ఉందా? ఉత్పత్తి ఎంత ఉన్నా ఎంత స్పష్టంగా ఉన్నా, జీవితం సుఖంగా ఉందా? ఆహారోత్పత్తి food production ఎంత ఉన్నా, బీదరికం పోవడం లేదుకదా!

ఆలోచన యొక్క పరిమితులు మనం తెలుసుకోవడం లేదు. ఆలోచన నిత్య నిర్వహణకు పనికొస్తుందిగాని, సామరస్యం,సమానత్వం, శాంతికి పూర్తిగా పనికిరావడం

లేదు. ఆలోచనను ఆధ్యాత్మిక, మానసిక, ఆంతరంగిక విషయాలలో వాడకుండా వుంటే, బ్రయిన్ వేరే విధంగా పనిచేస్తుంది. వేరైన మేలైన స్పందన వస్తుంది. ఇక్కడ ఆలోచనకు తావు లేదు అనేది తెలియడమే clarity. అప్పుడు ఆలోచనలేకుండా సంపూర్ణమానవునిగా స్పందించడం జరుగుతుంది. ఆలోచన లేని మనసు యొక్క గమనమే ధ్యానం అనేది సంబంధంలో వుంటుంది, isolation లో కాదు. ధ్యానం వ్యక్తిని నిశితంగా స్పందింపజేస్తుంది గాని, ఆలోచింపజేసేది కాదు.

ఆలోచన పరిమితమైంది. భౌతిక జీవితం మెరుగు పరుచుకోడానికి ఆలోచన ఉపయోగించుకోవాలి.

**ఇంకా స్పష్టత అంటే**

తాను చెప్పేది తనకు అర్థం కావడం

సహేతుకంగా ఉండడం

సైన్సుకు వ్యతిరేకంగా లేకుండడం

అయిష్టం, విసుగు, ఆవేశం లేకుండా చెప్పగలగడం.

చెప్పింది తనలో కనిపించడం, బాధ్యతగా ఉండడం.

మౌలికార్థం, వ్యావహారికార్థం తెలిసియుండడం

సూటిగా, క్లుప్తంగా పలకడం

వల్లెవేయుటగాక సొంతమాటల్లో చెప్పడం

చెప్పేది సూత్రమో, అభిప్రాయమో, వాస్తవమో తెలిసి ఉండటం.

స్వచ్ఛందంగా వుండడం; అపుడు

Clarity is light and light is reality. so clarity is reality.

**భయంగూర్చి:**

భౌతిక విషయాలలో అభద్రతా భావాలనుండి రక్షణకు మనం ఏర్పాట్లు చేసుకుంటున్నాం. అయితే మానసికమైన భయాలకు కారణం ఏమిటి? ఆశలు,

నమ్మకాలు పెట్టుకొని, వాటిపై ఆధారపడడం వల్ల భయానికి కారణాలు ఏర్పడతాయి. ఏదీ నమ్మవద్దు. ఊహల్లో పోవద్దు. సాధనలపై ఆధారపడవద్దు. మెదడును బంధాలలో పెట్టొద్దు. స్వేచ్ఛగ వదలండి. అపుడు భయానికి అవకాశమేలేదు.

Physiological fear should not lead to psychological fear. ఉన్నదానికన్నా లేనిదానిననుకోవడం భయం. భౌతిక భద్రతలను సుతిమించి పెంచుకున్నామంటే మానసిక అభద్రత పెరుగుతుంది. Biological (బయోలాజికల్) భయాన్ని తేలికగా పోగొట్టుకోవచ్చు. సైకొలాజికల్ భయాన్ని పెంచుకోవడమే మనసమస్యకు కారణం. దానిని పోగొట్టుకోవాలంటే, దానిమూలం తొలిగించాలి.

మానసిక స్థాయిలో continuity (కొనసాగింపు) ఉంటే భయం వుంటుంది. అలాకాకుండా క్షణక్షణం జీవిస్తే ఏమౌతుంది. అంటే నిత్య నూతన స్థితిలో ఉంటే ఏమౌతుంది? దేనికో బందీ అయిపోయి, అదే కొనసాగడంతో నూతనత్వం ఉండడం లేదు. మతపరంగా, కులపరంగా, దేశపరంగా, కొనసాగింపు వదిలేద్దాం. Don't add, end it. అది సంఘటన కావచ్చు ఆలోచనకు అంతం ఉంది. By nature it is limited. దాన్ని మానసిక స్థాయికి తీసుకెళ్లితే అంతం చేయడం సాధ్యం కావడంలేదు. Brain cells బంధంలో ఉన్నంత వరకు కొనసాగింపు తెగదు. అయితే ఏ రోజుకారోజు తాజాగా జీవించే అవకాశం లేదా.

డా॥ ఎన్. భాస్కర రెడ్డి.

కృష్ణమూర్తి చరిత్రలో అరుదైన వ్యక్తి. ఏ విధంగా? సమూలంగా మారిన వ్యక్తి. మనమేమో చిన్నచిన్న మార్పులతో సాగుతున్నాం. అనాది నుంచీ ఒకే రీతిగా బ్రతుకున్నాం. శాస్త్రీయంగా - భౌతికంగా అనేక మార్పులు వస్తున్నాయి. కాని జీవించే విధానంలో మార్పులేదు. సంప్రదాయికంగా గాక, వినూత్నంగా బ్రతికిన వ్యక్తి కృష్ణమూర్తి. ఆయన మార్పును ప్రజలలో ప్రవేశపెట్టారు.

విషయం అర్థం అయినట్లుండడంవేరు, అర్థంకావడం వేరు. అర్థం అయిందా లేదా అనేదే ప్రధానం. అర్థం కాకపోతే అర్థంకాలేదన్న సంగతి తెలిసుండాలి. అప్పుడే అర్థం తెలుసుకోవడం వీలవుతుంది. సామాజిక, తాత్విక విషయాలు చెప్పేటప్పుడు. విషయానికన్నా వ్యక్తికే ప్రాధాన్యత నిస్తాం. విజ్ఞాన శాస్త్రాలను బోధిస్తున్నపుడేమో వ్యక్తికన్నా

విషయానికి ప్రాధాన్యత నిస్తాం. ఏ విషయమైనా అర్థం కావాలంటే చెబుతున్నవారూ వింటున్నవారూ ఒకే స్థాయిలో ఉండాలి. అంటే Transmitor & receiver ఒకే ఫ్రీక్వెన్సీలో వుంటేనే communication సాధ్యం. శాస్త్రీయంగా జీవితం గూర్చి చెప్పిన వ్యక్తి వేరే లేరు. కృష్ణమూర్తి జీవితాన్ని సమగ్రంగా, మొత్తంగా చూస్తారు. విడివిడిగా చూడరు. Specialist డాక్టర్లు లాగా వేరు వేరుగా చూడరు.

**అస్తిత్వం - Existance**

సాంకేతికంగా వచ్చిందిగాని, జీవించడంలో మార్పు అసలే రాలేదు.

మనిషి ఎవరిమాట వినడు; తాననుకొన్నదే తాను చేస్తాడు.

మనుషులకు పరస్పర గౌరవం లేదు, పనిజరుపుకోడానికి గౌరవంగా ఉన్నట్లు ఉంటారు.

గౌరవం అనేది అవగాహనతో గాని రాదు.

అవగాహనకు నమ్మకంతో పనిలేదు. నమ్మకంతో అవగాహనరాదు. అవగాహన కలగాలంటే ప్రతి విషయాన్నీ ప్రశ్నించాలి.

ఉన్నదాన్ని ఉన్నట్లుగా పరిశీలించాలి.

దేనికీ కట్టుబడకుండా సంపూర్ణ స్వేచ్ఛను కల్గి ఉండాలి.

నెమ్మదిగా, ఓపికగా, ప్రశ్నిస్తూ తెలుసుకోవాలి.

నేర్చుకోవడంలోనే చేయడం వుంది.

Action and understanding are not two different things

వినడం - ఆలకించడం కలిస్తే మొత్తంగా వినడం అవుతుంది.

తెలుసుకోవడమన్నది ఒక శాస్త్రీయ ప్రక్రియ.

పదాలను వాడాలిగాని, వాటి కావలకు వెళ్ళడం ముఖ్యం.

అన్యోన్యంగా, సంసర్గతతో వుంటే పరస్పర అవగాహన వుంటుంది.

పంచుకోవడం అంటేనే తెలియబరచడం అనేది జరుగుతుంది.

నీ దృష్టి నా దృష్టి అంటూ వేరువేరుగా లేకుండా చూడాలి.

నిబద్ధతను నుండి, పూర్వాభిప్రాయాలనూ విడవక పోతే అవగాహన రాదు.

తెలుసుకోవాలన్న తపన ఉంటేకాని అవగాహన ఏర్పడదు.

కృష్ణమూర్తి దగ్గిరికి open mind తో వెళ్ళాలి.

అంతర్దృష్టి

అంటే తిరుగులేని అవగాహన - లోతైన అవగాహన - మార్పును తెచ్చే అవగాహన. అంతర్దృష్టితో అర్థమయితే మార్పు వచ్చితీరుతుంది.

సమస్యలు సృష్టించే స్వభావంనాకు ఉంది.

అంతర్దృష్టి ఉన్నపుడు నేను మారాలి అనేది వస్తుంది.

అంతరంగమే సమాజం.

నేను మారితే తప్ప కుటుంబం, సమాజం మారదు.

దేవుళ్లు ఏమి చేసినా, సంఘసేవ చేసినా, సమాజం మారదు.

అంతర్దృష్టి ఆలోచనకు ఆవల వుంటుంది.

(2002 జూలై 13,14 తేదీలలో తిరుపతిలో జరిగిన చర్చాగోష్టిలో)

## కొత్తగా ఉండడమంటే ఏమిటి?

కొత్త ఏర్పాట్లు చేసుకోవడం

కొత్త వస్తువులు సంపాదించడం

కొత్త అనుభవాలు పొందడం

కొత్త పథకాలు వేసుకోవడం

కొత్త తరహాలో వ్యవహరించడం

కొత్త మిత్రుల్ని చేర్చుకోవడం

కొత్త ఇల్లు కట్టుకోవడం

కొత్త భార్యను తెచ్చుకోవడం కాదు.

ఇది కొత్తదనం అనుకున్నా గుణదోషాలున్నాయి.

అసలు కొత్తదనమంటే -

గత అనుభవాన్ని ప్రక్కన బెట్టడం.

పాత ఆలోచనలకు స్వస్తి పలకడం

అభిప్రాయాలు, నమ్మకాలు ముద్రలు వదులుకోవడం; ఆశలకు, ఆదర్శాలకు, ఆంకాంక్షలకు వీడ్కోలివ్వడం; ఆవేదన, కక్ష, క్రోధం, వ్యతిరేకత, వేదన పూర్తిగా విడనాడడం.

అంతరంగాన్ని ప్రక్షాళనం చేసుకోవడం, అన్నిటిపట్ల ఎలెర్ట్‌గా ఎరుకతో ఉండడం. మానావమానాలను దరిజేరనీయకుండా ఉండడం వర్తమానం మీదేగాని భూత భవిష్యత్తుల మీద ఆధారపడకుండటం.

ఆంతర్ముఖంగా, అవిభాజ్యంగా,నిజమైన స్పందనతో ఉండడం.

## జిడ్డు కృష్ణమూర్తి జన్మదినం

కృష్ణమూర్తి తెలుగునాట పుట్టాడు. అయితే తెలుగు తత్వంలోను భారతీయత్వంలోను ఇరుక్కోలేదు. విశ్వజనుడైనాడు. అతడు చెప్పింది, సాంప్రదాయక వేదాంతం కాదు. సర్వులకు సంబంధించిన సమత్వ జీవన తత్త్వం. అతడు ఏ ఆధ్యాత్మిక సంస్థకు చెందినవాడు కాదు. ఏ ఆధ్యాత్మిక సంస్థను తన పేర పెట్టుకోలేదు.

అద్యయనం నిమిత్తం శ్రీకాళహస్తిలో "జిడ్డు కృష్ణమూర్తి అధ్యయన కేంద్రం" నడుస్తోంది. దానిని జె.శ్రీ రఘుపతిరావు. ఇ.ఇ. ప్రారంభించారు. ప్రస్తుతం దానికి బి.చిరంజీవులు కన్వీనరుగా ఉన్నారు. 17-2-1988 నుండి ప్రతినెల పూర్తిగా ఒక ఆదివారం నాడు సుమారు 15 మంది సమావేశమై వివిధ అంశాలు చర్చిస్తున్నారు. ఇంతవరకు చర్చించబడిన అంశాలు ఇవి : ఎరుక, కంప్యూటరులాంటి మనసు,

ధ్యానం, సత్యం, నిజమైన మతం, ఘర్షణకు మూలం, ఆలోచన, నమ్మకం, భయం - మానవజీవితాన్ని తారుమారు చేయడం, దేశ కాలాలు, జ్ఞానం - అవగాహన, సమాజం - సంఘర్షణ, అనుభవం - తెలివి, వినడం - నేర్వడం, మెదడు - మనస్సు, అహం - ఆత్మ, ప్రార్థన - పూజ - ధ్యానం, జీవితం - తర్కం - మోక్షం, న్యాయదర్శనం, గుహ్యాజీవితం - లైంగిక జీవితం వగైరా. కొన్ని సమీక్షా సమావేశాలు కూడ జరిగాయి. అన్ని అంశాలపైనా తెలుగులో నోట్సు - అనువాదాలు చేయడం జరిగింది.

"జిడ్డుకృష్ణమూర్తి జీవన దర్శనం" - ఆయన చరిత్ర, బోధనలతో కూడిన లిఖిత గ్రంథమును కూడ తయారు చేశారు. అతని జన్మదినం పురస్కరించుకొని మే 11 ఉదయం గం. 7.45 ని.కు ఆకాశవాణి కడప కేంద్రం నుండి "జిడ్డుకృష్ణమూర్తి జీవనతత్త్వం" అను అంశంపై రఘుపతిరావు మాట్లాడనున్నారు.

జిడ్డు జన్మదిన కానుకగా "జిడ్డు చెప్పిందేమిటి? జిడ్డు చేసిందేమిటి?" అను రెండు ప్రత్యేక వ్యాసాలను 'ఈనాడు' ప్రచురిస్తున్నది.

(కృష్ణమూర్తి ఫౌండేషన్ - మద్రాసుకు, ఋషివ్యాలి స్కూలు డైరెక్టరుకు పంపించిన రిపోర్టు - 10-5-1989)



# అనుబంధం -1: ప్రవచన సప్తాహం

శ్రీకాళహస్తి వరదరాజస్వామి ఆలయ ప్రాంగణంలో 18.2.97 నుంచి 24.2.97 వరకు 'ప్రవచన సప్తాహం' జరిగింది. ప్రవచకులు శ్రీ.జె.శ్రీ రఘుపతిరావు గారు. తాత్విక చింతన - ఆవశ్యకత, జ్ఞానం - అవగాహన, జీవితసంఘర్షణ -జీవించేకళ, ద్రష్ట - దృశ్యం, బంధం - విముక్తి, మరణం - భయం, ధ్యానం - చిత్తశాంతి అను జీవిత తాత్విక విషయాలపై ప్రతిరోజు ప్రసంగించారు. అందలి సారాంశం పాఠకుల ప్రయోజనార్థం వరుసగా అందిస్తున్నాము.

## తాత్విక చింతన - ఆవశ్యకత

సమగ్ర జీవితానుభవ ప్రకటనరూపం తత్త్వం. ఏ ఆచరణ వైపుగా నీ జీవితం సాగుతున్నదో అది (తత్), నీవు (త్వం) ఒకటి కావడం తత్త్వం. దాన్ని నిన్నూ వాస్తవికంగా దర్శింపజేస్తూ, ఏకరూపం జేసేదే తత్త్వం. భారతీయతత్త్వం వేదాంతం, వేద + అంతం, తెలిసిందానిని (జ్ఞానాన్ని) అంతం చేయడం తత్త్వం -జ్ఞేయ వస్తు పరిత్యాగం అని శాంత్యోపనిషత్తులోవుంది. జ్ఞానంతో సహా సంచయాలన్నిటిని వర్జించడం సన్యాస దీక్షలో ప్రధానాంగం. విన్నా చదివినా రచించినా అనుభూతి చేసుకోగా మిగిలిందాన్ని జ్ఞానపరం -స్మృతిపరం చేయకుండా నిశ్చల స్థితిలో వుండి పోవడం నిజమైన తత్త్వం. మార్పునకు నాంది పల్కేది తత్త్వం. "తలప తలప పుట్టు తనువున తత్వంబు'' అన్న రీతిలో ఎవరికి వారు లోతైన పరిశీలనతో తత్త్వాన్ని ఆవిష్కరించుకోవాలి. పరిశీలన - అవగాహన - అనుభూతి తత్వం. ఇదీ తాత్విక సమ్మేళనం లేక ఏకత్వం. ఈ వరసలో పరిశీలన కార్యం, అవగాహన క్రియ, అనుభూతిఫలం, ప్రకటన తత్త్వం అని అర్థం చేసుకోవచ్చు. తత్త్వంలో స్వానుభవం, వ్యక్తీకరణ వున్నాయి. అవి పరిశీలన వల్లసాధ్యం. అది వర్తమానపు టెరుకలో వుంటుంది. అదే జీవితం.

యదార్థ స్థితి తత్వం. కాబట్టి ఊహ నుంచి గాక, వాస్తవం నుంచి పరిశీలన మొదలు పెట్టాలి. నిలవడానికి కాళ్లు కావాలి. ఎదగడానికి మనసును కలుపుకోవాలి. నిలిచేది భూమి మీద, ఆకాశం మీద కాదు. ఆధారమైన భూమి నుండి పైకి ఎదుగుదాం. ఆకాశం నుండి ఎదగలేం, పడిపోతాం. జీవిత వాస్తవాలను గుర్తిస్తూ, సమీప స్థితిగతులనూ నిజానిజాలనూ పరిశీలిస్తూ ప్రశ్నిస్తూ పోదాం. గట్టుపై నడుస్తూ, పైపైన

గమనిస్తూ, అపుడపుడూ తొంగిచూస్తే తత్వం బోధపడదు. గ్రహించిందాంతో ఏకంగాకపోవుట వల్ల, ఆధునిక సదుపాయాలతో ప్రబోధం ఎంత పెరిగినా ప్రపంచంలో ఘర్షణ తరగడంలేదు, హింస, అశాంతి ప్రజ్వరిల్లుతున్నాయి.

తత్వమంటే శీలం, చిత్తం, ప్రకృతి అని అర్థాలు కూడ వున్నాయి. ప్రవర్తనా సౌందర్యమే తత్త్వం. ప్రకృతితాదాత్మ్యమే తత్వం. ఇలా అవగాహన కావాలి. తత్వ ప్రబోధంలో శ్రోతలు మెచ్చేది గాక, బోధకునికి నచ్చింది అనగా అనుభూతమైంది అందించాలి. ఇది ప్రథమ జాగరూకత.

తత్వం అంటే ఇంగ్లీషులో ఫిలాసఫీ. వేదాంతం ఫిలాసపీలో ఒక భాగం. తత్వమంటే సిద్ధాంతాలను ప్రేమించడంకాదు, సత్యాన్ని ప్రేమించడం. "నొప్పింపక తానొవ్వక" మెప్పించుచు జెప్పువాడె ఒప్పగుమేటి.

## జ్ఞానం - అవగాహన

సంపాదించినది ఒంటబట్టగా మిగిలిన సమాచారం జ్ఞానం. అది స్మృతి రూపంలో వుంటుంది. సంఘటన - అనుభవం - స్మృతి - జ్ఞానం - ఆలోచన - అభిప్రాయం - ప్రతిక్రియ - ఇదీ మానసిక ప్రవృత్తి స్థితి, గతి. సంపాదనకు మరోరూపం జ్ఞానం. అది జీవితంలో ఒక భాగం మాత్రమే. సర్వస్వంకాదు, పూజనీయం కాదు. అది లేక పోతే ఏమై పోతామోనన్న భయం వుంది. భయమున్న చోట ప్రేమ లేదు. ప్రేమలేనిచో ఏదీ సవ్యంగా సాగదు.

పాంచ భౌతిక పదార్థాలపై విజ్ఞాన శాస్త్రవేత్తలు జరుపు పరిశోధనా ఫలితం భౌతిక జ్ఞానం. జీవిత ఘటనల పర్యవసానం గానూ, సేకరణ ద్వారాను, ఊహాత్మకంగానూ మెదడులో నిక్షిప్తమైనది మానసిక జ్ఞానం. పదార్థానికి మూలమేది, పదార్థానికి ఆవల ఏముంది అని భౌతక శాస్త్రజ్ఞుడు పరిశోధిస్తున్నాడు. మనసుకు మూలమేది, మనస్సుకు ఆవల ఏముంది అని తాత్వికుడు పరిశీలిస్తున్నాడు. ఒకరు అణువును బద్దలు చేస్తూపోతున్నారు. ఒకరు మనసును లయింప జేయడానికి యత్నిస్తున్నారు. ఒకరు వ్యక్తమైన దాన్ని ఆధారంగా జేసుకొని అవ్యక్తాన్ని కనుగొనాలనుకుంటున్నారు. రెండవ వారు వ్యక్తమైన దాన్ని పూర్తిగా వదిలి

అవ్యక్తమైనదాన్ని సాక్షాత్కరింప జేసుకోవాలని జూస్తున్నారు. మనసు అతి సూక్ష్మమైంది, అతి చంచలమైంది. కాబట్టి అది ఎప్పటికప్పుడు తాజాగా వుండవలసిన అవసరం వుంది. పదార్థానికీ, మానసిక విషయాలకూ సమన్వయం చేకూర్చగలమా? విజ్ఞానాన్నీ తత్వాన్నీ వాస్తవికంగా దర్శించడం ఎలా? వాటి సమగ్రత జీవితంలో ఏమిటి? బౌతిక జ్ఞానం అవసరం. దాన్ని సంపాదించాలి, వాడుకోవాలి. అందులో మెదడుకు శ్రమ వుండవచ్చుగాని, వ్యధ వుండదు. మానసిక జ్ఞానం అవగాహనానంతరం నిలిస్తే మనసుకు భారం, బాధ కల్గిస్తుంది.

అవగాహన అంటే అర్థం చేసుకోవడం, ఆకళింపు జేసుకోవడం, గ్రహించడం అవగమనంకావడం, అనుభూతి పొందడం. వర్తమానం - స్పందన - క్రియ - మార్పు - స్పష్టత - ఇదీ అవగాహన (అండర్ స్టాండింగ్). బుద్ధితో తెలుసుకోవడం పూర్తిగా అర్థం చేసుకోవడం కాదు. సగం అర్థం చేసుకోవడం అంటూ లేదు. బుద్ధి పాక్షికంగా, వాదవివాదాలతో తర్కవితర్కాలతో పనిచేస్తుంది. తెలుసుకోడానికి ఆచరించడానికి మధ్యగల సమయాన్ని సాధన అంటున్నాం. ఆ సమయం భ్రమను, మత్తును, నటనను, స్వప్రయోజనమును తెచ్చిపెడుతుంది. సిగరెట్టుకాల్చడం తప్పని అవగాహన అయితే, తక్షణమే వదలి పెట్టాలి. వాయిదా వేస్తే వంచన పంచన జేరుతుంది. జ్ఞానం వల్ల అవగాహన కలగదు. అవగాహన వుంటే జ్ఞానాన్ని సద్వినియోగం చేసుకొంటుంది. అవగాహన లేని జ్ఞానం స్వార్థపూరితం, అహంకార భరితం, ప్రమాదకరం. జ్ఞానం ఎంతవున్నా స్పర్థ, ద్వేషం, యుద్ధం తప్పడం లేదు కదా! అబద్ధం అబద్ధంగా చూడడానికి జ్ఞానంతో పనిలేదు. అవగాహన తెలివి నుండి, తెలివి అంతర్దృష్టి నుండి, అంతర్దృష్టి ప్రేమ నుండి పుడతాయి. చివరికి పనిచేసేది అనురాగం లేక ప్రేమ.

## జీవన సంఘర్షణ - జీవించేకళ

ప్రకృతిలో, పరులతో, తనలోని తన భావాలతో చక్కని సంబంధం పెట్టుకొని బ్రతకడమే జీవించడం. సంబంధాన్ని ఎరుకలో, అవగాహనలో వుంచుకోవడం ఒక కళ. దాని వల్ల వికాసం కల్గుతుంది. హింసతోనూ, అత్యాశతోనూ, స్వార్థంతోనూ సాగుతున్న సమాజంతో సర్దుకుపోయే ధోరణిలో ఘర్షణ వుంది. ఎందుకంటే సమాజం

హింసను, అత్యాశను, స్వార్థాన్ని పోషిస్తుంది. సమాజాన్ని ఎదుర్కోవడంలో కూడ ఘర్షణ వుండొచ్చు, కాని ఎదుర్కోవడంలో సంపూర్ణ అవగాహన, సంసిద్ధత వుండాలి. తెలిసి చేస్తావు, జీవితాన్ని ఛాలెంజ్ (సవాలు)గా తీసుకుంటావు. అసలు వ్యక్తి Individual అంటేనే Indivisible అభిభాజ్యమైనవాడు. సమగ్రతవున్నవాడు. హృదయం - మనసు - దేహం అన్నీ కలిసి ఏకోన్ముఖంగా పనిచేస్తాయి. కులం - మతం - జాతీయత - నమ్మకాలు మొదలగు మానసిక విభజనలతో జీవితాన్ని చక్కముక్కలు చేసుకోరాదు.

స్మృతి - కోరిక - వినోదం - బాధ మున్నగు వాటితో నడిచే కార్యక్రమాలు సంఘర్షణ కల్గిస్తాయి. సమస్యను సమస్యగా - లోతుగా, సూటిగా - చూడ్డంలో ఘర్షణలేదు. సమస్యలోనే పరిష్కారం వుండడం గోచరమవుతుంది. సంబంధాలను చెరచి ఘర్షణ కల్గించే అంశాలు : 1) మనో బింబాలు 2)గతానుభావాలు 3)భవిష్యత్ ఊహలు 4) అధికారం - పెత్తనం 5) పోలిక - పోటి 6) తెలుసునన్న 'అహం' 7) మానసిక విభజన 8) అత్యాశ 9) వాడుకోవడం 10) స్వార్థబుద్ధి మొ॥వి.

జీవితమంటే వ్యక్తిగత ప్రేమ పనిచేయడం కాదు, మానవాళిని ప్రేమించడం. మనుషులను ప్రేమించుమన్నా, మంచి యన్నది పెంచుమన్నా జీవితం దైనందిన సామాన్య విషయాల అల్లిక. వాటియందు జాగ్రత లేనిచో వాటి విలువ తెలియదు, పెద్ద పెద్ద విషయాలు పట్టే అవకాశముండదు. సరిగా జీవించాలంటే పరిశుద్ధమైన హృదయం, ప్రేమించే మనసు వుండాలి. జీవితం వాస్తవమైంది. జీవిత సత్యమే సత్యం. సత్య శోధనకు వాంఛలు, పాపపుణ్యాభయాలు, నమ్మకాలు, అభిప్రాయాలు అవరోధాలు. జీవితం పని చేసేది ప్రేమతోనే, పరిపూర్ణమయ్యేది కూడ ప్రేమతోనే. గాయపడకుండడం గొప్ప జీవిత కళ. అంతరంగ భావాలను బాహ్య విజ్ఞానాన్ని సక్రమంగా సమన్వయం చేయడం జీవితం. సంబంధం అనే అద్దంలో జీవితాన్ని చూసుకుంటూ చక్కదిద్దుకుంటూ పోవలయును.

కొత్త సమాజం నిర్మించాలంటే ఆర్జన, ఈర్ష్య, లోభం, అత్యాశల నుంచి బయట పడాలి. సంస్కృతి - సంప్రాదాయలకు కట్టుబడి జీవిస్తున్నంతకాలం కొత్తదనం లేదు. ఘర్షణ వల్ల శక్తి వృధా కావడమే గాక, దాన్నుండి అవినీతి పుడుతుంది.లోతైన పరిశీలనలో ఘర్షణ తొలుగుతుంది. సరిగా జీవించడం తెలిస్తే చావును గూర్చి చింతవుండదు. ప్రేమలేని జీవితం నీళ్లులేని మడుగు.ప్రేమ మాత్రమే సరైన జీవితానికి పురి కొల్పుతుంది. ప్రేమ పువ్వులా సహజంగా పుష్పించాలి.

జీవితంలో ఎవరిని వారు ఉద్ధరించుకోవాలి. ఎవరికి వారు కాంతివైపు నడవాలి. ఆ కాంతియే ఆదర్శమై వెలగాలి.

# ద్రష్ట - దృశ్యం

ద్రష్ట - దృక్కు - దృశ్యం అను మూటిని కలిపి త్రిపుటి అంటారు. ఇవి తత్వదర్శనంలో ముఖ్యమైన అంశాలు. వీటిని గురించి ఎందుకు విశేషంగా చెప్తుంటారంటే ఏకత్వం సాధించడానికి, తన్మయత్వం పొందడానికి ద్రష్ట, దృక్కు పరస్పర ఆధారాలు. కాబట్టి రెంటిని ఒకటిగా చూడవచ్చు. చూచేవాడు - చూపు - చూడబడేది. చూచే వాడిదేకదా చూపు.

"ద్రష్ట దర్శన దృశ్యానిత్యక్త్వావాసనయా సహ"-

ద్రష్ట, దర్శనం, దృశ్యం -అను త్రిపుటిని వాసనలతో గూడ విడనాడమని అర్థం.

"అభేద దర్శనం జ్ఞానం, ధ్యానం నిర్విషయం మనః" అని కూడ మైత్రేయ ఉపనిషత్తు చెప్పింది. అభేధ దర్శనం ఇక్కడ ప్రధాన విషయం. అంటే భేదం లేకుండా చూడడం ఎలా?

మనకు మనం అర్థం చేసుకుంటూ పరిశీలిద్దాం. ద్రష్టలేకపోతే దృష్టి లేదు. ఇది పైకి కనిపించే అర్థం. కాని దృష్టి వుండాలి. ద్రష్ట లోపించాలి. ఇది సాధ్యమా? చూపుసరిగా, నిండుగా వుండే నిమిత్తం మనం పరిశీలిస్తున్నాం. ఆలోచన లేనపుడు ఆలోచించేవాడు లేడు కదా! అలాగే కోపం లేనపుడు కోపిష్టి లేడుగదా! ఆలోచన వేరు, ఆలోచనా పరుడు వేరు అంటారు. 'నేను' అనే వాడు శాశ్వతుడు, ఆలోచనలు వస్తూ పోతూ వుంటాయి, వాడికంటవు అని కూడ అంటారు. వైరుధ్యమూ, సెబ్బరతనమూ వున్న ఆలోచనలు చీకాకు, దౌష్ట్యము కలిగిస్తాయి. మరి వాటిని సరిచేయనవసరంలేదా? 'నేను' అనే వాడు వాటిని పట్టించుకోకుండా, బాధ్యతా రహితంగా వుండడమేనా? అలా కుదరదు. ఆలోచన లేకపోతే నీవు లేవు కదా! ఆలోచన కోపాన్ని స్వాధీనపరచుకోగలదనడమూ సరికాదు.

అసలు ఈ ఆలోచించే వాడు లేక చూచేవాడు - ద్రష్ట - 'నేను' - "శాశ్వతుడు" ఎవడు? జ్ఞాపకంగా మిగిలిందే 'నేను'. గత స్మృతి లేకపోతే 'నేను' వుండదు.

చూపుమాత్రం వుంటుంది. సరళంగా వుంటుంది. తాదాత్మ్యంగా వుం టుంది. విశ్లేషణ, రిమార్కు, అభిప్రాయం, కాంక్ష వుండవు. నిజంగా చూడడమంటే అదే! అనుభూతిపరమైంది, కాలప్రమేయం లేంది, సంపూర్ణత కలది. మనసు రూపాంతరం చెందుతుంది. ఆ స్థితిలో చూచేవాడు, చూడబడేది అంటూ రెండూ లేవు. కాబట్టి 'నేను' చూడడం వేరు. కేవలం చూడడంవేరు. గత జ్ఞానమే విశ్లేషకుడు.

చూచేవాడూ దృశ్యమూ భౌతికంగా రెండు అనిపించినా, నేను అనుద్రష్ట లేక పోవడం వల్ల దృశ్యమే మిగుల్తుంది. కనుక చూపుకు విస్తృతత్వమూ విశాలత్వమూ ఏర్పడుతుంది. ప్రకృతి తాదాత్మ్యం సిద్ధమవుతుంది. సృజనాత్మకత వుంటుంది. ఆలోచన 'నేను' అను ఆలోచనాపరుణ్ణి సృష్టిస్తుంది. అతడు వేరుగా కనిపిస్తాడు. ఆలోచనను కనిపెట్టి, గమనిస్తూ వుంటే, అది మాసిపోతుంది. కోపమూ తానూ ఒకటన్నపుడు కోపం ఆగిపోతుంది.

కోరిక ద్వారా 'నేను' ప్రవేశిస్తుంది. కోరిక - భయం 'నేను' సృష్టిస్తాయి. మనసు ప్రసన్నత చెందినపుడు నేను లేదు. గమనించడంతో నిశ్చలతవస్తుంది. గనుగుడ్లు కదపకుండా చూచినపుడు ఆలోచన వుండదు. కళ్లతో కనపడే మొత్తామూ చూసి, కళ్లుమూసుకొని మళ్లీ వాటినే చూడగా, చూడగా ద్రష్ట, దృశ్యము రెండూ లయమైపోయి ధ్యానస్థితి కల్గుతుంది.

విగ్రహాలనూ విశ్వాసాలను సృష్టించేది మనసే. స్వార్థానికి, అహంభావానికి మనసు నిలయమైతే సృజన - సౌఖ్యం - వెలుగు లోపిస్తాయి. ఎరుకలో మనసు నిలిచిపోతుంది.

## బంధం - విముక్తి

కోర్కెతో, ఫలాసక్తితో, ఏదో కావాలనే కృషితో ఏర్పడు సంబంధమే బంధం. రాగమే బంధం. విచలిత మనస్సు ఎక్కడ ప్రవేశిస్తే అక్కడ బంధమేర్పడుతుంది. బంధంలో భయం - ఈర్ష్య - అదుర్ద - పరాధీనత వున్నాయి. ఒంటరిగా వుండేకన్నా జంటగా వుండాలని మనిషి కోరతాడు. ఒంటరితనం నుంచి తప్పించుకోడానికి తోడు కోరతాడు. ఆ తోడు కొంత కాలానికి భారమై, బంధమవుతుంది. దాన్నుండి బయట పడాలని చూస్తాడు. ఈ దేవుళ్ళాటలో ఒక తెలిసిన వారినో, ఒక గ్రంథాన్నో, ఒక సాధననో ఆశ్రయించడం జరుగుతుంది. అక్కడా సంతృప్తి లభించదు. ఏముంది?

ఒక బంధాన్ని వదిలించుకోడానికి మరో బంధంలో పడాల్సి వస్తుంది. అసలు ఒంటిరతనం ఎందుకొచ్చింది? దాన్ని సృష్టించింది ఎవరు? ఒంటరితనాన్ని పోషించింది ఆలోచనే. దాన్ని వదిలించుకోమని చెప్పింది గత జ్ఞానమే. మరో బందం కల్గించింది మనస్సే. ఇపుడు ఆలోచనను పరీక్షిద్దాం. అదే బంధాన్ని కల్గించేదే అని తెలియగానే ఒంటరితనం ఎగిరి పోతుంది. ఇపుడు బంధమంటే మానసిక జంజాటమని తేలింది. బంధంలో ప్రేమ వుండదని కూడ తెలుస్తుంది.

రాజకీయ పార్టీతోనో, మత సంస్థతోనో, ఒక వర్గంతోనో గుర్తింపు పొందాలనుకోవడం కూడ బంధమే. ఇందులో ఆధారపడడం, శరణుకోరడం, చిక్కుకు పోవడం జరుగుతుంది. సంప్రదాయం కూడ బంధమే. అది స్వేచ్ఛను హరిస్తుంది. ఎందుకు మనం ఇతరులమీద ఆధారపడతాం? ముఖ్యమయిన కారణాలు అలవాటు, ప్రేరణ, పక్షపాతం, అనుకరణ, బద్ధకం.

విముక్తి దేని నుండి కలగాలి? బంధించిన దానినుండి. బంధముంది కాబట్టి విడుదల కోరుతున్నాం. మనసు నుంచి మనసు రాగం తొలగాలి. బంధముందని మనసుకు తీవ్రంగా తెలియడంతోనే స్వేచ్ఛ మొదలవుతుంది. స్వేచ్ఛ ఎప్పుడు కలగాలి? ఇప్పుడే. ఎక్కడ కలగాలి? నాలో, నామనసులో, నా హృదయంలో. గజిబిజి, జంకు, ఘర్షణ, ఆర్జనం, సిద్ధాంతం - విశ్వాసం, కుల, మత, వర్గ జాతీయతల నుంచి విడుదల కావాలి. ఒకదాన్ని వదిలి మరోదాన్ని పట్టుకోవడంలో స్వేచ్ఛలేదు. స్వేచ్ఛ స్వచ్ఛందమైంది.

స్వేచ్ఛలో. క్రమత, క్రమశిక్షణ సహజంగా వుంటాయి. వాస్తవం స్వేచ్ఛ నిస్తుంది. విశ్వాసం బంధిస్తుంది. కనుక ఒక చిహ్నాన్ని నమ్మడం స్వేచ్ఛకాదు. మనసు తనను తాను విసర్జన చేసుకోవాలి, తనకు తాను చేసుకోవాలి. అపుడు కొత్తది నేర్చుకోవడముంటుంది. కొత్తగా నేర్చుకోడానికి ఆలోచన అడ్డం వస్తుంటుంది.

సంబంధం వాస్తవమైంది. బంధం భయంకూరుస్తుంది. అనుబంధం దేన్నయినా అనుసరించి వుంటుంది. స్వేచ్ఛలో మొదటి మెట్టూ చివరి మెట్టూ ఒకటే. మొదటి నుంచి స్వేచ్ఛ వుండాలి. అదే సరైన విముక్తి.



# మరణం - భయం

మనసుకు గానీ శరీరానికి గాని తెలియని హఠాత్పరిణామం సంభవించినా, ఊహించినా, సమాధాన పడలేక బెంబేలెత్తే స్థితియే భయం. గతంలో జరిగింది మళ్లీ జరగరాదని, జరుగుతుందేమోనని ఆందోళన చెందడం భయం. లాభం - భద్రతల నాపేక్షించే ఆలోచనయే భయం. ఒక పద్ధతిలో వుండాలనుకోవడం కూడ భయం పుట్టిస్తుంది. భయం నుంచి తప్పుకోవాని వుంది, ఒక నమ్మకం వైపు పరుగెడతాడు. కనుక నమ్మకాన్ని ప్రోది చేసుకోవడంలో భయముంది. 'నేను బలహీనుడను, నా కాళ్లమీద నేను నిలబడలేను. నమ్మకాల సపోర్టు కావాలి' అని బలహీన పరుచుకోవడంలో భయముంది. తనకు తాను పరిపూర్ణుడు కావాలను కుంటాడు. భార్యాబిడ్డలను, ఇతర ధనాల్ని సంపాదించుకుంటాడు. 'నేను' నేనను పించుకుంటాడు. అలాగే మరణానికి భయపడుతూ 'ఆత్మ'ను పోషించు కుంటాడు. అలాగే మరణానికి భయం కారణమవుతుంది. లోని ఖాళీ దిగులు పుట్టిస్తుంది. దాన్ని నింపుకోవడంలో ముఖస్తుతి, అవమానం, గాయం, ఆత్మీయత, ఆర్జవం, గౌరవం, పేరు ప్రతిష్ఠలకు లోనవుతాం. కూడగట్టుకోవడంలోనున్న మూల భయం చూడాలి. ఎంతటి ఘనకార్యాలు చేసే వారినైనా భయం క్షీణింపజేస్తుంది. కుక్కుకోవడం, పూడిపోవడం మహా పెద్దల నుంచి అతి చిన్నవారిదాక చేస్తూనే వున్నారు. అలాకాక పోతే ఏమైపోతామో నన్నభయం. తనను తాను చూసుకుంటే పచ్చి నిజాలు బయట పడతాయేమోనన్న భయం. విధేయతలో భయముంది. సంప్రదాయ బద్ధునికి గౌరవం వుంటుంది, అవగాహన వుండదు. కనుక ప్రేమ ఉండదు. ప్రేమలేనిచో భయం వుంటుంది.

భయమంటే అర్థం చేసుకోవాలి, పారిపోరాదు. దాని స్వరూప స్వభావాలు వాస్తవంగా తేటతెల్లమయితే విముక్తి లభిస్తుంది. లోని భయాలూ తొలగాలి. లేక పోతే కలలద్వారా కలవరపరుస్తాయి. స్వప్రయోజనం కోరని మనసున భయం లేదు. నిజంగా నీవేమీ కాదని నిలిస్తే భయంలేదు. అసలు తెలియని దాని గురించి భయపడడమెందుకని ప్రశ్నవేసుకో. పెత్తనం - అధికారం - నేను తొలిగితే భయం లేదు.

చావంటే భౌతిక మరణమేగాక మానసిక మరణం వుంది. భౌతిక మరణం పుట్టుకంత సహజమైంది. మార్పు దశల్లో భయం లేనపుడు మరణదశకు

భయమెందుకు? నాభయం చావును గురించికన్నా, సంపాదించిందాంతో వున్న సహవాసం పోతుందేమోనన్న భయమెక్కువ. చిత్తం లేనపుడు చింతలేదు. విస్మృతి - మరువు - మత్తు - సుషుప్తి, మరణం సమానాలే. నిత్యం గతాన్ని మరచి, భవిష్యత్ ఊహలు లేక, వర్తమానంలో వుంటే మరణరుచి చూడడం అవుతుంది. అలా మరణిస్తూండడంలో చైతన్యం వుంది. మానసికంగా మరణిస్తేనే నూతనత్వం. రెండు బ్రతికుండగానే సన్నిహితం కావాలి నిరంతరం. ఉత్పత్తి నాశాలు ప్రకృతి సహజాలు. జీవించడం తెలిసిన వానికి చివరి మరణం గూర్చిన చింత వుండదు. మరణ భయంతో, జీవించాలన్నా ఆశ పెరిగి, పునర్జన్మను, శాశ్వతత్వాన్ని ఊహించు కుంటాడు. మనసులోని చావే మరో నిశ్శబ్దత. నిన్నటి వెలుగు ఇవ్వాల్టిది కాదు. ఏ రోజు కోకిల స్వరం ఆరోజుదే. తెలియనిదాన్ని గూర్చి ఊహవద్దు. తెలిసిందాన్ని అర్థం చేసుకొని, దాన్నుండి విముక్తి చెందాలి. 'నేను' చావడంలోనే నిర్భయత్వం, నూతనత్వం వుంటాయి.

## ధ్యానం - చిత్తశాంతి

శరీరానికి ఆరోగ్యం ఎంత ఆవసరమో మనసుకు ఆరోగ్యం మరింత అవసరం. మానసిక ఆరోగ్యానికి ఏర్పడ్డ పద్ధతులలో ధ్యానం గొప్పది. ధ్యానం మొత్తం జీవితానికి ఉదాత్తమైంది. ధ్యై అను ధాతువు నుంచి ధ్యానం అను శబ్దం పుట్టింది. మననం, విమర్శ, విచారం, చింతన, వివేకం అని అర్థాలున్నాయి. చిత్త వృత్తి నిరోధమని యోగ సూత్రం చెపుతుంది. చిత్తమున గల వస్తువు పట్ల వుండే అవిచ్ఛిన్న చింతనా ప్రవాహం ధ్యానం. ఏ వస్తువుపట్ల చింతన వుంటే మనసు ఆ వస్తువు ఆకారం చెందుతుంది. చిత్తఏకాగ్రత అనగా సజాతి విషయాలను కలుపుకోవడం, విజాతి వస్తువులను విసర్జించడం ధ్యాన ప్రక్రియలో ఒక భాగం. ఇందులో నిరోధం ఇమిడి వుంది. ఇంద్రియాలను నిగ్రహించడముంది. చింతన వున్నంతకాలం, వస్తువు, ధ్యేయం, ఫలం తప్పవు. కాబట్టి చింతన అనేది బంధకారణం. అమనస్కం, నిర్వికల్ప సమాధి అనేవి చింతనతో, సాధనతో మొదలుపెట్టడం వల్ల దుస్సాధ్యమవుతుంది.

'జెన్' అనే అచింతన ధ్యానం జపాన్‌లో వుంది. అది టావోఇజం అనేతల్లికి, బుద్ధిజం అనేతండ్రికి తల్లిరూపంలో పుట్టింది. చైనాలో చాన్ అంటారు. ఇంగ్లీషులో మెడిటేషన్ అనే దానికి ఆలోచించడం, కొలవడం అని సూచించారు. ఆలోచన -

ఏకాగ్రతతో తూర్పుదేశస్థులు ఋషులయ్యారు. కొలవడంతీసుకొని పాశ్చాత్యులు విజ్ఞాన శాస్త్రవేత్తలయ్యారు. ఈ రెంటినీ అర్థం చేసుకొని ఇంకాస్త ముందు వెళ్లగలమా? కాలం - ఆలోచన - ఇచ్ఛపై ఆధారపడనిది ఏదైనావుందా! సహజంగా, ప్రకృతి పరిశీలనతో, తన్నుతాను తెలుసుకోడానికి ఉపయోగపడేధ్యానమేది? జాగృతిలో, నిరాలోచనలో అది సాధ్యం. ఇది ఏకాంతానికి సంబంధించింది. వినయంగా, మృదువుగా, వత్తిడిలేకుండా మొదలవుతుంది. కాంక్ష లేనిది, బహుమతి కోరనిది. దీనివల్ల మెదడు దానంతట అది శాంతిస్తుంది. మనసు ఖాళీ అవుతుంది. కాబట్టి మనసును డొల్ల చేయడం ధ్యానం. స్వేచ్ఛగా, సునిశితంగా, నిష్క్రియాత్మకంగా గమనించడం ధ్యానం. మనసును శక్తివంతం చేయడం ధ్యానం. అది సంపూర్ణ మౌనానికి, నిండు మనసుకు సంబంధించింది. ఆ మౌనంలో అంతర్గతం గానూ బహిర్గతంగానూ సమస్త ఘర్షణలనుంచీ తొలగడం ధ్యానం. అపుడు మనసు అగాధజలం వలె నిశ్చల మవుతుంది.

సంపూర్ణ ధ్యానం చెపితే వచ్చేది కాదు, లోతుగా అర్థం చేసుకుంటే సిద్ధించేది. సొంతంగా చింతించడం కాదు, స్వీయం పరిశీలన అవసరం. విశ్వాసి తన విశ్వాసాన్ని చింతిస్తాడు. విశ్వాసం భయంవల్ల కల్గుతుది. కాబట్టి భ్రమ కొల్పుతుంది. విశ్వాసం ప్రతిఫలం వెంట పడుతుంది. సంపూర్ణధ్యానంలో మాటతీరు, ఆశలు, ద్వేషం - అన్నీ నిర్లిప్తమై పోతాయి. అయితే హృదయం ఆర్ద్రత చెందుతుంది కాని, ఎడారికాదు. ఆహ్లాదం, వింత అనుభవం ధ్యాం కాదు. సుఖం, వినోదం కొనవచ్చు. ఆశీస్సు కొనలేము. దానికి మార్గంలేదు. ఆశీస్సు పెల్లుబికితే అమాయకత వుంటుంది. ప్రేమే ఆశీస్స వుతుంది. కంట్రోలు చేస్తే ప్రేమభావన నశిస్తుంది. వాగుళ్ళు, తిరుగుళ్ళు, విధి నిషేధాలు వేరు, వాటన్నిటినీ అధిగమించి, ఉన్నతంగా స్పందించే సావధానత వేరు.

లోతుగా - తెలివిగా - ఎరుకగా -ప్రతీకారం లేకుండా జీవించడానికి ధ్యానం అవసరం. క్లిష్టమైన సమస్యను పరికించేది, గమనించేది ధ్యానం. దానిలో క్రమత, క్రియాశీలత వుంటాయి. ఆలోచనలు వికసించి, తద్వారా ఆలోచనే అంతం కావడం ధ్యానం. అహంలేని, అవధులు లేని అనంత వలయం ధ్యానం. ఈ స్థితి భార్యపట్ల, ప్రకృతిపట్ల కూడ వుంటుది. ప్రయాణంలో వున్నా, కూర్చున్నా, పనిచేస్తున్నా, మాట్లాడుతున్నా ధ్యాన స్థితివుంటుంది. అలౌకిక ఆనందం, వినయం, స్పష్టత, అనురాగం ప్రకాశిస్తూ వుంటాయి.

# అనుబంధం -2 : కొన్ని పత్రికా ప్రకటనలు

## 'జిడ్డు' ప్రబోధనలు సమాజానికి అవసరం

శ్రీకాళహస్తి, జూన్ 10, 1997 (న్యూస్‌టుడే) : ప్రముఖ తాత్వికుడు జిడ్డు కృష్ణమూర్తి తన రచనలలో చేసిన తాత్విక ప్రబోధనలు ఈనాటి మానవ సమాజానికి ఎంతో అవసరమని పలువురు వక్తలు అన్నారు. శుక్రవారం శ్రీకాళహస్తి పానగల్లులోని సాధురామలింగస్వామి సంస్కృత పాఠశాలలో జిడ్డు కృష్ణమూర్తి అధ్యయన సదస్సు ప్రారంభమైంది. ఆదివారం వరకు జరుగనున్న ఈ సదస్సులో జిడ్డు కృష్ణమూర్తి ప్రబోధాల గురించి చర్చా సమావేశాలు జరుగుతాయని జిడ్డు కృష్ణమూర్తి అధ్యయన కేంద్రం శ్రీకాళహస్తి శాఖ కన్వీనరు చిరంజీవులు అన్నారు. జర్నలిస్టు నీలంరాజు లక్ష్మీప్రసాద్ (హైదరాబాదు) మాట్లాడుతూ సమస్యల పరిష్కారంలో జిడ్డుకృష్ణమూర్తి రచనలు ఎంతో సహాయపడతాయన్నారు. జీవితాన్ని అర్థవంతంగా సాగించాలని ఆయన ప్రబోధించారన్నారు. లెక్చరరు డాక్టరు అరుణ (గుంటూరు) ప్రసంగిస్తూ జీవితం సంబంధ బాంధవ్యాలతో కూడుకున్నదని 'జిడ్డు' ప్రబోధించారని, జాతి, మత, కుల విభేదాలతో కూడిన సమాజంలో వాటిని తొలగించుకోవడం ప్రాథమిక కర్తవ్యమని అన్నారు. ఫిలాసఫి లెక్చరర్ డాక్టరు జి. వేదపారాయణ(తిరుపతి) మాట్లాడుతూ జిడ్డుకృష్ణమూర్తిని గురించి తెలిపారు. సభకు అధ్యక్షత వహించిన రిటైర్డు ఇంజనీరు జె.ఎస్. రఘుపతిరావు (తిరుపతి) జిడ్డు జీవితం గూర్చి వివరించారు. విజయవాడ, గుడివాడ, బాపట్ల, అనంతపురం, నంద్యాల, తిరుపతి, శ్రీకాళహస్తి, పుత్తూరు, మద్రాసు, మనదనపల్లె, తదితర ప్రాంతాలకు చెందిన జిడ్డుకృష్ణమూర్తి అభిమానులు, జె.కె.సంఘాల ప్రతినిధులు మాట్లాడుతూ జిడ్డు కృష్ణమూర్తి ప్రబోధనలు సమాజానికి ఎంతో అవసరమని పేర్కొన్నారు.

## మానసిక సౌఖ్యమే మిన్న

తిరుపతి, సెప్టెంబర్ 17, 1997 (ప్రభాతవార్త) : భౌతిక సౌఖ్యాలు మనిషికి సంపూర్ణ తృప్తినివ్వటం లేదు. ఏనాటికైనా మానసికి సౌఖ్యంకోసం మనిషి ప్రయత్నించక తప్పదు అని జిడ్డుకృష్ణమూర్తి అధ్యయన కేంద్రం సభ్యులు పేర్కొన్నారు. స్థానిక ఎస్.వి.ఇంజనీరింగ్ కళాశాల సమీపంలోని ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇంజనీర్స్ భవనంలో బుధవారం చర్చాకార్యక్రమం జరిగింది. పూర్వకాలం నుంచి ఇప్పటి వరకు మనిషి తాను జీవితాంతం పొందే భౌతిక సౌకర్యాలతో సంపూర్ణ తృప్తి పొందటం లేదు. ఏనాటికైనా మానసిక సౌఖ్యం కోసం ప్రయత్నించక తప్పదు. అందుకే 2500 సంవత్సరాల క్రితం బుద్ధుడు, ప్రస్తుత కాలంలో జిడ్డు కృష్ణమూర్తిలాంటి వారు మనిషి మానసిక శాంతి, సౌఖ్యాల కోసం ఎంతో కృషి చేశారు. కానీ మనుష్యులు ఎంతసేపు డబ్బు, కీర్తి, మోక్షం వంటి వాటికోసమే వెంపర్లాడుతున్నారు. ఉదాహరణకు ఉక్కగా వున్నపుడో, దుర్గంధంగా వున్నప్పుడో తప్ప ప్రకృతిపరంగా మానవునికి లభిస్తున్న 'గాలి'ని గురించి పట్టించుకోవటం లేదు. ఎవరికి వారు వారి మానసిక మార్పు శాంతి కోసం ప్రయత్నించడమే ఉత్తమం" అనేది ఆ చర్చసారాంశం. ఈ చర్చా కార్యక్రమంలో వేదపారాయణ, సాంబశివారెడ్డి, చిన్నయ్య, దొరస్వామి, హనుమంతు, రఘుపతి తదితరులు పాల్గొన్నారు.

## సంస్కృతి సంప్రదాయాలు ప్రశ్నించ నీయవు

తిరుపతి, జనవరి 28, 1998 (ప్రభాతవార్త) : మనిషి ఎవరు చెప్పినా వింటూ పోతున్నాడు గానీ, తనకుతానుగా ప్రశ్నించుకొని స్వయంగా అవగాహన చేసుకోవటంలేదు. చదువుకున్న వారి పరిస్థితి కూడా ఇలాగే ఉంది. దీనికి కారణం వారు చదువుతున్న చదువులు కూడా నడుస్తున్న సంస్కృతిలో భాగం అయిపోవటమే. సంస్కృతి సంప్రదాయాలు ప్రశ్నించనీయవు అని జిడ్డుకృష్ణమూర్తి అధ్యయన కేంద్రం సభ్యులు పేర్కొన్నారు. స్థానిక ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఇంజనీర్స్ భవనంలో బుధవారం జరిగిన కార్యక్రమంలో 'సంస్కృతి అవగాహన' అనే అంశంపై చర్చా కార్యక్రమం జరిగింది. "సంస్కృతికి కట్టుబడిన విషయాలను చెప్పేవారికి కూడా వారు చెప్పే విషయాలపై పూర్తి విశ్వాసం లేదు. ఎందుకంటే వారికి ఆ విషయాలను నమ్మటంపై అనుమానాలున్నాయి. ఇలాంటి అనిశ్చిత స్థితిలోని విషయాలను ఆచరణలోపెట్టడం వల్ల జీవితంలో ఇబ్బందులు వస్తున్నాయి. మానసిక విషయాలను, తెలియని విషయాలను సత్యమని, శాశ్వతమని నిర్ణయించడం పొరపాటు. అలా వాటిని మనస్సులో స్థిర పరచుకోవటం వల్ల మానసికశాంతి లేకుండా పోతోంది. అందువల్ల ఆ విషయాలను అవగాహన చేసుకోవాలి. అందుకు ప్రశ్నించుకోవటం అవశ్యం. వివేకం, ప్రజ్ఞ, అవగాహనలతో ప్రతి విషయంలోని నిజాన్ని గుర్తించినపుడే సుఖశాంతులు సాధ్యం". అనేది ఆ చర్చా సారాంశం. ఈ కార్యక్రమంలో వేదపారయణ, రఘుపతిరావు తదితరులు పాల్గొన్నారు.

## పౌరుల మానసిక స్థితిని బట్టే దేశ పరిస్థితి

తిరుపతి, ఫిబ్రవరి 12, 1998 (ప్రభాతవార్త) : దేశమంటే అందులోని పౌరులే. పౌరుల జీవన విధానమే దేశపరిస్థితిని నిర్ణయిస్తుంది. వ్యక్తి జీవనవిధానాన్ని వ్యక్తి మానసిక స్థితి నిర్ణయిస్తుంది. అంటే దేశపరిస్థితి పౌరుల మానసిక స్థితిపై ఆధార పడి వుంటుందని అర్థం అని జిడ్డుకృష్ణమూర్తి అధ్యయన కేంద్రం సభ్యులు పేర్కొన్నారు. స్థానిక ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఇంజనీర్స్ భవనంలో 'స్వేచ్ఛ - స్వాతంత్ర్యం' అనే అంశంపై చర్చా కార్యక్రమం జరిగింది. ఈ సందర్భంగా వక్తలు మాట్లడుతు "భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చి 50 సంవత్సరాలయింది. అయినా దేశం అప్పుల పాలవటం, బీదరికం, అవినీతి, మతఘర్షణలు, ద్రవ్యోల్బనం, వంటి అనేక సంక్లిష్టతలకు లోనైవుంది. రాజకీయాలలో అధికారం, కులం, డబ్బుల ప్రమేయం పెరిగిపోయింది. ఈ విధమైన పరిస్థితులుంటానికి కారణం 1947లో మనదేశానికి వచ్చింది రాజకీయస్వేచ్ఛ మాత్రమే. ఈ పరిస్థితి నుండి బయటపడాలంటే ప్రతి వ్యక్తి అంతరంగికంగా నేను, నాది అనే భావాలకు దూరం కావాలి.కులం, మతం, ఘర్షణలు, అవినీతి, హింసలాంటి వినాశకర, అసాంఘిక గుణాల నుండి స్వేచ్ఛ పొందాలి. అంతేకాక ఈ గుణాలకు అతీతమైన సత్యాన్ని దర్శిస్తే తప్ప దేశం సుభిక్షం కాదు. సత్యం ప్రేమమయమయినది. ప్రేమంటే సర్వజీవుల పట్ల, ప్రకృతి పట్ల నిరాపేక్షంగా బాధ్యతాయుతంగా నడుచుకోవటం. ప్రేమతో ఏమి చేసినా మంచిగానే వుంటుంది. ప్రతివారు ప్రేమమూర్తులై, సత్యస్వరూపులైనపుడే ప్రపంచంతో పాటు మనదేశ పరిస్థితి కూడా మారుతుంది. రాజకీయ స్వేచ్ఛకంటే వ్యక్తి మానసిక స్వేచ్ఛే ప్రధానమని జిడ్డుకృష్ణమూర్తి అనేవారు. మానసిక

స్వేచ్ఛ కల్గి సత్యస్వరూపులైన వారే దేశాన్ని పాలించటానికి అర్హులు'' అని పేర్కొన్నారు. ఈ సమావేశంలో నరసింహులు, బాల చంద్రారెడ్డి వేదపారాయణ తదితరులు పాల్గొన్నారు.

## మరణం-భయం

శ్రీకాళహస్తి, ఫిబ్రవరి 24, 1997 (ప్రభాతవార్త) : శ్రీకాళహస్తిలోని ప్రసన్నవరదరాజస్వామి ఆలయ ప్రాంగణంలో జరుగుతున్న జిడ్డు కృష్ణమూర్తి ట్రస్టు ప్రవచన సప్తాహంలో ఆదివారం రాత్రి "మరణం - భయం'' అనే అంశంపై ఆలోచనాత్మక ప్రసంగాలు సాగాయి. ఈ సప్తాహంలో జె. రఘుపతిరావు ప్రసంగిస్తూ లాభం, భద్రత మననున గాఢంగా నాటుకొన్నచోట భయముంటుంది. శరీరానికి మనస్సుకు హఠాత్ పరిణామం ఏర్పడినపుడు లేదా ఏమి జరుగనున్నదో తెలియని పరిస్థితి తటస్థించినపుడు నమ్మకాన్ని, పరాధీనతను కోరినపుడు, తనకు తాను పూర్తిగా అయోమయంలో ఉన్నపుడు భయం ఉత్పన్నమౌతుందన్నారు. చావుగురించికన్నా చావు వలన తనకు సంబంధించిన భావ, వస్తు సంచయంతో ఉన్న సహవాసమంతా పోతుందనే భయం ఎక్కువగా ఉంటుందన్నారు. మరణమంటే భౌతికమైనది ఒకటికాగా, మానసిక మరణము ఇంకొకటుంది. మానసిక మరణానికే భయడడం జరుగుతుంది. పుట్టుకపరిణామ దశల్లో భయం లేనపుడు సహజమైన మరణంపట్ల ఎందుకు భయం అంటే, ఏం జరుగుతున్నదో తెలియక భయం ఉంటుంది. తెలియని దానిపట్ల భయపడడం వివేకమా? ఈ పరిస్థితి జీవించి ఉన్నపుడే మరణించడం జరుగుతుంది. మరుపు - మత్తు సమయాలలో మనం మానసిక మరణాన్ని చవిచూస్తున్నాం. కనుక గతంపట్ల అన్ని బంధాల పట్ల ఎప్పటికప్పుడు విస్మృతి చెందుతూ భవిష్యత్తు వాంఛలు లేకుండా ఉంటే మరణభయం ఉండదు. జీవించడం మరణించడం కలిసే ఉన్నాయన్న అనుభూతి గ్రహించడం భయాన్ని పారద్రోళేకళ.

## మానసిక ప్రశాంతతకు ధ్యానం అవసరం

శ్రీకాళహస్తి, ఫిబ్రవరి 25, 1997. (ప్రభాతవార్త) : ప్రతినిత్యం వివిధ రుగ్మతలతో సతమతమౌతున్న మానవునికి మానసిక ప్రశాంతత లభించాలంటే ధ్యానం ఎంతో అవసరమని సోమవారం రాత్రి ప్రసన్నవరదరాజస్వామి ఆలయ ప్రాంగణంలో జరిగిన ప్రవచన సప్తాహం ముగింపు సభలో వక్తలు అన్నారు. ఏడురోజులపాటు వివిధ ఆధ్యాత్మిక అంశాలపై జరిగిన ప్రవచనాలు సోమవారం రాత్రితో ముగిసాయి. సోమవారం రాత్రి "ధ్యానం - చిత్తశాంతి'' అను అంశంపై జిడ్డు కృష్ణమూర్తి ట్రస్టుకు చెందిన జె. రఘుపతిరావు ప్రసంగించారు. మానవునికి దేహారోగ్యం ఎంత ముఖ్యమో మానసిక ప్రశాంతత అంతకన్నా ముఖ్యమైనది. చిత్తశాంతికి కనుగొన్న ప్రక్రియల్లో ధ్యానం గొప్పది. అయితే మంత్రం, రూపం ధ్యేయంగా పెట్టుకొని ఓ అలవాటుగా చూపే ఏకాగ్రత ధ్యానం కాదన్నారు. ఎక్కడ ఆలోచన, అహం, ప్రయోజనం ఉంటుందో అది ధ్యానం కాదు. మనసును డొల్ల చేయడమే ధ్యానం అన్నారు.

చిత్తవృత్తి నిరోధం కూడా ఘర్షణతో కూడిందే. చింతించడం ఉన్నంతకాలం అది

ధ్యానంకాదు. ఆలోచించవద్దు అవలోకించమని జపాన్‌కు చెందిన జెన్ ధ్యానం పఠించి ఏకాగ్రతలో లక్ష్యం, నిరోధం వల్ల పరిమిత ప్రయోజనం మాత్రం లభిస్తుంది. కాని సహజస్థితిలో అంతర్గతం గాను, తద్వార బహిర్గతంగాను సమస్త ఘర్షణలను తొలగించుకోవడం నిజమైన ధ్యానం. అదే మనసుకు నిండుతనం నిశ్చలత నిస్తుంది. అందులో గతముండదు. లోతుగా తెలివిగా ఎరుకగా ప్రతీకారం లేకుండా జీవించగలడు. స్వయం పరిశీలనతో కూడిన అలాంటి ధ్యాన సంగమ కళతో ఈర్ష్యాద్వేషాలతో కూడిన మాటలరణగొణధ్వనులు లుప్తమైపోతాయి. మనస్సు స్వేచ్ఛ పొంది శక్తి వంతమౌతుందన్నారు. సంపూర్ణ మౌనంలో చిత్తశాంతి లభించడమే కాక, ప్రేమజనిస్తుంది. అది ప్రయాణిస్తున్నా పని చేస్తున్నా ఏ కార్యక్రమంలో ఉన్నా, నిత్య జీవితంలో భాసిస్తుందన్నారు. ముగింపు సమావేశంలో ఏడురోజుల పాటు జరిగిన ప్రవచన సప్తాహంలోని సారాంశాన్ని, లక్ష్యాన్ని అక్బర్ బాషా సమీక్షించారు. మానవుని జీవిత సారాంశాన్ని పఠించిన ప్రవచన సప్తాహం విజయవంతంగా జరిగిందన్నారు. కె.రామమూర్తి వందనసమర్పణతో సప్తాహం సమాప్తమైంది.

## సత్యాన్వేషణలో గురువు తప్పనిసరి కాదు

తిరుపతి, మార్చి 18, 1998 (ప్రభాతవార్త) : స్వేచ్ఛాపూరిత మనస్సుతో ఎవరికి వారు సత్యాన్ని తెలుసుకోవాల్సిందే. ఇందులో ఎవరి అవగాహనన వారిదే. అధికారం, భయం, బంధం, అనుకరణలకు సత్యాన్వేషి మనస్సు లోనుకాకూడదు. అయితే ఆధ్యాత్మిక ప్రపంచంలో గురువు సర్వసాధారణంగా శిష్యుడిని అధికారానికి, భయానికి, బంధానికి, అనుకరణలకు లోను చేస్తాడు. ఇలా గురువును అనుసరిస్తున్న శిష్యుడు సత్యాన్ని ఎప్పటికీ అవగాహన చేసుకోలేడు. గురువు సత్యం తెలిసిన వాడు, నేను సత్యం తెలియని వాడిని అన్న విభజన దృష్టి, తారతమ్యం భావం కూడా సత్యాన్వేషణకు అవరోధమని కృష్ణమూర్తి చెప్పారు. నిజమైన సత్య ద్రష్ట గురువుగా వ్యవహరించడు. సత్యం చుట్టూ సంస్థలను నిర్మించడు. స్వర్గం, నరకం, దేవుడు, పాపం, పుణ్యం, కర్మ మొదలైన వాటిని కల్పించి శిష్యునిలో భయాన్ని రేకెత్తించడు. శిష్యరికాన్ని సహించడు. సత్యం పేరుతో వ్యాపారం చేయడు. సత్యం ఒకరి వ్యక్తిగత సొత్తుకాదు. సత్యం ప్రేమ పూరితమైనది. పుష్పం పరిమళాన్ని నలువైపుల వెదజల్లినట్లు సత్యద్రష్ట సత్యాన్ని నిరాపేక్షంగా పంచుకుంటాడు.

గురువు అంటే అజ్ఞానాన్ని పోగొట్టేవాడు. అయితే అజ్ఞానాన్ని పోగొట్టేది సత్యావగాహనే కాని వ్యక్తి కాదు. దీంతో గురువు గురువుగానే, శిష్యులు శిష్యులుగానే మిగిలిపోతున్నారు. కాబట్టి తాను చెప్పే సత్యాన్ని అవగాహన చేసుకోవాలంటే తనను గురువుగా స్వీకరించవద్దని జిడ్డుకృష్ణమూర్తి చెప్పారు. సత్యాన్వేషిలో సత్యాన్ని త్వరగా అవగాహన చేసుకోవాలనే బలమైన తృష్ణ ప్రధానం గానీ, సత్యాన్వేషణకు గురవుతో పనిలేదని జిడ్డుకృష్ణమూర్తి నిష్కర్షగా చెప్పారని జిడ్డుకృష్ణమూర్తి అధ్యయన కేంద్రం సభ్యులు చర్చించుకున్నారు. ఎస్. వి. ఇంజనీరింగ్ కళాశాల సమీపంలోని ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇంజనీర్స్ భవనంలో ఆధ్యాత్మిక ప్రపంచంలో గురు శిష్యుల సంబంధం అనే అంశంపై చర్చాకార్యక్రమం జరిగింది.

## ఆలోచనలు లేని నిశ్చలత్వంలో అభద్రతా భావం ఉండదు

తిరుపతి, మార్చి 25, 1998 (ప్రభాతవార్త) : మనిషి మెదడుతో రూపకల్పన చేయబడ్డదే 'మనస్సు' అని చర్చ మొదలు పెడుతూ ఒకరన్నారు. మనస్సును గురించి వేదాంతులు అనేక రకాలుగా అభివర్ణించారు. ప్రపంచం ప్రఖ్యాత తత్వవేత్త జిడ్డు కృష్ణమూర్తి 'మనస్సు - భద్రత'ల గురించి ఏమన్నారో అనే విషయమై జిడ్డు కృష్ణమూర్తి అధ్యయన కేంద్రం ఆధ్వర్యంలో చర్చాకార్యక్రమం జరిగింది. ఆ మేరకు మనస్సు అనేది సంతోషం, విజయం సంభవించినపుడు వరంలాగానూ, భయం, క్రోధం, ద్వేషం, ఓటమి వంటివి కల్గినపుడు శాపంలాగా పరిణమిస్తోంది. మనిషి శతాబ్దాలుగా సాధించిన భౌతిక ప్రగతికి మనస్సు ప్రోద్బలమే కారణం. అయితే భౌతిక జీవితం శాశ్వతం కాదని గ్రహించిన మనిషి అభద్రతా భావంతో మానసికంగానైనా శాశ్వతత్వాన్ని పొందాలనుకోవటం సహజం. అందు కోసమే దైవచింతన, మోక్షం, పునర్జన్మ, స్వర్గం, నరకం, వంటి వాటిపై విశ్వాసం ఏర్పరచుకుంటున్నాడు. ఇవన్ని కూడా పరిమిత ఆలోచనా జనితమైనవి. కాబట్టి వీటి ద్వారా కూడా పూర్తి భద్రతను పొందలేక పోతోంది మనిషి మనస్సు. మనస్సుకు కావలసింది సమగ్రమైన భద్రత, ఏ పరిస్థితిలోనూ చెక్కుచెదరని భద్రత. అయితే పరిమితమైన, అసంపూర్ణమైన జ్ఞానంతో, ఆలోచనతో దీనిని సాధించాలని చూస్తోంది.

కానీ మానవుని జ్ఞానమంతా ఆలోచనా జనితమైనదే. ఈ ఆలోచన అసంపూర్ణమైనదీ, పరిమితమైనదీ కాబట్టి అది పెంపొందించే జ్ఞానం ఎప్పటికీ అసంపూర్ణమైనదే. కాట్టి ఈ అసంపూర్ణ జ్ఞానంతో శాశ్వత భద్రతను ఎన్నటికీ సాధించలేము. ఈ పరిమితమైన 'ఆలోచన' కొనసాగించకుండా నిశ్చలత్వాన్ని పొందినపుడు ఏర్పడే మానసిక స్థితిలో 'అభద్రతా భావం' ఉండదు అని జిడ్డుకృష్ణమూర్తి అనేవారని సభ్యులు పేర్కొన్నారు. ఎస్.వి.ఇంజనీరింగ్ కళాశాల సమీపంలోని ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఇంజనీర్స్ భవనంలో జరిగిన ఈ కార్యక్రమంలో రఘుపతిరావు, వేదపారాయణ, మాధవరావు, సాంబశివారెడ్డి, చిన్నయ్య తదితరులు పాల్గొన్నారు.

## వర్తమానపు వాస్తవాల్ని చూడకుంటే మనసుకు స్వేచ్ఛ ఉండదు

తిరుపతి, ఏప్రిల్ 1, 1998 (భాతవార్త) : మానవుడి 'మెదడు' ఉనికి స్పష్టమైనది. కానీ 'మనసు' ఉనికి అస్పష్టం. అలాంటి మనసు గురించి ప్రపంచ ప్రఖ్యాత తత్వవేత్త జిడ్డు కృష్ణమూర్తి అభిప్రాయాలపై జిడ్డుకృష్ణమూర్తి అధ్యయన కేంద్రంలో చర్చ జరిగింది. ఆ మేరకు 'మనసు' ముఖ్య లక్షణం జ్ఞాపక శక్తి, జ్ఞాపకం ప్రతిస్పందనే 'ఆలోచన'. ఆలోచన కొనసాగడం వల్లనే మనసు అస్తిత్వాన్ని సంతరించుకుంటోంది. మానవుడి ఆలోచన, అనుభవం, తద్వారా పొందిన జ్ఞానం వీటి సమ్మేళనము మనసు. ఇందులో మనిషి అనుభవించిన సుఖదుఃఖాలు, రాగద్వేషాల లాంటివన్నీ ఉంటాయి. ఇవన్నీ మనిషి గతానికి సంబంధించినవే కాబట్టి మనసు అంటే 'గతం' అని కూడా అనవచ్చేమో! గతించిన ఈ అనుభవాల జ్ఞాపకాలని ఆలోచన ద్వారా కొనసాగిస్తున్నాడు మనిషి. ఈ ఆలోచనలు నిరంతరం అటు గతం గురించి, ఇటు భవిష్యత్తు గురించే ఉంటున్నాయి తప్ప "ఈ క్షణం"లో నికలకడా ఉండటంలేదు. అంటే జీవితంలోని ఈ క్షణపు నవ్యత్వం, వాస్తవాలలో మనిషి ఉండటం లేదు.

వర్తమానంలోని వాస్తవాన్ని చూడకుండా పరిభ్రమిస్తున్నాడు. ఈ విధంగా గమనం సాగిస్తున్నంత వరకు మనిషి మనసుకు స్వేచ్ఛ లేదు. స్వేచ్ఛ అంటే గతం నుండి బయట పడటం, వర్తమానంలోని కొత్తదనాన్ని చూడగలగటం. నిర్జీవమైన గతం అనుభవాన్ని ఊహామాత్రమే అయిన భవిష్యత్ అనుభవాల తాలూకు ఆలోచనల నుండి మనిషి పూర్తిగా బయట పడితే తప్ప అది సాధ్యం కాదు. ఈ రెండు రకాల అనుభవాల నీడ పడని క్షణం కాంతి వంతమైనది. అదే స్వేచ్ఛా యుతం, నిత్య నూతనం అయిన జీవితం. భౌతికమైన కాలభ్రమణం వాస్తవమైనదైతే, మనసు 'ఆలోచన' ద్వారా మరో కాల వలయాన్ని కల్పిస్తోంది అని జిడ్డుకృష్ణమూర్తి అనే వారని వక్తలు పేర్కొన్నారు. స్థానిక ఎస్.వి.ఇంజనీరింగ్ కళాశాల సమీపంలోని ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఇంజనీర్స్ భవనంలో జరిగిన ఈ కార్యక్రమంలో వేదపారాయణ, మాధవరావు, సాంబశివారెడ్డి, శంకర్ రెడ్డి తదితరులు పాల్గొన్నారు.

## సత్యాన్ని "ఎవరికివాళ్ళు" తెల్సుకోవాలి

తిరుపతి, మే 6, 1997 (ప్రభాతవార్త) : మనిషికి, మనిషికి అభిప్రాయాలలో తేడా వుంటుంది. వస్తు సముదాయంపై ఒకరి అభిప్రాయం సరైనదా కాదా అనేది పరీక్షచేసి నిర్ణయించుకోవచ్చు. కాని వాస్తవం తెలియని మానసిక విషయాలపై పలువురు వ్యక్తం చేసిన విరుద్ధ అభిప్రాయాలను పరీక్ష చేయలేము అయినా మనిషి వాటిలోని కొన్ని అభిప్రాయాలతో ఏకీభవించి లేక గుడ్డిగా అనుసరించి కట్టుబడి పోయాడు. అందులో దేవుడు, సత్యం కూడా చేరిపోయాయి. ఇలాంటి అభిప్రాయాలు చాలవరకు వాస్తవాలు కావు. ఇవి సత్యాన్ని చూపలేవు. సత్యాన్ని ఎవరికివారు స్వేచ్ఛతో స్వయంగా అవగాహన చేసుకోవాలి. వస్తువుల గురించి తెల్సుకోవటానికి ఇంద్రియాల సహాయం కావాలి. సత్యాన్ని మనసుతో అవగాహన చేసుకోవాల్సి ఉంటుంది. శారీరక అవిటితనం సత్యాన్వేషణకు అడ్డురాదు. మనసు నిశ్చలమయితే చాలు సత్యం బోధపడటానికి.

కాని మనిషి అభిప్రాయానికి కట్టుబడిపోయి తాను ఫలానా మతానికి చెందిన వాడిని అని చెప్పుకుంటున్నాడు. అలాంటి కట్టుబాట్లు, అభిప్రాయాలు ఉన్న మత బందీఖానాలో సత్యాన్ని తెల్సుకోలేరు. నిజాయితీ, నిష్కల్మషం, మానత్వం వున్న మనస్సున్నప్పుడే సత్యాన్ని తెల్సుకోగలరు. నమ్మకం అనే గుంజకు కట్టుబడిన వారికి సత్యం తెలియదు. శీలము, సత్ప్రవర్తన వున్నప్పుడు నమ్మకంతో పనేముంది? నమ్మకం మనుష్యుల్ని విడదీయటమేకాక, అసత్య ప్రచారానికి దారితీస్తుంది. ఆ ప్రచారంలో ఎప్పుడు వ్యవస్థ, ధనము, అధికారం పనిచేస్తుంటాయి. అందులో సత్యానికి చోటు ఉండదు. సత్యం అంతరంగిక ఆవిష్కరణ, సత్యం సచేతనమైంది. సత్యాన్ని కనుగొనే మనసు కూడా సచేతనంగా, స్వేచ్ఛగా ఉండాలి అని జిడ్డుకృష్ణమూర్తి అధ్యయన కేంద్రం సభ్యులు పేర్కొన్నారు. స్థానిక ఎస్.వి.ఇంజనీరింగ్ కళాశాల సమీపంలోని ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఇంజనీర్స్ భవనంలో చర్చా కార్యక్రమం జరిగింది.

